

# శ్రీభగవద్గీత

నారాయణుడు నరునికి బోధించిన మహా జ్ఞాన సంపద. అట్టి గ్రంథాన్ని పుణ్యకార్యాల్లో ఇవ్వటం ద్వారా గోవును దానం చేసిన ఫలమూ, అదే గురువుకీ, పెద్దలకీ దానం చెయ్యటం ద్వారా విద్యాదానం చేసిన ఫలమూ, పిల్లలకి బహుమతి ఇవ్వటం ద్వారా ఆరోగ్యసిద్ధి కలుగుతుంది. గృహంలో ఉండటం వల్ల కుటుంబ సభ్యులకి భీతన్నది కలగదు.





**భగవద్గీతను చదివినా,**
**గంగాజలాన్ని స్వీకరించినా,**
**శ్రీమహావిష్ణువుని సేవించినా**
**యముని వల్ల భయం లేదు.**





**యజ్ఞ యాగాదులు జరిగే ప్రదేశాల్లోనూ, దేవాలయ ప్రాంగణాల్లోనూ, ధ్యాన, గృహ, యాగ, ఆధ్యాత్మిక పారాయణ ప్రదేశాల్లోనూ, శుభకార్యాల్లోనూ శ్రీభగవద్గీత చదవటమూ, పంచటమూ గోవును దానం చేసిన ఫలం.... మిగతా ఎక్కడ చదివినా, పంచినా ఒక పండు దానం చేసిన పుణ్య ఫలమే వస్తుంది.**







# గీత యొక్క మహాసందేశ శ్లోకం....

శ్లో॥ క్లైబ్యం మాస్మగమ పార్థ నైతత్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్య క్త్వోతిష్ఠ పరన్తప ॥

**ఓ అర్జునా! అధైర్యాన్ని పొందకు. పౌరుషాన్ని వీడకు. జాలిపడుట ఉత్తమ లక్షణము కాదు. అది నీ పిరికితనము. యుద్ధానికి సిద్ధమవ్వు. అధ్యాయము 2 లో ఉన్న 3వ శ్లోకాన్నే శ్రీ వివేకానందుడు శ్రీభగవద్గీత మహా సందేశ శ్లోకంగా చెప్పి వున్నాడు.**



# శ్రీమద్భగవద్గీతా మాహాత్మ్యమ్

గీతాశాస్త్రమిదం పుణ్యం యః పఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పదమవాప్నోతి భయశోకాదివర్జితః ॥ 1
గీతాధ్యయనశీలస్య ప్రాణాయామ పరస్యచ ।
నైవ సన్తిహి పాపాని పూర్వజన్మకృతానిచ॥ 2
మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే ।
సకృద్గీతాంభసి స్నానం సంసారమలనాశనమ్ ॥ 3
గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మాద్వినిఃసృతా ॥ 4
భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిఃసృతమ్ ।
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే ॥ 5
సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 6
ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతమ్ ఏకోదేవో దేవకీపుత్ర ఏవ ।
ఏకో మంత్రస్తస్య నామాని యాని కర్మాప్యేకం తస్య దేవస్య సేవా ॥ 7





# శ్రీ గీతా మాహాత్మ్యం

**ధరోవాచ :**

భగవన్పరమేశాన భక్తి రవ్యభిచారిణీ।
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో॥ 1

"భూదేవి విష్ణుభగవానుణ్ణి అడిగింది. ఓ దేవదేవా! ఓ భగవానుడా! ప్రభూ! ప్రారబ్ధము అనుభవించేవారికి అచంచలమైన భక్తి ఎలా కలుగుతుంది?"

**విష్ణురువాచ :**

ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా।
స ముక్తస్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే ॥ 2

"శ్రీ మహావిష్ణువు పలికాడు. ఓ భూదేవీ! ప్రారబ్ధము అనుభవించినవాడు గీతాభ్యాసమును ఎవడు శ్రద్ధకలవాడై పఠిస్తాడో అట్టివాడు ముక్తుడవుతాడు. అట్టివాడికి కర్మలు అంటక ముక్తుడై ఇహలోకమున సుఖముగా ఉంటాడు."

మహాపాపాది (తి?) పాపాని గీతాధ్యానం కరోతి చేత్।
క్వచిత్ స్పర్శం న కుర్వంతి నళినీదళ మంభసా॥ 3

"తామర పత్రముపై నీరుండనట్టు గీతా ధ్యానము చేయువానికి పాపములు కొంచమైనా అంటవు."

గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే।
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై॥ 4

"ఎక్కడ గీతా గ్రంథముంటుందో, ఎక్కడ గీతను పారాయణం చేస్తారో, అచట మహా పుణ్యతీర్థాలైన ప్రయాగ వంటివి వుంటాయి."

సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చయే।
గోపాలా గోపికా వాపి నారదోద్ధవ పార్షదైః
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే॥ 5

"ఎక్కడ గీతాపారాయణము చేస్తుంటారో, అక్కడ సకల దేవతలూ, ఋషులూ, యోగులూ, నాగులూ, గోపాలురూ, గోపికలూ, నారదాది మహర్షులూ వచ్చి ఉందురు."

యత్రగీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్।
తత్రాహం నిశ్చితం పృథ్వి! నివసామి సదైవ హి॥ 6

"ఓ ధరాదేవీ! ఎక్కడ గీతను గూర్చి పఠనము, బోధన, శ్రవణములు జరుగుతున్నాయో అక్కడనే ఎల్లప్పుడూ నేను నివసిస్తాను."

గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్।
గీతా జ్ఞానముపాశ్రిత్య త్రీన్లోకాన్పాలయామ్యహమ్॥ 7

"నేను గీతను ఆశ్రయించుకొని ఉన్నాను. గీతే నాకు మందిరము. నివాసము. గీతాజ్ఞానముతోనే నేను మూడు లోకములను పాలించుతున్నాను."

గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా ॥ 8



"గీత నా పరమవిద్య. ఆది బ్రహ్మస్వరూపము. అందు సంశయము లేదు. అది నాశరహితమైనది. నిత్యమైనది. అనిర్వచనీయమైనది."

చిదానందేన కృష్ణేన ప్రోక్తా స్వముఖతోఽర్జునమ్।
వేదత్రయీ పరానందా తత్త్వార్థ జ్ఞాన మంజసా ॥ 9

"సచ్చిదానంద స్వరూపుడైన శ్రీకృష్ణ పరమాత్మచే అర్జునునికి చెప్పబడిన ఈ గీత మూడు వేదముల సారము.

పరమానంద రూపము. ఆశ్రయించిన వారికి సకల తత్త్వ జ్ఞానమును ఇస్తుంది."

యోఽష్టాదశ జపేన్నిత్యం నరో నిశ్చలమానసః।
జ్ఞాన సిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్ ॥ 10

"ఏ మనుజుడు నిశ్చలచిత్తుడై, గీత పద్దెనిమిది అధ్యాయములను నిత్యం పారాయణం చేస్తాడో అట్టివాడు జ్ఞాన సిద్ధిని పొందుతాడు. తద్వారా మోక్షమునకు అర్హుడవుతున్నాడు."

పాఠే సమర్థ స్సంపూర్ణే తదర్ధల పాఠమాచరేత్।
తదా గోదాన జం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥ 11

"శ్రీభగవద్గీతను పొంతము చదవలేని వారు సగ భాగము చదివినా అట్టి వానికి గోదానమును చేసిన ఫలం కలుగును."

త్రిభాగం పఠమానస్తు గంగాస్నానఫలం లభేత్।
షడంశం జపమానస్తు సోమయాగఫలం లభేత్ ॥ 12

"గీత యొక్క మూడవభాగము అనగా ఆరు అధ్యాయములను పారాయణం చేసినవారికి గంగాస్నాన ఫలం కలుగును. మూడు అధ్యాయములు చదివిన వారికి సోమయాగ ఫలం కలుగును."

ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తి సంయుతః।
రుద్రలోకమవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్ ॥ 13

"ఎవరైతే గీతలో ఒక్క అధ్యాయమును భక్తితో నిత్యం పఠిస్తాడో అట్టివాడు రుద్రుని లోకములో చిరకాలం ఉంటాడు."

అధ్యాయ శ్లోకపాదం వా నిత్యం యః పఠతే నరః।
స యాతి నరతాం యావత్ మనుకాలం వసుంధరే ॥ 14

"ఓ భూదేవీ! ఏ భక్తుడు గీత యందలి ఓ అధ్యాయములో నాలుగో పాలు చదువుతాడో అట్టివాడు ఒక మన్వంతర కాలం మహాయోగాలతో మానవ జన్మ పొందుతాడు."

గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్।
ద్వి త్రి రేకం తదర్థం వా శ్లోకానాం య పఠేన్నరః ॥ 15
చంద్రలోకమవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్।
గీతా పాఠ సమాయుక్తోఽ మృతో మానుషతాం వ్రజేత్॥ 16

"గీతలోని పదిశ్లోకాలు గానీ లేదా ఏడూ, అయిదూ, నాలుగూ, మూడూ, రెండూ, ఒక్కటైననూ లేదా అర్థ శ్లోకము అయిననూ పఠిస్తాడో అట్టివాడు చంద్రలోకమున పదివేల సంవత్సరాలు సుఖముగా ఉంటాడు. ఇంకా గీతను పఠిస్తూ జీవితాన్ని పూర్తి చేసిన వాడు ఉత్తమ జన్మను పొందును."

గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్।
గీతేత్యుచ్చారసంయుక్తోమ్రియమాణో గతిం లభేత్ ॥ 17

"అలా జన్మించిన వాడు గీతాభ్యాసము చేస్తూ మోక్షమును పొందగలడు. అవసాన కాలంలో గీతా, గీతా అని తలస్తూ పైలోకాలని చేరిన వాడు సద్గతిని పొందుతాడు."

గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽ పి వా।
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే ॥ 18

"మహాపాపములు చేసినవాడైనా గీతను వినటం ద్వారా, శ్రవణం చేయటం ద్వారా వైకుంఠప్రాప్తిని పొందుతాడు."



గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః।
జీవన్ముక్తస్స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్ ॥ 19

"ఎవరు గీతను నిత్యం పారాయణం చేస్తారో అట్టివాడు జీవన్ముక్తుడు. పరమపదమునకు అర్హుడు."

గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః।
నిర్ధూత కల్మషా లోకే గీతా యాతాః పరం పదమ్ ॥ 20

"ఈ భువిపై ఎందరో రాజులు గీతను ఆశ్రయించి పాపములు పోగొట్టుకొని పరమాత్మను పొందారు."

గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్।
వృథా పాఠో భవే త్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః ॥ 21

"గీతను చదివిన తర్వాత గీతా మాహాత్మ్యమును పఠించాలి. అలా చేయకపోతే పారాయణ ఫలం అందదు. అట్టివాని గీతా పఠనము శ్రమ మాత్రమే ఇస్తుంది."

ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః।
స తత్ఫలమవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్ ॥ 22

"ఈ మాహాత్మ్యముతో పాటు గీతాపారాయణం చేసినవారు అనేక ఫలములను పొంది మహా దుర్లభమగు మోక్షమును పొందును."

***సూత ఉవాచ :***

మాహాత్మ్యమేతద్గీతాయాః మయా ప్రోక్తం సనాతనమ్।
గీతాన్తే చ పఠేద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్ ॥ 23

"సూతుడు చెప్పెను. ఓ శౌనకాది మునులారా! ఇట్టి సనాతన రూపమైన గీతా మాహాత్మ్యమును మీకు చెప్పటం జరిగింది. గీతను పారాయణ చెయ్యటం ద్వారా మహా ఫలములు పొందుతారు."

**వరాహపురాణంలోని "శ్రీ గీతామాహాత్మ్యం" సమాప్తం.**



# శ్రీభగవద్గీతను పఠిస్తూ, జపిస్తూ చదివే విధానములు

శ్రీ భగవద్గీత సకల కోరికలు తీరటానికీ, దుఃఖములు పోవటానికీ, మానసిక ప్రశాంతతకూ, మోక్షమునకూ, సిరిసంపదలకూ కామధేనువు వంటిది. తెలిసీ తెలియక చేసిన పాపములను పారద్రోలునది. అమృతమయము శ్రీ భగవద్గీత.

★ సూర్యోదయమునకు ముందే లేవాలి.

★ మితాహారాన్ని స్వీకరిస్తూ పఠించాలి.

★ బ్రహ్మ చర్యము, సత్య వ్రతములు పాటించాలి. ఎక్కువ మాట్లాడటం చేయరాదు. నేలపై నిద్రించాలి.

★ ఎల్లప్పుడూ హరినామ స్మరణ చేస్తూ ఉండాలి.

★ జపాదులు చేసేవారు హింస వల్ల వచ్చిన వస్త్రమును కాక దర్భతో ఆసనమును ఏర్పరుచుకొని శ్రీకృష్ణభగవానుణ్ని ధ్యానించి ప్రారంభించాలి.



★ ఏదైనా కార్యం కోసమైతే ముందే స్మరించుకొని ఆపై శ్రీ భగవానుని ప్రార్థించి జపించాలి.

★ ఆపై శ్రీకృష్ణ భగవానుణ్ని షోడశోపచారములతో పూజించాలి.

★ జపించేటప్పుడూ, ధ్యానం చేసేటప్పుడూ మనస్సూ, చూపూ అంతా శ్రీ కృష్ణ భగవానుడిపై ఉంచి పఠిస్తే కోరిన కోర్కె తీరును.

★ కార్యసిద్ధికై జపించే వారు గీతలోని ఓ అధ్యాయమును చదివి జపించాలి.

★ గీతా పారాయణమునకు ముందు శ్రీకృష్ణుణ్ణీ, వేదవ్యాసులనూ, గీతామాతనూ, శ్రీమహాభారతాన్ని లిఖించిన విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి ప్రారంభించాలి.

★ గీతను పారాయణం చేయునప్పుడు ఇరుసేనల మధ్యనున్న శ్రీకృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ ఊహిస్తూ గీతను బోధిస్తున్న దృశ్యాన్ని మనసులో చిత్రించుకొని గీతను పారాయణం చేయాలి.

★ భగవద్గీతలో శ్లోకాల సంఖ్య ***700 : (701)***

★ ప్రతిరోజూ ఓ అధ్యాయాన్ని పూర్తిగా పారాయణం చేయాలి.

★ పారాయణం ముగిసిన పిదప గీతా మహాత్మ్యాన్ని విధిగా చదవాలి.

★ భగవద్గీత శ్రీమహావిష్ణువు ముఖతః వచ్చిన పుణ్యగీత.

★ గీతాపఠనం ద్వారా యమకింకరులు అతిదూరంలో ఉంటారు.

★ గీతాపారాయణ శబ్దం చేతనే అనేక పాపాలు భస్మమవుతాయి.

★ గీతను పఠించే వారికి రోగాలూ, రొప్పులూ, సమస్యలూ, ఆర్థిక బాధలూ, సంసార దోషములూ ఏవీ దరిచేరవు.

★ గీతను ఒక్కసారి పారాయణ చేయటం వల్ల యజ్ఞం చేసిన ఫలం వస్తుంది.

★ జలదానము, అన్నదానము, గోదానము, భూదానము, గృహ దానము, బంగారు దానము వాటిన్నింటి కంటే జ్ఞానదానం మహోన్నతమైనది. గీతను ప్రచారం చేయువారికి పై దానా లిచ్చిన ఫలం కలుగును.

★ 'గీ' అంటే గానము చేయువారిని 'త' అంటే తరింప చేస్తుందని పరమార్థం.

★ గీతను పఠించటానికి కాల నియమం లేదు. కానీ ఉదయం స్నానం చేసి శుచిగా శ్రీకృష్ణుణ్ణి పూజించి చదివితే మంచిది.

★ గీతా పారాయణం వల్ల పుణ్యం కలుగుతుంది. శ్లోకాలు చదవటం వల్ల మనసులోని మాలిన్యాలు నశిస్తాయి.

★ గీతను తొలుతగా అర్జునుడూ, రథ ధ్వజం మీది హనుమం తుడూ, సంజయుడూ, వేదవ్యాసులవారు విన్నారు.

★ గంగానది, గోవు, రావిచెట్టు, ఏకాదశి ... అట్టి వాటి కన్నా ఎంతో పవిత్రమైనది గీత.

★ భగవద్గీతలోని **700** శ్లోకాల్లో శ్రీకృష్ణభగవానుడు **574,** అర్జునుడు **84,** సంజయుడు **41,** ధృతరాష్ట్రుడు ఒక్క శ్లోకము చెప్పారు.

★ గీతను చదివేవారు హింసతో చేయని వస్త్రాలను ధరించాలి.

★ గీతాపారాయణం మొత్తం **7** రోజులు లేదా **9** రోజుల్లో పూర్తి చేయాలి లేదా రోజూ ఒక అధ్యాయమును పూర్తి చేయాలి.

★ శ్రీభగవద్గీత తల్లికీ, తండ్రికీ, పెద్దలకూ, గురువులకూ ఇవ్వటం సకల శుభకరం.





# శ్రీకృష్ణాయ నమః

జయతు జయతు దేవో దేవకీనన్దనోఽయమ్
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాఙ్గో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః॥
ఫుల్లేన్దీవరకాన్తి మిన్దువదనం బర్హావతంసప్రియమ్
శ్రీవత్సాఙ్క ముదారకౌస్తుభధరం పీతామ్బరం సున్దరమ్॥
గోపీనాం నయనోత్పలార్చితతనుం గోగోపసఙ్ఘావృతమ్
గోవిన్దం కలవేణువాదనరతం దివ్యాఙ్గభూషం భజే॥
కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యా మ్యహమ్
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తుభ్యం నమః॥
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోఽస్మ్యహమ్
కృష్ణే తిష్ఠతి సర్వ మేత దఖిలం హేకృష్ణ రక్షస్వమామ్॥
తత్త్వం ప్రసీద భగవన్ కురు మ య్యనాథే
విష్ణో కృపాం పరమకారుణిక   కిల త్వమ్।
సంసారసాగరనిమగ్న మనంత దీన
ముద్ధర్తు మర్హసి హరే పురుషోత్తమోఽసి॥
నమో నమో వాఙ్మనసాతిభూమయే
నమో నమో వాఙ్మనసైకభూమయే
నమో నమోఽనన్తమహావిభూతయే
నమో నమోఽనన్తదయైకసిన్ధవే ॥

# గీతను పారాయణము చేయుటకు ముందు పఠించాల్సిన శ్లోకములు

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తే పౌత్ర మకల్మషమ్।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్॥
అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరో హరిః।
అఫాలలోచన శ్శమ్భు ర్భగవాన్ బాదరాయణః॥
సమ్యజ్న్యాయకలాపేన మహతా భారతేనచ।
ఉపబృంహిత వేదాయ నమో వ్యాసాయ విష్ణవే॥
సారథ్య మర్జున స్యాదౌ కుర్వన్ గీతామృతం దదౌ।
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః॥
ప్రపన్నపారిజాతాయ వేత్రతోత్రైకపాణయే।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః॥
కరకమలనిదర్శితాత్మముద్రః
పరికలితోన్నతబర్హిబర్హచూడః।
ఇతరకరగృహీతవేత్రతోత్రో
మమ హృది సన్నిధి మాతనోతు శౌరిః॥
అగ్రే కృత్వా కమపి చరణం జాను నైకేన తిష్ఠన్।
పశ్చాత్పార్థం ప్రణయరసజుషా చక్షుషా వేక్షమాణః॥
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా।
మాబిభ్రాణో రథ మధివసన్ పాతు న స్సూతవేషః॥
కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్॥
కృష్ణాయ యాదవేన్ద్రాయ జ్ఞానముద్రాయ యోగినే।
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాన్తవేదినే॥





# శ్రీభగవద్గీతామాహాత్మ్యము

గీతాశాస్త్ర మిదం పుణ్యం య పఠేత్ ప్రయత పుమాన్
విష్ణో పద మవాప్నోతి భయశోకాదివర్జితః॥
గీతాధ్యయనశీలస్య ప్రాణాయామపరస్యచ
నైవ సన్తిహి పాపాని పూర్వజన్మకృతానిచ॥
మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే।
సకృ ద్గీతామ్భసి స్నానం సంసారమలమోచనమ్॥
గీతా సుగీతా కర్తవ్యా కి మన్యై శ్శాస్త్రసఙ్గ్రహైః।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా॥
భారతామృతసర్వస్వం విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్।
గీతాగఙ్గోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే॥
సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః।
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥
ఏకం శాస్త్రం దేవకీపుత్రగీత, మేకో దేవో దేవకీపుత్రఏవ।

ఏకోమన్త్రస్తస్యనామానియాని, కర్మాప్యేకంతస్యదేవస్య సేవా॥

ఓమ్॥ అస్య శ్రీభగవద్గీతామహామన్త్రస్య

భగవాన్ వేదవ్యాసః ఋషిః

అనుష్టుప్ ఛన్దః

శ్రీకృష్ణ పరమాత్మా దేవతా

అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ఇతిబీజమ్

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ఇతిశక్తిః

అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

ఇతికీలకమ్

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః

ఇత్యంగుష్ఠాభ్యాం నమః

నచైనం క్లేదయ న్త్యాపో నశోషయతి మారుతః

ఇతి తర్జనీభ్యాం నమః

అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్య ఏవచ

ఇతిమధ్యమాభ్యాం నమః

నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽ యం సనాతనః

ఇత్యనామికాభ్యాం నమః

పశ్యమే పార్థ రూపాణి శతశో-థ సహస్రశః

ఇతికనిష్ఠికాభ్యాంనమః

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ

ఇతి కరతలకర పృష్ఠాభ్యాంనమః

ఇతి కరన్యాసః

అథహృదయాదిన్యాసః.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః



ఇతి హృదయాయ నమః

న చైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః

ఇతి శిరసేస్వాహా

అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్యఏవచ

ఇతి శిఖాయైవషట్

నిత్యస్సర్వగతః స్థాణు రచలోఽ యం సనాతనః

ఇతి కవచాయహుమ్

పశ్య మే పార్థ రూపాణి శతశోఽ థ సహస్రశః

ఇతి నేత్రద్వయాయ వౌషట్

నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ ఇత్యస్త్రాయఫట్

శ్రీకృష్ణప్రీత్యర్థే పాఠే వినియోగః

★★★★★★

# ప్రార్థన

**కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం**

**నాసాగ్రేవరమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।**

**సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠే చ ముక్తావళీ**

**గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥**

ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై యెవ్వనియందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం బెవ్వడనాదిమధ్యలయుడెవ్వడు సర్వము తానయైన వాడెవ్వడు వాని నాత్మభవునీశ్వరునే శరణంబు వేడెదన్ ॥

# శ్రీకృష్ణాష్టోత్తరశతమ్

శ్రీకృష్ణః కమలనాథో వాసుదేవ స్సనాతనః।
వసుదేవాత్మజః పుణ్యో లీలామానుషవిగ్రహః॥ ౧
శ్రీవత్సకౌస్తుభధరో యశోదావత్సలో హరిః।
చతుర్భుజాత్తచక్రాసిగదాశఙ్ఖాద్యుదాయుధః॥ ౨
దేవకీనన్దన శ్శ్రీశో నన్దగోపప్రియాత్మజః।
యమునా వేగసంహారీ బలభద్రప్రియానుజః॥ ౩
పూతనాజీవితహర శ్శకటాసురభఞ్జనః।
నన్దవ్రజజనానన్దీ సచ్చిదానన్దవిగ్రహః॥ ౪
నవనీతవిలిప్తాఙ్గో నవనీతనటోఽనఘః।
నవనీతనవాహారో ముచికున్దప్రసాదకః॥ ౫
షోడశస్త్రీసహస్రేశ స్త్రిభంగీ మధురాకృతిః।
శుకవాగమృతాబ్ధీన్దు ర్గోవిన్దో యోగినాంపతిః॥ ౬
వత్సవాటచరోఽనన్తో ధేనుకాసురభఞ్జనః।
తృణీకృతతృణావర్తో యమళార్జునభఞ్జనః॥ ౭
ఉత్తాలతాలభేత్తాచ తమాలశ్యామలాకృతిః।
గోపగోపీశ్వరో యోగీ కోటిసూర్యసమప్రభః॥ ౮
ఇళాపతిః పరంజ్యోతి ర్యాదవేన్ద్రో యదూద్వహః।
వనమాలీ పీతవాసా పారిజాతాపహారకః॥ ౯
గోవర్ధనాచలోద్ధర్తా గోపాల స్సర్వపాలకః।
అజో నిరఞ్జనః కామజనక కఞ్జలోచనః॥ ౧౦
మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ।



బృన్దావనా న్తసఞ్చారీ తులసీదామభూషణః॥ ౧౧
శమన్తకమణే ర్హర్తా నరనారాయణాకృతిః।
కుబ్జాకృష్ణాంబరధరో మాయీ పరమపూరుషః॥ ౧౨
ముష్టికాసురచాణూర మల్లయుద్ధవిశారదః।
సంసారవైరీ కంసారి ర్మురారి ర్నరకాన్తకః॥ ౧౩
అనాదిబ్రహ్మచారీచ కృష్ణావ్యసనకర్శకః।
శిశుపాలశిరశ్ఛేత్తా దుర్యోధనకులాన్తకః॥ ౧౪
విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః।
సత్యవా క్సత్యసఙ్కల్ప స్సత్యభామారతో జయీ॥ ౧౫
సుభద్రాపూర్వజో విష్ణుర్భీష్మముక్తిప్రదాయకః।
జగద్గురు ర్జగన్నాథో వేణునాదవిశారదః॥ ౧౬
వృషభాసురవిధ్వంసీ బాణాసురకరాన్తకః।
యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హిబర్హావతంసకః॥ ౧౭
పార్థసారథి రవ్యక్తో గీతామృతమహోదధిః।
కాళీయఫణిమాణిక్యరఞ్జితశ్రీపదామ్బుజః॥ ౧౮
దామోదరో యజ్ఞభోక్తాదానవేన్ద్రవినాశకః।
నారాయణ పరంబ్రహ్మ పన్నగాశనవాహనః॥ ౧౯
జలక్రీడాసమాసక్తగోపీవస్త్రాపహారకః।
పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః॥ ౨౦
సర్వతీర్థాత్మక స్సర్వగ్రహరూపీ పరాత్పరః।
ఏవం శ్రీకృష్ణదేవస్య నామ్నా మష్టోత్తరం శతమ్॥ ౨౧
కృష్ణనామామృతంనామ పరమానన్దకారకమ్ ।
అత్యుపద్రవదోషఘ్నం పరమాయుష్యవర్ధనమ్॥ ౨౨

**ఇతి శ్రీకృష్ణాష్టోత్తరశతం సంపూర్ణమ్.**

# శ్రీకృష్ణాష్టకమ్

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్।
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
అతసీపుష్పసఙ్కాశం హారనూపురశోభితమ్।
రత్నకఙ్కణకేయూరం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
కుటిలాలకసంయుక్తం పూర్ణచన్ద్రనిభాననమ్।
విలసత్కుణ్డలధరం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
మన్దారగన్ధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్।
బర్హిపిఞ్ఛావచూడాఙ్గం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
ఉత్ఫులపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితమ్।
అవాప్తతులసీగన్ధం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
గోపికానాం కుచద్వన్ద్వకుఙ్కుమాఙ్కితవక్షసమ్।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
శ్రీవత్సాఙ్కం మహోరస్కం వనమాలావిరాజితమ్।
శఙ్ఖచక్రధరందేవం కృష్ణం వన్దే జగద్గురుమ్॥
కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్।
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి॥



# ఏకశ్లోకీ గీత

***యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।***
***తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ॥***
***(భ. గీ. 18-78)***

ఎచట యోగీశ్వరుడగు శ్రీకృష్ణమూర్తియు, ఎచట ధనుర్ధారి యగు అర్జునుడును ఉందురో, అచ్చోట లక్ష్మి, విజయము, ఐశ్వర్యము, నీతి తప్పక ఉండునని నా నిశ్చయము. (సంజయుడు)

గీతను చెప్పింది శ్రీకృష్ణభగవానుడు. పాండవులలో అర్జునుడిని కూడా నేనే అని విభూతి యోగంలో శ్రీకృష్ణ భగవానుడు శెలవిచ్చాడు. కాన శ్రీభగవద్గీతను చెప్పిందీ, విన్నదీ శ్రీకృష్ణుడే. అలాగే శ్రీభగవానుడు మునులలో వేదవ్యాసుడిని నేనే అని చెపుతాడు. కాన వ్రాసింది శ్రీకృష్ణుడే.

★ గీత అధ్యాయములు - 18
★ మహాభారత యుద్ధం జరిగింది 18 రోజులు
★ మహాభారత గ్రంథములోని పర్వములు 18
★ యుద్ధంలో పాల్గొన్న సైనికసంఖ్య 18 (అక్షౌహిణులు)
★ 21870 ఏనుగులు - కలుపుకుంటూ లెక్కిస్తే 18 వస్తుంది
★ 21870 రథములు - కలుపుకుంటూ లెక్కిస్తే 18 వస్తుంది.
★ 65610 గుర్రములు - కలుపుకుంటూ లెక్కిస్తే 18 వస్తుంది.
★ 109350 కాలిబంట్లు - కలుపుకుంటూ లెక్కిస్తే 18 వస్తుంది.(ఇది ఒక అక్షౌహిణి)



# గీతకు గల 18 పేర్లు

1. గీతా గంగాచ గాయత్రీ సీతా సత్యా సరస్వతీ ।
బ్రహ్మవిద్యా బ్రహ్మవల్లీ త్రిసంధ్యా ముక్తిగేహినీ ॥
2. అర్థమాత్రా చిదానందా భవఘ్నీ భ్రాన్తినాశినీ ।
వేదత్రయీ పరాఽనన్తా తత్త్వార్థ జ్ఞానమంజరీ ॥
3. ఇత్యేతాని జపేన్నిత్యం నరో నిశ్చలమానసః।
జ్ఞానసిద్ధిం లభేచ్ఛీఘ్రం తథాఽన్తే పరమం పదమ్ ॥

### గీతకు ఈ క్రిందిపేర్లు కలవు :

| | | |
|---|---|---|
| 1. గీత | 2. గంగ | 3. గాయత్రి |
| 4. సీత | 5. సత్య | 6. సరస్వతి |
| 7. బ్రహ్మవిద్య | 8. బ్రహ్మవల్లి | 9. త్రిసంధ్య |
| 10. ముక్తిగేహిని | 11. అర్థమాత్ర | 12. చిదానంద |
| 13. భవఘ్ని | 14. భ్రాన్తినాశిని | 15. వేదత్రయి |
| 16. పర | 17. అనంత | 18. తత్త్వార్థజ్ఞానమంజరి |

ఈ పద్దెనిమిది గీతకు గల నామములు. వీటిని స్థిర చిత్తముతో ఎవరైతే నిత్యం జపిస్తుంటాడో అట్టివానికి శ్రీఘ్రముగా జ్ఞానసిద్ధి కలుగుతుంది. పరమపదం అందుతుంది.



# సప్తశ్లోకీగీత

1. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్. (8-13)

2. స్థానే హృషీ కేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః. (11-36)

3. సర్వతః పాణిపాదం తత్సర్వతో-క్షి శిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి. (13-14)

4. కవిం పురాణ మనుశాసితార
మణోరణీయాంస మనుస్మరేద్యః
సర్వస్య ధాతార మచిన్త్యరూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్. (8-9)

5. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. (15-1)

6. సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో
వేదాన్త కృద్వేదవిదేవ చాహమ్. (15-15)

7. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః.(9-34)



# శ్రీ భగవద్గీతలోని కొన్ని అద్భుత అమృత గుళికలు

★ సుగుణాలలో ధైర్య, నిర్భయాలు చాలా ముఖ్యమైనవి.

★ సుఖదుఃఖాల యందు స్థిరభావములుండటయే ధీరత్వము.

★ సమబుద్ధి భావంతో కర్మలను ఆచరిస్తే ఎట్టి పాపదోషములు అంటవు.

★ స్వకర్మలో దోషమున్నా వదలకూడదని భగవానుడు స్థిరంగా చెబుతున్నాడు.

★ ఆకలికి గుప్పెడు మెతుకులు చాలు. అలాగే దాహానికీ కాసిని నీళ్ళు చాలు. అన్నపురాసులూ, సరస్సులూ అవసరం లేదు. అట్లే మోక్షమునకు ఏ మంత్రమో, ఉపాసనమో చాలును.

★ ఫలము ఆశించి చేసే కర్మలన్నీ మహా నికృష్టమైనవి.

★ సూదిలోకి దారాన్ని ఎక్కించాలంటే చేయి వణకకూడదు. అలాగే దారపు కొన సన్నగా ఉండాలి. అట్లే చంచల మనస్సు గలవారు అనగా ఏకాగ్రత లేనివారు భగవంతుణ్ని దర్శింపలేరు.

★ తాబేలు తన అవయవములని లోనికి ఇముడ్చుకున్నట్టు సాధకుడు ఇంద్రియార్థముల నుంచి ఇంద్రియములను వెనక్కి మరల్చుకోవాలి.



★ మనోహరమైనదీ, దివ్యమైనదీ అయిన 'శాంతి'ని మనుజుడు ఇంద్రియాలను జయించి మాత్రమే పొందగలడు.

★ మోక్షము అనగా బంధనము నుంచి విముక్తి అని పరమార్థం.

★ సకల యజ్ఞములకీ భోక్త ఆ పరమాత్మయే.

★ మోక్షము లభించని యెడల సదా కర్మలను బట్టి ఆయా జన్మలను ఎత్తవల్సిందే.

★ అగ్నీ, వెలుగూ, పగటిపూటా, శుక్లపక్షమూ, ఉత్తరాయణమూ ఇట్టి సమయాల్లో వెళ్ళిన బ్రహ్మవేత్తలు బ్రహ్మములు పొందు తున్నారు. పొగ, రాత్రి, దక్షిణాయణము అను అంధకార మార్గాల్లో అజ్ఞానులు వెళుతున్నారు.

★ కోటానుకోట్ల జన్మల తర్వాత అనగా పశు, కీటకం వంటిజన్మల న్నింటి తర్వాత మానవ జన్మ వచ్చేది మోక్షాన్ని పొందమని.

★ పొగ చేత అగ్నీ, మురికి చేత అద్దమూ, మావి చేత శిశువూ కప్పబడినట్టు అజ్ఞానముతో జ్ఞానము కప్పబడి ఉండును.

★ ఎన్నో జన్మల పుణ్య ఫలంగా మానవ జన్మ కలుగుతుంది.దాన్ని దైవచింతనతో గడపక సుఖలోలుడై, నీచ ప్రవర్తనలతో జీవనం సాగిస్తే మళ్ళీ వచ్చేది కీటక జన్మలే.

★ పూర్వ జన్మ కర్మ ఫలాలు, ఇహ జన్మ పుణ్యాలు ఎప్పుడూ భయంకరంగా పోట్లాడుకుంటూనే ఉంటాయి. కాన ఇహ జన్మలో ఎంత వీలయితే అంత పుణ్యం చేయటం ద్వారా పూర్వ జన్మ పాపాల నుంచి రక్షించుకొనగలుగుతాము.

★ పాపాలు ఎవరూ కావాలని చేయరు. కానీ బలవంతంగా ఇష్ట పూర్తిగా చేయించేది కామమే.

★ కామం శాస్త్రజ్ఞానాన్నీ, అనుభవ జ్ఞానాన్నీ పోగొట్టటమే కాదు అనేక పాపాలను మనుజుల చేత చేయిస్తుంది.

★ జగత్తునందు ప్రతివస్తువూ, ప్రతికార్యమూ పరమాత్మ స్వరూపమే.

★ మీ పాపాల దోషాలు కొండంత వున్నా, మహా కట్టెల రాశిని అగ్ని ఎలా బూడిద చేస్తుందో యోగసిద్ధిని పొందటము ద్వారా సకల పాపాలూ సమసిపోతాయి.

★ జ్ఞానం లేనివాడూ, అనేక సందేహాలున్న వాడూ, ఏకాగ్రతలు లేనివాడూ..ఇట్టివానికి ఇక్కడా, అక్కడా, ఎక్కడా సుఖముండదు.

★ ధ్యానం తాలూకూ అనుభూతి అతిగా తినేవారికీ, అసలు తినని వారికీ, ఎక్కువగా నిద్రపోయేవారికీ, నిద్ర తక్కువపోయేవారికీ అందదు.

★ పరమాత్మ సమస్తము యందు వున్నాడు. భగవానుడుసూర్యుడిలో కాంతీ, అగ్ని యందు ప్రకాశమూ, నీటిలోని రుచీ, వేదాలలో ఓంకారమూ, ప్రాణులలో జీవమూ... అలా సకలము పరమాత్మే. దీన్ని గ్రహించిన వాడు యోగి అవుతాడు.

★ భగవంతుని సేవింపని వారూ, ధ్యానించనివారూ ఈ మహా మాయా సముద్రాన్ని దాటలేరు. ఆశ్రయించిన వారు తెలియ కుండానే దాటి వేస్తున్నారు.

★ మహా భయంకరమైన సంసార సముద్రమును భగవద్గీత అనే నావ ద్వారా దాటవచ్చు.

★ అర్జునుని రథ ధ్వజంపై హనుమ వుండటం వల్ల అర్జునుడికి కపిధ్వజుడన్న నామం ఏర్పడింది.

★ గీతలో రెండవ అధ్యాయము 10వ శ్లోకము వరకూ పూర్వపీఠిక.

★ ఎక్కడ శ్రీభగవద్గీత వుంటుందో, అక్కడ శ్రీకృష్ణ భగవానుడు వుంటాడు. ఎక్కడ శ్రీకృష్ణుడు వుంటాడో అక్కడ శ్రీభగవద్గీత వుంటుంది.



★ శ్రీకృష్ణుని రథ అశ్వాల పేర్లు శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘ పుష్పమూ, వలాహకము.

★ కురుక్షేత్ర సంగ్రామం జరిగిన ప్రాంతం ఉత్తర భారతదేశంలో ఉంది.

★ కురుపాండవులిరువురూ కౌరవులే. కౌరవ వంశానికి చెందిన పాండురాజు పుత్రులను పాండవులని పిలుస్తారు.

★ శ్రీభగవద్గీత అనగా శ్రీభగవానుడి చేత గానం చేయబడినదని అర్థం.

★ శ్రీభగవద్గీతకు పుష్పములూ, నైవేద్యాలూ భక్తీ, శ్రద్ధలే.

★ సంజయుడు అనగా ఇంద్రియ నిగ్రహము కలవాడని అర్థం.

★ కురుక్షేత్రం జరిగిన ప్రదేశము పంజాబులోని అంబాలాకి దగ్గరలో ఉంది. ఇంద్రాది, అగ్ని, బ్రహ్మలు తపస్సు చేసిన పుణ్య ప్రదేశం కూడా.

★ శ్రీకృష్ణ భగవానుణ్ని శరణు వేడినందుకు మీరాబాయికి ముండ్ల పాన్పు హంసతూలికా తల్పమయింది.

★ గీతా జయంతి మార్గశిర శుద్ధఏకాదశి.

★ భగవద్గీతను చదవటం ద్వారా భగవంతుని పూజించిన ఫలం కలుగుతుంది.

★ 11వ అధ్యాయంలోని 39వ శ్లోకం చదువుతూ వేపమండతో పీడలు పట్టిన వారిని కొడితే దోషాలు పోతాయి.

★ మహాభారతంలో శ్రీభగవద్గీత భీష్మపర్వంలో 25వ అధ్యాయం నుండి 42వ అధ్యాయం వరకు కలదు.

★ శ్రీభగవద్గీతను అనగా 700శ్లోకాలనూ, భావాలనూ 90ని॥లలో చదవచ్చు.

# భగవానుడు శ్రీ కృష్ణుడు అర్జునుడికి బోధించిన శ్రీ భగవద్గీతలో అతి రహస్యమైన, గొప్పవైన విషయాలు కొన్ని.

## స్థిత ప్రజ్ఞుడనగా?

దుఃఖములకు వ్యథ చెందకుండా, సుఖాలపై ఆసక్తి లేకుండా, రాగభయక్రోధాలు లేకుండా, సకల కర్మ ఫలముల యందు సమభావంతో నుండు వాడు స్థితప్రజ్ఞుడు.

## పంచసూనములనగా?

నిత్య దైనందిక సమయాల్లో, పూలుకొనేటప్పుడూ, నడిచేటప్పుడూ, నిద్రించేటప్పుడూ, ఇల్లు ఊడ్చేటప్పుడూ ప్రాణిహింస జరుగుతుంది. వాటి దోషాలను అనగా పంచసూనములను పాపములు పంచయజ్ఞాల ద్వారా, హోమముల ద్వారా, పితృదేవతలకి తర్పణములు వదలుట ద్వారా, అతిథులను పూజించటం ద్వారా, వేద పురాణ ఇతిహాసాలు చదవటం ద్వారా, సాధుజంతువులకి ఆహారము పెట్టడం ద్వారా సమసిపోతాయి.

## జ్వరములు ఎన్ని రకాలు?

ఆహార, నీటి, వయసుల వల్ల వచ్చే జ్వరము మొదటిది. అది ఔషధుల వల్ల తొలగిపోతుంది. రెండవది బాహ్య జ్వరము అంటే మానసికమైనది. సంసార సంబంధితమైనది. అట్టి తీవ్ర జ్వరము దైవ సంపదను ఔషధం ద్వారా పోతుంది. దైవసంపద ఆధ్యాత్మిక చింతన ద్వారా భగవంతునిపై మనసు పెడితే కలుగుతుంది.



## మహాభయంకరమైన నిత్య శత్రువు?

ఎంత వైరం కలిగిన స్నేహితుడైనా తిరిగి మిత్రుడవ్వవచ్చు. మహా బలవంతమైన సర్పము కూడా ఎందుకులే అని వదిలేసి వెళ్ళవచ్చు. అవి అనిత్య శత్రువులు.

కాని నిత్య శత్రువు కామమే. ఎన్ని జన్మలు ఎత్తినా, ఎంత అనుభవించినా ఇంకా ఇంకా కావాలని అంటుంది. మహా సముద్రంలోకి ఎంత నీరు వెళ్ళినా చాలదన్నట్టు శరీరం కామాన్ని కోరుతూనే ఉంటుంది. కాన ఆ నిత్య శత్రువును పారద్రోలినప్పుడే శాంతి, సుఖము, మోక్షము.

## భగవంతుడు ఎప్పుడు అవతరిస్తాడు?

ధర్మం నశించి అధర్మం పెచ్చుమీరిపోయినప్పుడూ, సాధు సంరక్షణకై, ధర్మసంస్థాపనమునకు ఒక్కరి కోసమైనా, ఇద్దరి కోసమైనా, ముగ్గురి కోసమైనా శ్రీ భగవానుడు అవతరించి కాపాడతాడు.

## పండితుడనగా?

ఐహిక జీవితానికి కావాల్సిన విద్యలను నేర్చుకున్న వాడు పండితుడు కాదు. హృదయము నిర్మలత్వం కలిగి, కామమును దరిచేరనీయక, కార్యాల కోసం, కోరికల కోసం కర్మలను చేయడో, ఏదీ ఎవరి నుంచి ఆశించడో, అలాగే తన కర్మ లన్నింటికీ ప్రతిఫలం ఆశించక వచ్చే ఫలాన్ని స్థిర భావంతో, సమభావంతో గ్రహిస్తాడో అట్టివాడు పండితుడు.

## కర్మలు చేసినా పాపములు అంటకుండా ఉండాలంటే?

కోరికలు లేకుండా, ఇంద్రియాలను ఇంద్రియార్థములుపై పోనియ్యకుండా సాటి వారి నుంచి దేన్నీ ఆశించకుండా వుండేవాడూ, స్వకర్మలు చేసేవాడూ కర్మల తాలూకు పాపాలని పొందడు.

## తెలిసీ తెలియక చేసిన హింసలనీ, పాపాలనీ ఏ యజ్ఞం ద్వారా పోగొట్టుకోవాలి?

వ్యవసాయం చేసేటప్పుడు నాగలి కఱ్ఱకి తగిలి ఎన్నో జీవులు మరణిస్తాయి. అట్టి దోషాలకి బ్రహ్మయజ్ఞము చేయాలి. నీటిని ఉడకబెడుతున్నందుకు కలిగే దోషాలు సాటి ప్రాణులకు అన్నదానము చెయ్యటం ద్వారా పోతాయి. ఇల్లు శుభ్రం చేస్తున్నప్పుడు ఎన్నో క్రిమికీటకాలు చనిపోతాయి. అట్టి వాటితో పాటు అహింసా ద్వేషాల వల్ల కలిగే దోషాలను పోగొట్టు కోవటానికి అతిథులనూ, అనాథలనూ, అంగ వైకల్యము ఉన్న వంటి వారిని ఆదుకొని భోజనాదులతో తృప్తి పరచాలి. ఇంతటి ధర్మ సూక్ష్మాలని శ్రీ భగవానుడు శ్రీ భగవద్గీతలో 18వ అధ్యాయంలో చెప్పాడు.

## దుఃఖాలకి కారణమయ్యే ఆహారము?

ఉప్పు, పులుపు, కారంతో వున్నవి. చేదుగలవి. బాగా వేడి ఉన్నవీ, ఇవి అవేశాన్నీ, ఉద్రేకాన్నీ కలిగించేవీ, కడుపును మండించేవీ, అతిగా దాహాన్ని కలగచేసేవి. దుఃఖాలకీ, రోగాలకీ హేతువులు.



## పాపకర్మల ఫల ఆహారము?

ఎన్నో గంటల ముందు వండినది. సరిగా ఉడకనిది. పాసిపోయింది. ఎంగిలి చేసినది. అపవిత్రమైనది. భగవంతునికి నివేదింపనిది. ఇది తామసాహారము. అనారోగ్యాన్ని కలిగిస్తుంది. చెయ్యాల్సిన కీడంతా చేస్తుంది. ఈ ఆహారము ప్రాప్తించటమంటే ఎంతో పాపం చేసిన దాని ఫలితంగా ఈ ఆహారాన్నే ప్రీతితో తింటున్నట్టు క్రింద. (భర్త తినగా తినేది పై ఆహారం క్రిందరాదు. ఎందుకంటే భార్యాభర్తలు ఇరువురు కాదు.. ఒక్కరే. కాన ఎంగిలి అన్న ప్రసక్తి లేదు)

## దానము ఎలా చేయాలి?

సదుద్దేశ్యంతోనూ, మర్యాదతోనూ, ఆదరముతోనూ ఇవ్వాలి. లోపల తిట్టుకుంటూ ఇవ్వకూడదు. అలా కాకుండా కీర్తి కోసం, ఆడంబరము కోసం ఇస్తే కీడు కలుగుతుంది. దాన ఫలం కలగదని పదిహేడవ అధ్యాయంలో శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునుడికి బోధించాడు.

## గీతా శాస్త్రాన్ని ఎవరికి బోధిస్తే పాపం?

తపము లేని వారికీ, భగవంతునిపై భక్తి లేనివారికీ, పెద్దల యెడల భక్తిలేనివారికీ, భగవత్ దూషణ చేయువానికీ ఇవ్వరాదు, బోధించరాదు. అలా చేస్తే అపాత్రునికి దానమిచ్చిన దోషము కలుగును. అన్నింటికీ మించి శ్రీ భగవద్గీత లోపాలను గూర్చి మాట్లాడటం, వాదించటము అన్నింటికీ మించి దోషమని శ్రీ భగవానుడు శెలవిస్తున్నాడు. ఈ శ్రీ భగవద్గీతను చదవటం

వల్ల జ్ఞానయజ్ఞం చేసిన ఫలం వచ్చును. శ్రీ భగవద్గీత గీతా శాస్త్రము పుణ్యమైనది. మననం చేసుకున్న కొలదీ సంతోషమను పుణ్యం ఎక్కువ అవుతుంది.

## భగవానునికి ఎవరిపై ఎక్కువ ప్రీతి?

సకల ప్రాణికోటిపై ద్వేషము లేనివాడూ, స్నేహ భావము కలవాడూ, కరుణా దయలు కలవాడూ, మమకారములతో పాటు అహంకారము లేనివాడూ, మంచీ చెడుల యందూ, సుఖ దుఃఖాల యందూ సమమైన భావాలు కలవాడూ, స్థిర మనస్సు గలవాడూ, ఇంద్రియ నిగ్రహాలతో దృఢ నీతికలవాడూ, భక్తి శ్రద్ధలు కలవాడూ, ఫలాపేక్ష లేనివాడూ, శుచికలిగిన వాడూ, కార్య సమర్ధత కలిగినవాడూ, దుఃఖము లేనివాడూ, సంతృప్తికలవాడూ .... ఇట్టి వాడు నాకు ప్రీతి కరుడని పన్నెండవ అధ్యాయములో శ్రీ భగవానుడు చెప్పెను.

## ఆధ్యాత్మిక కార్యాలప్పుడు భోజనానికి ముందు ఏం చేయాలి?

నాలుగు విధాలు. పళ్ళచే కొరికి తినేవి భక్ష్యములు. నాలుకతో చప్పరిస్తూ మింగేవి భోజ్యములు. ఇక మూడోది లేహ్యము. నాలుకతో గ్రహించి తీసుకునేవి. నాలగోది చోష్యములు. మజ్జిగ, చారు, పాయసముల వంటివి. అలాగే అతిగా తినరాదు. తినేది ధర్మపర న్యాయపరమైనవి అయి ఉండాలి. ముందుగా భగవంతునికి అర్పించి తినాలి. ఎందుకంటే తిన్నది మననమే అనుకుంటాము. కాని లోపల పరమాత్మ జఠరాగ్ని రూపంలో ఉంటాడు. అధర్మపద్ధతిలో, తప్పుడు



పద్ధతిలో సాధించిన దాన్ని అధికంగా తీసుకున్నా ఫలం తప్పదు. అది రోగం రూపేణ కావచ్చు, మరో రూపేణా కావచ్చు. అనుభవించాల్సిందే. అలాగే ఆధ్యాత్మిక కార్యకలాపాల్లో 15వ అధ్యాయములోని పధ్నాలుగో శ్లోకాన్ని చదివి ఆపై భుజించాలి. గృహస్థులూ, భక్తులూ, ఆధ్యాత్మిక పరులూ కూడా పై శ్లోకాన్ని పఠించి తినటం ద్వారా ఆహారాన్ని భగవంతునికి పెట్టి తినటం క్రింద వస్తుంది.

## తమోగుణ లక్షణాలు?

అజ్ఞానము వల్ల ఈ తమోగుణం కలుగుతుంది. అవివేకాన్ని వృద్ధి చేస్తుంది. బాగా నిద్రపొమ్మని చెబుతుంది. ఏ పనీ చేయొద్దని చెబుతుంది. మత్తుగా గడపాలని మనస్సు బోధిస్తుంటుంది. ఏ విషయం పట్టించుకోవద్దని చెబుతుంది. ఇవ్వాళ గాకపోతే రేపు చేయొచ్చుని చెబుతుంది. కాన వాటిని వదిలెయ్యకపోతే శాశ్వత చీకట్లను నరకం తప్పదు. శాంతి కావాలనుకుంటే రజోగుణాలనూ, తమోగుణాలనూ వది లెయ్యాలి.

## ఆయుష్షును పెంచే ఆహారము?

రసవంతములు గలవి (పాలు.. కొబ్బరినీరు...పెరుగు, పళ్ళు..), చమురు గలవి శరీరమందు చాలా కాలముంటాయి. ఆయుష్షును పెంచుతాయి. సత్త్వగుణాలని ఇస్తాయి. దేహబలాన్నీ, ఆరోగ్యాన్నీ, సుఖ సంతోషాలనీ ఇస్తాయి.

## జ్ఞానము యొక్క లక్షణాలు?

తన గూర్చి తాను పొగుడుకోకుండా వుండుటా, అహంకారము లేకుండుటా, సహనంతో వుండుటా, పెద్దల

యెడల భక్తీ, గౌరవాదులూ కలిగి ఉండుటా, ఇంద్రియ నిగ్రహమూ, దుఃఖములు లేకుండుటా, సంసార వ్యామోహ ములను వదలుటా, ఏకాంతంగా వుండుటా, ఆధ్యాత్మిక విషయాలపై ప్రీతీ... ఇవి జ్ఞానుల యొక్క గుణములని శ్రీ భగవానుడు పదమూడో అధ్యాయంలో చెప్పెను.

## జీవుడు వెళుతూ వెళుతూ ఏం తీసుకెళ్తాడు?

మనస్సులోనూ, ఇంద్రియాలలోనూ ఉన్న జ్ఞాన సంస్కారమును తీసుకెళ్తున్నాడు. అనగా సకల కర్మ ఫలాలను తనతో తీసుకెళ్తున్నాడు. చేసిన యజ్ఞాలూ, దానాలూ, మంచీ చెడులనూ, పుణ్యాలనూ తీసుకెళ్తున్నాడు. అలాగే చేసిన సకల దోషాలను కూడా తీసుకెళ్తున్నాడు. అందుకే జన్మజన్మల కర్మఫలమనేది. కాన భగవానుడికి ఎలాంటి పక్షపాతము లేదు. నీవు చేసిన కర్మని బట్టే ఈ జన్మ ఉంది. ఈ జన్మ కర్మలను బట్టే మరుజన్మ ఉంటుంది. ఈ జన్మలోనైనా, వచ్చే జన్మలోనైనా చేసే కర్మలని బట్టే సుఖ సంతోష శాంతులుంటాయి.

## రావిచెట్టు పరమాత్మ స్వరూపమే?

విభూతి యోగంలో పరమాత్ముడు శెలవిచ్చాడు. వృక్షాలలో రావిచెట్టునూ, ఋషులలో నారదుడనూ, గంధర్వులలో చిత్రరథుడనూ, సిద్ధులలో కపిల మునీంద్రుడనూ నేనే అని.

## స్త్రీలలో పరమాత్మ లక్షణాలు?

స్త్రీలలో కీర్తీ, ఐశ్వర్యమూ, వాక్చమత్కృతీ, ధారణా శక్తీ, బుద్ధీ, బలమూ, ధైర్యమూ, ఓర్పులు నా స్వరూపములేనని పదవ అధ్యాయంలో విభూతి యోగంలో శ్రీ కృష్ణుడు చెప్పాడు.



## వాదము భగవత్ స్వరూపమే?

వాదాలు మూడు రకాలు. జల్పము మొదటిది. అది తనకి తాను సమర్థించుకోవటానికి చేసేది. రెండవది వితండము. అంటే పర పక్షమును ఇష్టమొచ్చినట్టు ఖండించటము. ఇక మూడవది వాదం. ఇరువురి నుంచి ఆలకించి మంచిని గ్రహించి సత్యం తేల్చటము. కావున మూడవది అయిన వాదము భగవత్ స్వరూపము.

## రజోగుణము లక్షణాలు?

దొరకని దాని గూర్చి తపన. దొరికిన దాని గూర్చి నిరసన. కీర్తి కాంక్ష, మహాకోరికలు. ధనమంతా నాకే కావాలి. వ్యాపారమంతా నేనే చెయ్యాలి. కంటికి నచ్చిన ప్రతి స్త్రీ కావాలి. ఇవన్నీ మహాబంధకరము దుఃఖములు. ఎంత త్వరగా జ్ఞానము ద్వారా రజోగుణము తెలుసుకొని దానిని వదిలేయటం వల్ల పరమశాంతి లభిస్తుంది.

## శ్రీ కృష్ణుని విశ్వరూప సందర్శనంలో అర్జునుడు ఏం చూశాడు?

పన్నెండు సూర్యులనూ, ఎనిమిది వసువులనూ, పదకొండు రుద్రులనూ, అశ్వనీదేవతలనూ, నలభైతొమ్మిది మంది మరుత్తులనూ, వేల కొలది సూర్యులు ఆకాశంలో వెలిగితే వచ్చే కాంతి కన్నా ఎక్కువ కాంతితో సమస్త జగత్తునూ, ఇంకా బ్రహ్మదేవుడినీ, సకల ఋషులనూ, మహా సర్పములనూ, అనేక హస్తాలతో, ఉదరములతో, ముఖములతో, నేత్రాలతో మొదలునుగానీ ఆద్యమును గానీ ఏకసారిగా చూడలేక అర్జునుడు

విభ్రాంతిగా, సంభ్రమాశ్చర్యాలతో తన్మయుడై శ్రీ భగవానుడి విశ్వరూపాన్ని చూశాడు. ఈ విశ్వరూపం గూర్చి పదకొండో అధ్యాయంలో ఉంది. ఆ అధ్యాయం చదివితే ఆ భగవంతుడు మనోఫలకంపై ప్రత్యక్షమవ్వటం తప్పని సరి.

## శ్రీ భగవద్గీతలో ఎక్కువ బీజాక్షరాలు గల శ్లోకం?

శ్రీ భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగములో ముప్ఫయి ఆరో శ్లోకము ఎక్కువ బీజాక్షరాలు గల శ్లోకం. ఇది పఠించటం ద్వారా భయమూ, భీతీ, జంకూ వంటివి దూరమవుతాయి. అనేక పీడలు వంటివి దరిచేరవు. ఈ శ్లోకాన్ని రాగిరేకుపై రాయించి ఇంటి గడపకి కట్టడం ద్వారా గాలి ద్వారా మరియు అదృశ్య రూపాలలో వచ్చే పిశాచ, భూత పీడలు రాకుండా ఉంటాయి. బజారులో దొరికేవి కాక, మీరే స్వయంగా రాయించి చేయించుకున్నది ఫలము. శక్తి గలది కూడా.

## సత్త్వగుణము

నిర్మలమైనదీ, తేజోవంతమైనదీ, ఎట్టి అపకారాలు రానివ్వనిదీ, ఐహిక సుఖాల యందు ఆసక్తి ఇవ్వనిదీ, జ్ఞాన తృష్ణను పెంచేదీ, ఎల్లప్పుడూ సుఖాలనిచ్చేదీ సత్త్వగుణము.

## ఎవని జన్మ ఉత్తమోత్తమము?

మహాసంపదలుగల కుటుంబంలో పుట్టడం కన్నా, అధికార సామ్రాజ్యవాదుని ఇంట్లో జన్మించటం కన్నా, మహా జ్ఞాన సంపన్నుల కుటుంబంలో పుట్టడం అనగా యోగుల వంశంలో జన్మించటం ఉత్తమం. అది మహా అసాధ్యమైనదనీ,



తపః ఫలముతో పాటు జన్మ జన్మల పుణ్య ఫలం వల్లనే సాధ్యపడుతుందనీ శ్రీ కృష్ణ భగవానుడు గీతలో ఉపదేశించాడు.

## మాయ అనగా?

భూమీ, నీరూ, అగ్నీ, వాయువూ, ఆకాశమూ, మనస్సూ, బుద్ధీ, అహంకారములే ప్రకృతి అనే మహా మాయ. శ్రీ భగవానుడు సృష్టించిన మాయ.

## భగవంతుడు కనిపిస్తాడా?

ఖచ్చితంగా, తనని దర్శించ వచ్చుననే చెబుతున్నాడు. పొద్దున లేస్తూనే ధనం ఎలా సంపాదించాలి... తనకి ఎదురు తిరిగిన వాడ్ని ఎలా నాశనం చెయ్యాలి... ఆ అందాల బొమ్మను ఎలా పట్టాలి, తన కీర్తిని ఎలా పెంచుకోవాలి... ఇలాంటివన్నీ ఓ పొరలా మారి కన్నులకి అడ్డంగా వుండి పరమాత్మను చూడనివ్వదు. అందుకే మనస్సును అదుపులో ఉంచి కర్మలను ఫలాన్ని ఆశించికాకుండా చేసిన వానికి శ్రీ భగవానుడు కనిపిస్తున్నాడు. రజోతమో గుణాలను వదలి నిష్కామ కర్మ చేత శ్రీ పరమాత్మను పొందగలము. అవేమీ లేకుండా భగవంతుడు ఎక్కడా.. కనపడడే అనటం అజ్ఞానానికి పరాకాష్ఠ.

## శత్రువులను దూరంగా ఉంచాలి?

తనకి ప్రీతి కలిగేవి తనకి అందకుండా పక్కవానికి అందినపుడు ద్వేషము కలుగుతుంది. అదే క్రోధము అవుతుంది. ఆ క్రోధము లోంచి మోహము కలుగుతుంది. దానితో జ్ఞాన నాశనము జరిగి, బుద్ధి అశాస్త్రీయ పద్ధతిలో నాట్యం చేస్తుంది. మన చుట్టూ వున్న అనిత్య శత్రువులు చాలా అల్పమైనవారు.

హృదయంలోని శత్రువులే ఎవరినైనా సర్వనాశనము చేసేది. కాన హృదయమందున్న శత్రువులను నశింపచేయాలి.

## భగవంతుని తత్త్వము?

ఈ మహా(ప్రకృతి) మాయని సృష్టించిన వాడు దానికి మించినవాడు. సకల శ్రేష్ఠుడు. ఇంద్రియాలకి కనిపించని వాడు. పురాతనుడు. సకలం నశించినా తాను నశింపనివాడు. అట్టి వాణ్ని అనన్య భక్తితో మాత్రమే పొందగలము.

## పత్రం.. పుష్పం.. తోయం...?

ఎవరైనా భక్తిగా అట్టివి సమర్పించిన నాకు ప్రీతికరమేనని భగవానుడు చెప్పెను. కానీ... అవి కూడా తనవి... తను వేసిన చెట్టు పత్రం.తను నాటిన మొక్క పుష్పం సమర్పించమని..ఎవరో వేసినవీ, నాటినవీ స్వామికి సమర్పించటం కాదు.మనకున్నది.. మనం సంపాదించినది అర్పించాలి.

## మనకు మూల పురుషులు ఎవరు?

సప్తర్షులు, నలుగురు సనకాదులు, పధ్నాలుగు మంది మనువులు. మనమంతా వారినుంచే కాలక్రమేణా పుట్టడం జరిగింది. ప్రతి మనుజునికీ మూల పురుషులు వారే. కాన జాతి, మతం, కులం, ఎక్కువ కులం, తక్కువ కులం అన్నవి లేవు. చేసే పనులు, బుద్ధులే ఎక్కువ తక్కువలు.

## సన్న్యాసి అనగా అర్థం?

సకల కర్మలను వదిలెయ్యటం కాదు. భార్యా పిల్లలనీ, ఆర్థిక వ్యధలనూ వదిలేసి వెళ్ళిపోయేది సన్న్యాసము కాదు. రాగ ద్వేషము లేకుండా, సుఖ దుఃఖాలకు నేర్వకుండా, సకల



ప్రాణి కోటి యందు సమభావంతో నుండి హృదయశుద్ధితో కామాదులను వదలి తన కర్మలు చేయువాడు సన్న్యాసి. శ్రీ భగవానుడు అర్జునుడికి ఈ భావాన్ని శ్రీ భగవద్గీతలో అయిదో అధ్యాయంలో చెప్పటం జరిగింది.

## తామరాకుపై నీటి వలే అనగా?

కర్మ ఫలాన్ని ఆశించకుండా, ప్రతి కర్మను భగవంతునికే అర్పించిన వానికి కర్మ తాలూకూ పాపములు ఆవహించవు. అట్టివాడు వాటి తాలూకూ కర్మలచే బంధించబడడు. అట్టివాడు తామరాకు వంటివాడు. వానిపై నీరు పడినా, అనగా పాపమను జలము పడినా అంటవు.

## కష్టాలూ, దుఃఖాలూ ఎందుకొస్తాయి?

కర్మల వల్ల. ఏ భావంతో కర్మ చేస్తే అదే భావము ఫలం లభిస్తుంది. అవతల వారి సుఖాన్ని లాగివేస్తే నీ సుఖం పోతుంది. ధనం పోగొడితే నీ సంపదే పోతుంది. అశాంతిని కలిగిస్తే పరమశాంతి దొరకదు. ప్రతిప్రాణిలోనూ భగవానుడున్నాడు. కీడు చేస్తే భగవానుడికి చేసినట్టేనని శ్రీ భగవద్గీత అంతరార్థము.

## నరకానికి ఎవరు వెళుతున్నారు?

*నా కోరికలను తీర్చుకున్నాను. పురుషార్థిని. ఇకపై నా మనోరథాలన్నీ పొందగలను. నా వద్ద ఎంతో సంపద ఉంది. ఇంకా ఎంతో ధనాన్ని సంపాదించగలను. నా శత్రువులను తొలగించాను. మిగిలిన శత్రువులనూ వధిస్తాను. నేనే అధిపతిని. సకల సుఖ భోగాలను అనుభవించగలవాడను నేను మాత్రమే. కోరినదాన్ని తీర్చుకోగల శక్తి వుంది. నేను మహాబలవంతుడను. సుఖవంతుడను. ధనముంది.*

పరివారముంది. నాతో ఎవరూ సమమవ్వరు. యజ్ఞాలూ, యాగాలూ చేస్తాను. కావాలసినంత సుఖాన్ని అనుభవిస్తాను. దానాలు చేస్తాను. ఆనందాన్ని పూర్తిగా అనుభవిస్తానని చిత్త చాపల్యములతో కూడినవారూ, కామములపై బహు ఆసక్తి వున్న వారూ నరక లోకమున పడుతున్నారు.

## దైవయజ్ఞమంటే?

దేవతలని షోడశోపపద్ధతులతో సేవించి ఆరాధించటము. ఉపవాసాలూ, వ్రతాలూ చేయటము. నామస్మరణలు చేయటము దైవయజ్ఞము.

## బ్రహ్మాయజ్ఞమనగా?

దేవతారాధనలు లేకుండా, కేవలం ఆత్మను భగవంతునికి అర్పించి పవిత్రమైన నిర్మలమైన మనస్సుతో చిత్తమును బ్రహ్మస్వరూపముపై పెట్టి సాధన చెయ్యటమే బ్రహ్మాయజ్ఞం.

## మనలోని తొమ్మిది ద్వారాలు?

రెండు కనులు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రాలు, నోటి ద్వారము, ఇంకా మూత్ర, మల ద్వారములు. కాన మన శరీరము నవద్వార నగరము. అందు పరమాత్మ ఉన్నాడు. ప్రతిప్రాణిలోనూ వుంటాడు. సాటి వారిని ప్రేమించటమంటే భగవంతుణ్ని ప్రీతితో కొలిచినట్టే.

## ఋషిగా ఎవరైనా జీవించవచ్చా?

పాపాలను చిత్తశుద్ధితో చేయటం మానాలి. పక్కవారు అపకారము చేసినా మీకున్న శక్తి, అంగ, ధన, పరువు ప్రభావాలతో ప్రతీకారం తీర్చుకుంటే ఋషి అవ్వలేరు. సందేహాలను పెట్టుకోకుండా, సకలేంద్రియాలను అదుపులో



వుంచుకొని కామలోభ మదమోహాలను వదలి సకల ప్రాణికోటినీ ఇష్టపడినవాడు ఋషే అవుతాడని శ్రీ కృష్ణ భగవానుడు అర్జునుడికి ఉపదేశించాడు.

## సుఖంగా వుండటము మన చేతుల్లోనే ఉందా?

భగవానుడు చెప్పింది అదే. ప్రతి మనిషిలో మంచీ, చెడూ భావాలుంటాయి. చెడే మంచిని తనలో కలిపేసుకోవాలని ప్రతిక్షణము ప్రయత్నిస్తుంటుంది. కాని దానికా అవకాశము ఇవ్వకుండా ఆ చెడునే ఇంద్రియ నిగ్రహంతో మంచిగా మార్చుకుంటే పరమశాంతి లభిస్తుంది. బైట శత్రువులకన్నా లోపల శత్రువుని తుదముట్టించాలి.

## ధ్యానం ఎలా చెయ్యాలని శ్రీ భగవద్గీత చెప్పింది?

చక్కని ఆసనముపై శరీరమూ, మెడా, శిరస్సూ సమంగా ఉంచి కనులను అటూ ఇటూ తిప్పకుండా హృదయాన్ని ఐహిక ఆలోచనలపై పోకుండా భగవంతుని యందే ధ్యాస నిలిపి ధ్యానము చేయాలి. కుండలినీ శక్తి కూడా ఆ సమయంలో తనపని తాను చేసుకుపోయి మనుజునికి పరమానంద తత్త్వాన్ని తెలియచేస్తుంది.

## పరుల నుంచి ఆశిస్తే?

తనది కానిదీ, తనకు సంబంధం లేనిదీ అయిన పక్కవారి నుంచి ఆశిస్తే, గ్రహిస్తే, తీసుకోనేది వస్తువూ, ధనమూ మాత్రమే కాదు. వారి కర్మలు కూడా. అనగా పాపాలూ, దోషాలూ,

రోగాలూ అని. అందుకే పక్కవారి నుంచి ఏమీ ఆశించవద్దు అని శ్రీ భగవానుడు చెప్పింది.

## ఆహారాన్ని ఎలా తీసుకోవాలి?

మితముగా తీసుకోవాలి. సాత్త్విక ఆహారాన్ని తీసుకోవాలి. న్యాయంగా, ధర్మంగా సంపాదించిన ధనంతో చేసినది అయి ఉండాలి. తన కోసం తన వారి కోసం వండుకున్నది కాక భగవంతునికి అర్పించి, శేషించిన దాన్ని తీసుకోవాలని శ్రీ భగవానుడు శెలవిస్తున్నాడు.

## యజ్ఞం ఎంత పవిత్రత కలిగినది?

మోక్షం పొందాలంటే పాపాలుండకూడదు. అందుకే శ్రీ కృష్ణ భగవానుడు చెప్పాడు. పాపాలను పోగొట్టేది యజ్ఞమే అని. యజ్ఞం పగ తాలూకు దోషాలనూ, కుళ్ళూ, కుతంత్రాల తాలూకూ పాపాలనూ సమసిపోయేలా చేస్తుంది. పాపములు పోవటం వల్ల హృదయం శుద్ధి అవుతుంది. హృదయశుద్ధి వల్లే మోక్షము కలుగుతుంది.

## గీతలో శ్రీ భగవానుడు చెప్పిన యజ్ఞములు?

దైవయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, ఇంద్రియ సంయమ యజ్ఞం, శబ్దాది విషయ నిరోధ యజ్ఞం, మనోనిగ్రహ యజ్ఞం, ద్రవ్య యజ్ఞం, తపో యజ్ఞం, యోగ యజ్ఞం, స్వాధ్యాయ యజ్ఞం, జ్ఞాన యజ్ఞం, ప్రాణాయామ యజ్ఞం, ఆహార యజ్ఞం... ఈ మహా యజ్ఞాలు అనేక పాపాలనూ, దోషాలనూ పోగొట్టి సుఖాలనీ, సంతోషాలనీ ఇస్తాయని శ్రీ భగవానుడు జ్ఞానయజ్ఞంలో చెప్పాడు.



## జ్ఞానాన్ని ఎలా పొందాలి?

మూడు గుణములతో జ్ఞానాన్ని పొందవచ్చు. చేసే కర్మ మీద శ్రద్ధ, దానిపైనే ఏకాగ్రత, ఆ రెంటితో పాటు ఇంద్రియ నిగ్రహములుంచినచో జ్ఞానమనే సుఖం లభిస్తుంది.

## శ్రీ భగవద్గీతలో చెప్పిన ధన యజ్ఞమనగా?

అపార సంపదలను కలిగినవారు వారి ధనమును సత్రములకూ, దాహార్తికీ, అన్నదానాలకీ, శిశు సంరక్షణలకూ, అంగ వికలాంగులకూ వినియోగించటమే ధనయజ్ఞము.

## అధర్మము చేయటం వల్ల కలిగే కీడు?

*తొలుత కులము నశించుట వల్ల కులధర్మములు మారిపోవును. అంతరించుపోవును. దానితో అధర్మము చేరి కులస్త్రీలను భ్రష్టులను చేస్తుంది. అలా స్త్రీలు చెడిపోవటం వల్ల వర్ణసంకరము కలుగుతుంది. వర్ణ సంకరం వల్ల పితృదేవతలు శ్రాద్ధ, తర్పణాలు లేనివారై అధోగతిని పొందుతారు.*

## శ్రీ కృష్ణ భగవానుని సంతానము

*శ్రీకృష్ణుడూ, రుక్మిణులకు ప్రద్యుమ్నుడూ, సుచారుడూ, భద్రచారుడూ, చారుధేష్ణుడూ మొదలగు పదిమంది పుత్రులున్నారు. అలాగే సత్యభామా శ్రీకృష్ణులకు తామ్రుడూ, చక్రుడూ మొదలగు పదిమంది పుత్రులున్నారు. మిత్రవిందా శ్రీకృష్ణులకు మిత్రవంతుడూ, నాగ్నజితా శ్రీకృష్ణులకు మిత్రబాహువూ, సునీధుడూ, జాంబవతికి సాంబుడూ. శ్రీకృష్ణుని అష్ట భార్యలకీ సంతానము వుంది. పూర్తి వివరాలు కావాలన్న శ్రీమహాభారతం చూడాలి.*

## సకల దానాల్లోకెల్లా ఉత్తమమైనది?

జలదానము కన్నా, గోదానము చేయటం కన్నా, గృహ దానము చేయటం కన్నా, బంగారము, ధనములను దానము చేయటం కన్నా పుస్తక దానం మహోన్నతమైనది. అది అన్ని దానాలకి మించి పుణ్యం ఇస్తుంది. దాన్నే జ్ఞాన యజ్ఞమంటారు.

## శ్రీకృష్ణుని అష్ట భార్యలు

రుక్మిణీ, సత్యభామా, జాంబవతీ, మిత్రవిందా, కాళిందీ, నాగ్నజితా, లక్షణా, భద్రా. వీరు శ్రీకృష్ణుని అష్ట భార్యలు.

## ధర్మము నశించటానికి కారణాలు?

పర స్త్రీ వ్యామోహమూ, కోపమూ, జూదమూ, మద్యపానమూ... ఈ నాలుగూ ఉండక్కర్లేదు. ఏ ఒక్కటి ఉన్నా అధర్మము ఆవహించి ధర్మమను పుణ్యాన్ని హరించి వేస్తుంది.

## శ్రీ భగవానుని ఆయుధాలు?

శ్రీకృష్ణుడు ధరించే చక్రం సుదర్శనము. శంఖం నామం పాంచజన్యం. గద పేరు కౌమోదకి. ఇక ధనస్సు శౌర్జ్యం. కత్తి నామం నందకం.

## శ్రీ భగవద్గీతలో

మానవుడు ఎలా జీవించాలో చెప్పబడింది. మరెలా మాట్లాడాలో చెప్పబడింది. ఇంకెలా భుజించాలో, మరెలా భజియించాలో కూడా చెప్పబడింది. ప్రతి చిన్న విషయమూ భగవద్గీతలో చెప్పబడింది.



అందుకే చిన్నా, పెద్దా, పురుషుడూ, స్త్రీ అనే తేడా లేకుండా శ్రీభగవద్గీతని చదవాలి. గ్రహించాలి. అదే మహా పుణ్యప్రదం.

## స్త్రీలు శ్రీభగవద్గీత?

పురుషులు మాత్రం నీటిని త్రాగుటకూ, అన్నాన్ని భుజించుటకూ, అనారోగ్యమునకు ఔషధము తీసుకొనుటకూ అనర్హులైనచో స్త్రీలు శ్రీభగవద్గీతను చదువరాదు. స్త్రీలకు అంత జ్ఞానము అవసరం లేదని పురాతన కాలంలో ఎవరో ఛాందసవాదులు చేసిన ప్రచారము మాత్రమే అది.

## జ్ఞానమెలా వస్తుంది?

గోవుకి పాలు పొదుగు నుంచి వచ్చును. అలాగే పొదుగుని కోస్తే వచ్చేది పాలు కాదు. మరి పాలెక్కడ ఉన్నాయి. శరీరమంతా పాలున్నాయి. అలా అని చెవులు పిండితే పాలు వస్తాయా...రావు. పొదుగుని పిండితేనే పాలు వస్తాయి. జ్ఞానమూ అంతే. ఎవర్ని ఎలా ఆశ్రయించాలో అలా ఆశ్రయిస్తేనే పాలు అనే జ్ఞానము లభిస్తుంది.

## నిష్కామ కర్మ ఎంతటి ఫలం?

మహా ఆపదల్లో తోడు వచ్చేది నిష్కామ కర్మ ఫలమే. నిండు సభలో ద్రౌపది వలువలను లాగుతుంటే కాపాడింది ద్రౌపది నిష్కామ కర్మే. ఒకప్పుడు నదిలో ద్రౌపది శుభ తిథిలో స్నానమాచరిస్తుండగా దూరంగా ఉన్న ఓ తపఃశ్శాలి నడుం బట్ట కొట్టుకొని పోయింది. దానితో ద్రౌపది తన చీర కొంగుని చింపి వానికి ఇచ్చింది. అట్టి నిష్కామ కర్మ వల్లనే నిండు సభలో తన మానాన్ని కాపాడుకోగలిగింది. శ్రీభగవానుడి రక్షణను పొందగలిగింది.

## సుఖ దుఃఖాలను సమంగా భావించిన వారికి...

తెల్లవారితే పట్టాభిషేకం. మహా వైభోగాలతో, అధికారాలతో రాజ్యాధికారం. చక్రవర్తిని చెయ్యటానికి ముహూర్తం. కానీ ఆ ముహూర్తంలోనే శ్రీరామచంద్రుడు అరణ్యానికి వెళ్ళవలసివచ్చింది . తండ్రి ఆదేశం విన్న శ్రీరాముడు అంతకుముందు ఎలా వున్నాడో అలాగే చిరునవ్వుతో పయనమయ్యాడు. అదే స్థిత ప్రజ్ఞత. కూర బాగుంటే చిరునవ్వు. లేదంటే కోపము. ఆపై ద్వేషము. వెరిసి దుఃఖము. పరిస్థితి అనుగుణంగా లేకపోతే మహావేశము పడటము, మహా వేదనలకి ప్రారంభము. ఏది జరిగినా మన మంచికే అనుకోవాలి. వచ్చిన కర్మను మనఃస్ఫూర్తిగా స్వీకరించాలి. చేసుకున్న వారికి చేసుకున్నంత అనుకోవాలి. అదే ఎప్పటికైనా మహా సుఖాలను ఇస్తుంది.

## యజ్ఞమును ఏ కోరికతో చేయాలి?

మహా ద్రవ్యాలను ఏర్చి కూర్చి చేసేది మాత్రమే యజ్ఞం కాదు. పరమేశ్వరుణ్ని ప్రీతితో, అర్పణతో చేసే ఏ కార్యమైనా యజ్ఞ ఫలాన్నే ఇస్తుంది. ధర్మరాజు అశ్వమేధ యాగం చేస్తుండగా లక్షలాది మందికి వండిన ఆహార పదార్థాల వద్దకు ఓ వైపు మాత్రమే బంగారు వన్నె కలిగిన ఓ ముంగిస వచ్చింది. దాన్ని చూసి యజ్ఞం గూర్చి చెప్పి పక్కకెళ్ళమంటాడు ధర్మరాజు. “ధర్మరాజా నీదీ ఒక యజ్ఞమేనా? నా వైపు చూడు. యజ్ఞ ప్రదేశంలోని మెతుకులు గ్రహించినందుకే నాకు ఓ వైపు బంగారుమ యమయింది. నీవు యజ్ఞం చేస్తున్నావని తెలిసి వచ్చాను. ఎన్నిసార్లు పొర్లినా మిగిలిన వైపు బంగారుమయం అవటం లేదు” అని ముంగిస చెప్పటంతో ధర్మరాజు అంతటి మహా యజ్ఞాన్ని



చేసింది ఎవరు అని ముంగిసను అడుగుతాడు. అప్పుడు ఆ ముంగిస చెపుతుంది. తినటానికి తిండిలేని ఓ కుటుంబము అతి కష్టాన కాసిని గింజలను సంపాదించి వండుకున్నారు. తినబోయే సమయంలో వచ్చిన ఓ అభాగ్యునికి ఆకలిని తీర్చారు. మిగిలిన గంజైనా తాగుదామనుకుంటే ఆ సమయంలో మరో అతిథి రావటంతో ఉన్న గంజిని అంతా ఆ అతిథికి అర్పించారు. ఆపై ఆ కుటుంబమంతా ఆకలితో అస్తమించారు. అక్కడ పడిన గంజి చుక్కలపై పొర్లినందుకు నా శరీరం సగం స్వర్ణమయిందని చెబుతుంది. కాన యజ్ఞ కార్యాలు పేరు కోసం కాక భగవంతుని ప్రీతికొరకు చేయాలి. అర్పించాలి.

## శ్రీభగవద్గీతలో చెప్పిన ఎవరికి వారు చేసే మహా యజ్ఞాలు?

ఉదయాన్నే శుచియై శ్రద్ధతో భగవంతుని పూజించటము దేవ యజ్ఞము. పురాణాలనూ, ఉపనిషత్తులనూ, వేదాలనూ చదవటము ఋషి యజ్ఞము. తల్లీ, తండ్రినీ పూజించటము, వారికి కావల్సింది చెయ్యటము పితృయజ్ఞము. అతిథి లేకుండా భోజనం చెయ్యరాదని హిందూ ధర్మము శెలవిస్తోంది. ఉన్నదానిలో కొంత ధర్మము చేసి అనగా అభ్యాగతులకి అన్నం పెట్టడం అతిథి యజ్ఞము. ఇక భూత యజ్ఞం.. గృహంలోని ఆవులూ, గేదెలూ వంటి ఇత్యాదివన్నింటికీ తగు మేత వేసిన తర్వాత భుజించటము భూతయజ్ఞము.

## శ్రీభగవద్గీత జన్మించిన రోజు?

కలియుగము ముందు శ్రీకృష్ణుడు అర్జునునికి భోదించాడు. స్థలం కురుక్షేత్ర రణరంగము. అప్పటికి శ్రీకృష్ణుని వయస్సు యనభై ఏడు సంవత్సరాలు.

## శోకము ఎవరికి కలుగుతుంది?

మహా వినయ విజ్ఞాన సంపన్నుడైన బ్రాహ్మణుడి యందూ, ఆవూ, ఏనుగూ, కుక్కా, చండాలుని యందూ పండితుడన్న వాడు సమభావంతో ఉండాలి. అట్టివాడు జ్ఞాని. జ్ఞాని అన్నవానికి దుఃఖములు కలుగవు. శోకములు కలిగేది అజ్ఞానికి మాత్రమే.

## మానవ జీవితమంటే...

మేడలు కట్టుకోవటము.. బంగారాన్నీ, ధనాన్నీ పొందటము... మహాభోగాలూ, సుఖాలను అనుభవించటము, భగవంతుని స్మరణకి తొందరేలా అవసాన దశ వుందిగా... అంటే పైవన్నీ అనుభవించిన తర్వాతే భగవంతుని స్మరణ. భగవంతుడు నిన్ను పుట్టించింది అందుకా.. అట్టి వాడు ప్రాణం పోయే స్థితిలో కూడా నారాయణా అన్న పదం పలుకలేడు. శరీరంలో వయసుండీ, శక్తి ఉండీ, కనులు చూడ గలిగినప్పుడూ, చెవులు వినపడుతున్నప్పుడూ, నడవగలుగుతున్నప్పుడే పరమాత్ముని స్మరించాలి. దర్శించాలి. తీర్థ యాత్రలైనా, నదీ సంగమ స్నానాలైనా అప్పుడే చేయాలి. ఎప్పుడో చేద్దాం అనుకోవటమంటే ఈ పూట భోజనం, రాత్రి భోజనం కలిపి రేపు చేద్దాము అనుకున్నట్టే.

## ఎలాంటి ఆహారాన్ని భుజించాలని శ్రీభగవద్గీత శెలవిస్తోంది?

ఇంటి గృహిణి శుభ్రమైన దుస్తులను ధరించి, మంచి మనస్సుతో గోమయంతో అలికిన ముగ్గులపైనున్న పొయ్యిపై వంట చేయాలి. దాన్ని భగవంతునికి నైవేద్యంగా పెట్టి ఆపై అరటి ఆకులో భుజించాలి. అట్టి ఆహారము శరీరానికి పుష్టినిస్తుంది.



## స్త్రీని వివాహమాడేది?

కామభోగముల కొరకు కాదు. సహచారిణితో సంతానార్థమై ఋతిమతయిన తర్వాత ఆమెతో ఎనిమిది, పన్నెండు, పధ్నాలుగు రోజుల యందు కలవాలి. ఆమె భోగ వస్తువూ. వంట మనిషి కాదు. భాగ్యవస్తువు. వీటిని పాటించటమే గృహస్థు బ్రహ్మచర్యమంటారు. పరస్త్రీని తలవటము, కోరటం మహా పాపం. స్త్రీ అగ్నిహోత్రం వంటిది. పురుషుడు నెయ్యిలాంటివాడు. కాన ఎప్పుడూ నెయ్యి అనే పురుషుడు అగ్నిహోత్రం వంటి స్త్రీ విషయంలో అనగా కామం విషయంలో నిగ్రహంతో వుండి మోక్షాన్ని పొందాలి.

## శ్రీభగవద్గీత పఠనం ద్వారా పాపవిమోచనం....

శ్రీభగవద్గీత త్రివేణీ సంగమం వంటిది. మూడు నదులు కలిసే త్రివేణిలో స్నానమాచరిస్తే సకల దోషాలూ, పాపాలూ పోయినట్టు కర్మ, భక్తి, జ్ఞాన నదులున్న శ్రీభగవద్గీతను చదవటం ద్వారా సకల దోష పాపాలూ సమసిపోతాయి.

## వ్యామోహమంటే....?

అపార ధనరాసులను సంపాదించిన ఓ ముదుసలి అవసాన దశలో లేవలేని, మాట్లాడలేని స్థితిలో ఉన్నాడు. అంతా ఆయన చుట్టూ గుమి గూడి ఉన్నారు. ఆ ముదుసలి అతికష్టం మీద మెల్లగా చెప్పాడు. 'అంతా ఇక్కడే చచ్చారు... అక్కడ కొట్టు ఎవరు తీస్తారు?' అని. అదే వ్యామోహము. దాన్ని వదలకపోతే మిగిలేది అశాంతే. మళ్ళీ అట్టివానికి మరుజన్మ వ్యామోహపరుని జన్మయే.

## శ్లోకా పారాయణము మహా శక్తినిస్తుందా?

శ్రీభగవద్గీత శ్లోక పారాయణం మహా తపఃశక్తితో పాటు మహా శక్తిని అందిస్తుంది. ఓసారి వివేకానందుడు హిమాలయాల్లో ప్రయాణించి అలసి సొలసిపోయాడు. దాహమూ, ఆకలితోనున్న ఆ సమయంలో శ్రీభగవద్గీతను పఠించి శక్తిమంతుడై తిరిగి ప్రయాణం కొనసాగించాడు.

## మహా దుఃఖాలను ఎట్లా పోగొట్టుకోవాలి?

చిత్రకూట పర్వతంపైనున్న శ్రీరామచంద్రుని వద్దకు భరతుడు వచ్చి దశరథ మహారాజు గతించారని చెప్పి దుఃఖిస్తాడు. అప్పుడు శ్రీరాముడు భరతుణ్ణి ఓదారుస్తూ చెబుతాడు. ఉదయించిన సూర్యుడు అస్తమించక మానడు. నీటి ప్రవాహంలో ఓ కర్ర, మరో కర్ర కలిసి కొంత దూరం ప్రయాణించి విడిపోయినట్టు భార్యా, పుత్రులూ, బంధువులూ ఋణానుబంధ మెంత వుంటే అంతవరకే ఉంటారు. భువిపై జన్మించినప్పుడే మరణం కూడా రాసి పెట్టి వుంటుంది. ధర్మ మార్గమున నడిచిన వారికి ఇహంలోనూ, పరంలోనూ సుఖాలుంటాయి. ఆ మధ్యలోని జీవితాన్ని మనుజుడు ధర్మ, దాన, యజ్ఞ కర్మలు చేస్తూ పవిత్ర జీవనం సాగించాలి.

## స్వధర్మం వదలటం ఎంత పాపం?

ఇల్లాలి ధర్మం భర్తకీ, పిల్లలకీ వంట చేసి పెట్టడం. ఏ ఇల్లాలైనా దాన్ని దినచర్యలో భాగం అనుకోదు. ఇష్టంతో, సంతృప్తితో, ప్రీతితో చేస్తుంది. అదే స్వధర్మం. స్వధర్మం వీడటమంటే ఇంటినీ, భర్తనీ, పిల్లలనీ వదలి గురువులనీ, స్వాములనీ సేవించటం, పురాణ



కాలక్షేపాలకని వెళ్ళటం. కాన ఎవరూ స్వధర్మం వీడకుండా కర్మ చేయటం ద్వారా కూడా మోక్షాన్ని పొందవచ్చునని శ్రీభగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పి వున్నాడు.

## ప్రతి ఫలాపేక్ష లేకుండటమంటే?

నది ప్రవహిస్తున్నది ఏ ఫలం ఆశించి? సూర్యుడు ఉదయించేది ఏ ఫలాన్ని ఆశించి?

మేఘం వర్షించేదీ, పూలు వికసించేదీ, అగ్ని వెలిగేదీ ఏ ఫలం కోరి? అట్లే ఏ ఫలం ఆశించకుండా కర్మలని చేయటమే మనుజుని విధి. ఎవరికి ఏ ఫలం ఇవ్వాలో వారికి ఆయా ఫలములను శ్రీ భగవానుడు అందిస్తాడు. మన పని కర్మ చెయ్యటమే.



# శ్రీ కృష్ణ లీలా వినోదాలు

- ★ శ్రీ కృష్ణ భగవానుడు జన్మించింది అయిదు వేల నూట పది సంవత్సరాల క్రితం శ్రావణ శుక్ల అష్టమినాడు.
- ★ శ్రీ కృష్ణ భగవానుడు జీవించిన కాలం 125 సంత్సరాల ఏడునెలల ఎనిమిదిరోజులు.
- ★ శ్రీ కృష్ణుడు ఏడు సంవత్సరాల వయస్సులోనే గోవర్ధన గిరిని ఎత్తాడు.
- ★ శ్రీ కృష్ణుడు పది సంవత్సరాల ఎనిమిది నెలల వయసులో చతుర్దశినాడు కంసుణ్ని సంహరించాడు.
- ★ గోకులంలో శ్రీ కృష్ణుడు ఉన్నది మూడు సంవత్సరాల నాలుగు నెలలు మాత్రమే.
- ★ బృందావనంలో ఉన్నది మూడు సంవత్సరాలు మాత్రమే.
- ★ నందిగ్రావ్‌లో ఉన్నది ఆరుసంవత్సరాల ఆరు నెలలు.
- ★ మధుర, బృందావనాలలో శ్రీ కృష్ణుడు నివశించింది 30 సంవత్సరాల వరకు మాత్రమే.
- ★ 30 సంవత్సరాల తర్వాత ద్వారక నిర్మించుకొని అక్కడే నివశించాడు.
- ★ శ్రీ భగవానుడి నిర్యాణము అయిదు వేల రెండు వందల ముప్ఫయి సంవత్సరాల క్రితం జరిగింది.
- ★ శ్రీ కృష్ణుని నిర్యాణం జరిగిన తర్వాతే పాండవులు స్వర్గారోహణం చేశారు.





# శ్రీ భగవద్గీత......

చాలా సంవత్సరాల క్రితం... ఖమ్మం రైల్వేస్టేషన్ వద్ద ఓ మైకులోంచి భగవద్గీత తొలిశ్లోకము వినపడింది. నేను అలా వింటుండిపోయాను. ఆ శ్లోక భావ అర్థాలను ఎంతో తన్మయంగా అమృతమయంగా విన్నాను.

అలాంటి నేను.... ఇలా సకల వేదసారమైన శ్రీ భగవద్గీతను రాస్తానని కలలో కూడా అనుకోలేదు. ఆ రోజు ఆ ఒక్క శ్లోకము భావ అర్థం విని అంతలా పరవశించి పోయాను. *700 (701)* శ్లోకాలతో *18* అధ్యాయములతో గల గీతను పదిహేనేళ్ళ క్రింద జరిగిన ఆ సంఘటన వల్ల మీకందించగలుగుతున్నాను. కేవలం నేను నిమిత్తమాత్రుడను. అమూల్యమైన, పురాతనమైన టీక తాత్పర్యాలు గల భగవద్గీత పుస్తకాలను అనేకం పరిశీలించాను.

గీతలో శ్రీకృష్ణ భగవానుడు ఓ సందర్భంలో చెబుతాడు. చేసేది నువ్వే అయినా చేయించేవాడిని నేనే అని. ఆ పరమాత్మ సంకల్పించాడు. నేను మీకు అందించాను. శ్రీభగవద్గీతను చదవాలనీ, వినాలనీ, అర్థం చేసుకోవాలనీ అందరికీ ఉంటుంది. అందుకే సరళంగా, సున్నితంగా అందరికీ అర్థమయ్యే భాషలో పెద్ద అక్షరాలతో మీకు సమర్పిస్తున్నాను.

భగవద్గీతను చదివితే మనసుకు ప్రశాంతత కలుగుతుంది. మహాత్మాగాంధీ, వివేకానందుల వంటి ఎందరో త్యాగధనులకి ప్రేరణ శ్రీ భగవద్గీత. శ్రీ భగవద్గీతలో ప్రతి అక్షరమూ, ప్రతి శ్లోకమూ దైవత్వముతో నిండి ఉంది. మనకి ముక్తిని ప్రసాదించే అమృతరసం శ్రీ భగవద్గీత.

ఎన్నో సత్ సాంగత్యాల్లో, సమావేశాల్లో, ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాలో ఎందరో భగవత్ భక్తి పరులు చెప్పినవన్నీ అవగాహన చేసుకున్నాను. పదిహేను సంవత్సరాల క్రితం పడిన పునాది.... ఇప్పుడు అందమైన గీతాలయంగా రూపు దిద్దుకుంది.

శంకరాచార్యుల వారంతటి వారు వాఖ్య రాసిన శ్రీభగవద్గీత గీతా భావాన్ని మీకందివ్వటంలో తడబడితే, పొరపాట్లు ఉంటే తెలియచేయండి. తెలిసీ తెలియని మిడి మిడి జ్ఞానంతో ఎన్నో సంవత్సరాలుగా శ్రీభగవద్గీతపై



పెంచుకున్న మమకారంతో రాసి ఉంటే దయతో నాకు తెలియచెయ్యండి. శ్రమ అనుకోకుండా ఓ కార్డ్ మీద వ్రాస్తే మలిముద్రణలో సవరించుకుంటాను.

ముందు మాటలో ఇవన్నీ చెప్పటానికి కారణము.... శ్రీభగవద్గీత అను గీతను ఎవరికి వారే ఆస్వాదించాలి. గ్రహించాలి. పారాయణ చేయాలి. శ్రోతలా వినాలి. చదవాలి. అప్పుడే దాని అమృత తత్వము వారికి అందుతుంది. గీతలో శ్రీ భగవానుడు ఒకే ఒక్క పరమార్థం చెప్పాడు. శోకించవద్దు అనీ... సకల బంధనాల నుంచి నేనే ఉద్ధరిస్తానని... కాన గీత చదివి ఆచరించండి.

ధర్మం ఒంటి కాలిపై నడుస్తున్న ఈ కలియుగంలో ధన పాత్ర భక్తినీ, ప్రేమనీ, ఇష్టాలనీ దూరం చేస్తుంది. అందుకే ఈ నా మీ భగవత్ ప్రసాదాన్ని అత్యంత తక్కువ ధరకి అందిస్తున్నాను. ద్వారకా సోమనాథ్‌లను దర్శించి ఎంతో విలువైన వివరాలను అందిస్తున్నాను. అది కూడా శ్రీకృష్ణ పరమాత్మ ఆదేశమేనని భావిస్తున్నాను. పరమాత్మ కృప సకల ప్రాణికోటికీ అందాలని, మనమంతా సకల జీవకోటిని సమభావంతో చూసి పరంధాముని కృపను అందరము పొందాలని కోరుకుంటూ-

మీ

**మైథిలీ వెంకటేశ్వరరావు**

## విషయసూచిక







# శ్రీభగవద్గీతా ప్రారంభం

కౌరవులూ, పాండవులూ యుద్ధానికి సంసిద్ధులై కురుక్షేత్ర రణరంగానికి చేరి ఉన్నారని తెలిసిన ధృతరాష్ట్రుడు మహా వేదనకు గురయ్యాడు. వ్యాసమునీంద్రుడు వచ్చి మహారణమును చూడాలని భావిస్తే మహాదృష్టినిస్తానని చెబుతాడు. స్వజనుల మరణము చూడలేనని, కానీ యుద్ధవార్తలను వింటానని ధృతరాష్ట్రుడు చెప్పగా, వ్యాసమునీంద్రులు సంజయునికి మహా దివ్యశక్తినిస్తాడు. ధృతరాష్ట్రునకు సకల యుద్ధ విషయాలని చెప్పమంటాడు.

సంజయుడు యుద్ధభూమికి పోయి పది దినములు యుద్ధాన్ని చూసి, కౌరవసేనాని భీష్ముడు అంపశయ్యపై అర్జునుని బాణఘాతములతో ఉన్నాడని చెబుతాడు. ఆ వార్త విని ధృతరాష్ట్రుడు విలపించి ఆపై ఎంతోసేపటి తర్వాత సేదతీరి సంజయుడిని యుద్ధ విషయాలను గూర్చి అడగగా సంజయుడు చెప్పాడు.

శ్రీ భగవద్గీత ఆరంభము.

# అర్జున విషాదయోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- *1వ శ్లోకము నుంచి 11వ శ్లోకము వరకూ ఉభయ సేనల యందున్న ప్రధాన వీరుల సామర్థ్యములు.*
- *12వ శ్లోకము నుంచి 19వ శ్లోకము వరకూ ఉభయ పక్షంలోనున్న వీరుల శంఖ నినాదములు.*
- *20వ శ్లోకము నుంచి 27వ శ్లోకము వరకూ రెండు సేనల గూర్చి అర్జునుడు పరిశీలించటము.*
- *28వ శ్లోకము నుంచి 47వ శ్లోకము వరకూ అర్జునుడి విషాదపూరిత వచనములు.*



**శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః**

# శ్రీ భగవద్గీత

**శ్రీభగవద్గీతా - ప్రథమోఽధ్యాయః**

## అర్జునవిషాదయోగః

ధృతరాష్ట్ర ఉవాచ

**శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।**
**మామకాః పాణ్డవాశ్చైవ కి మకుర్వత సఞ్జయ ॥ 1**

 *ధృతరాష్ట్రుడు సంజయుడితో "ఓ సంజయా! నా వారు దుర్యోధనాదులూ, పాండుపుత్రులైన ధర్మరాజాదులూ యుద్ధ రంగమున మహా యుద్ధము చేయ సంకల్పించి కూడి ఉండి ఇరువురూ కురుక్షేత్రమున ఏం చేస్తున్నారు."*

*అవ. ధృతరాష్ట్రునితో సంజయుడు ఇలా పలికాడు.*

సంజయ ఉవాచ

**శ్లో॥ దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా ।**
**ఆచార్య ముపసఙ్గమ్య రాజా వచన మబ్రవీత్ ॥ 2**

ధృతరాష్ట్రునితో సంజయుడు "ఓ మహారాజా! రాజైన దుర్యోధనుడు వ్యూహంగా మలిచిన పాండవసేనను చూసి, ఆచార్యులైన ద్రోణాచార్యుని సమీపించి ఇలా పలికాడు."

*అవ. ఆచార్యులైన ద్రోణాచార్యునితో దుర్యోధనుడు చెప్తాడు.*

**శ్లో॥ పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్యమహతీం చమూమ్।**
**వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా । 3**

ఓ గురువర్యా! మహాబుద్ధిశాలియైన నీ శిష్యుడు ద్రుపదరాజు పుత్రుడు ధృష్టద్యుమ్నునిచే వ్యూహాత్మకంగా మలిచిన పాండవుల గొప్ప సైన్యాన్ని చూడుము.

*అవ. పాండవుల సేనలోని ముఖ్యులను గూర్చి ద్రోణాచార్యునికి చెప్తాడు దుర్యోధనుడు.*

**శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।**
**యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4**

**ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।**
**పురుజి త్కున్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుఙ్గవః ॥ 5**

**యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।**
**సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6**

ఈ పాండుపుత్రుల సేనయందు మహా గొప్ప ధనస్సుగల శూరులు కలరు. మహా పరాక్రమవంతులైన భీమార్జునులతో సమానమైన వీరులున్నారు. వారిలో సాత్యకీ, మహారథుడైన ద్రుపదుడూ, ధృష్టకేతువూ, చేకితానుడూ, పరాక్రమముగల కాశీరాజూ, పురుజిత్తూ, కుంతీభోజుడూ, శైబ్యుడూ, శౌర్యవంతుడగు యుధామన్యుడూ, వీరుడూ శౌర్యవంతుడైన ఉత్తమౌజుడూ, సుభద్రా పుత్రుడు



అభిమన్యుడూ ద్రౌపది యొక్క అయిదుగురు పుత్రులూ ఉన్నారు. అంతా మహారథులు. శౌర్యంలో భీమునికీ, అర్జునునికీ సమానులు.

*అవ. అలా వైరిపక్షం గూర్చి చెప్పి స్వపక్షం గూర్చి చెప్తాడు.*

**శ్లో॥ అస్మాకంతు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ ।**
**నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥7**

ఓ బ్రాహ్మణోత్తమా! మన పక్షమున ఎవరు ప్రముఖులై ఉన్నారో నా మహాసేనకు నాయకులైన వార్ని గూర్చి తెలుసుకొనుము. వారినందరినీ నీకు జ్ఞాపకం చేయుట కొరకు తెలియ చేస్తున్నాను వినుము.

*అవ. తన పక్షమునున్న వీరుల గూర్చి దుర్యోధనుడు చెబుతున్నాడు.*

**శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితిఞ్జయః।**
**అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ ॥ 8**

**అన్యేచ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః।**
**నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥ 9**

మీరూ భీష్మాచార్యుల వారునూ, కర్ణుడూ, సమరమున విజయాన్ని పొందేవారైన కృపాచార్యులవారూ, అశ్వత్థామా, వికర్ణుడూ, అలాగే సోమదత్తుని పుత్రుడు భూరిశ్రవుడు ఇంకా అనేక శూరులు నాకై ప్రాణాలను ధారపోసే వారైన వీరంతా అనేక శస్త్రాస్త్రములు కలవారు.... యుద్ధ ప్రవీణులు.

*అవ. దుర్యోధనుడు తన సేనలోని వీరులను పొగడుకొని ఆపై ఇరుసేనలను లెక్కగట్టి తన సైన్యమెంత గొప్పదో చెబుతున్నాడు.*

**శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।**
**పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10**

అలాంటి మహా వీరులున్న మన సైన్యం భీష్మాది పితా మహుల వారితో రక్షింపబడుతోంది. అజేయమైనది మన సైన్యం. అయితే భీమ సేనుని రక్షణలోనున్న పాండవుల సైన్యం పరిమితం. తేలికగా జయించ వచ్చును.

*అవ. అలా దుర్యోధనుడు సైన్య శక్తిని చెప్పి తన వీరులందరికీ భీష్మాచార్యుల వారిని సదా కనిపెట్టుకోమని ఇలా చెప్పాడు.*

**శ్లో॥ అయనేషుచ సర్వేషు యథాభాగ మవస్థితాః।**
**భీష్మ మే వాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవ హి॥ 11**

కాన మీరంతా మీ మీ వ్యూహస్థానములలో ఉండి సకలవైపుల నుంచి భీష్మణ్ణి సర్వవిధాలుగా కాపాడుతూ ఉండండి.

*అవ. భీష్ముడు శంఖాన్ని పూరించాడు.*

**శ్లో॥ తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః ।**
**సింహనాదం విన ద్యోచ్చై శ్శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥ 12**

భీష్ముడు శంఖనాదం చేశాడు. దుర్యోధనుడు ఆనందించేలా సింహ గర్జనలా శంఖాన్ని పూరించాడు. భీష్ముడు అంతటి సింహనాదం చెయ్యటం వెనుక దుర్యోధనుడి మనసు సంతోషపడటం మాత్రమే కాకుండా స్వపక్షం ఉత్సాహం కొరకూ, పాండవులు కలత చెందేలా మహా సింహనాదం చేసి శత్రువులని కలవర పెట్టాలని భావించాడు. అంతటి సింహనాదం చేశాడు.

*అవ. ఆపై కురుసేనలో మిగతా వీరులంతా తమ తమ శంఖాదులను పూరించారు.*

**శ్లో॥ తత శ్శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।**
**సహసై వాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్॥ 13**



భీష్ముడు సింహనాదం చేసిన తర్వాత కౌరవ సైన్యమందలి మిగతావారంతా ఒక్కసారిగా వారి వారి శంఖాలను పూరించారు.

*అవ. ఆ తర్వాత నరనారాయణులు తమ తమ శంఖాలని పూరించారు.*

**శ్లో॥ తత శ్శ్వేతైర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।**
**మాధవః పాణ్డవ శ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః॥ 14**

ఆ తర్వాత తెల్లని గుర్రాలను పూన్చిన రథం పైనున్న నరనారాయణులు కృష్ణార్జునులు తమ తమ శంఖాలను పూరించారు.

*అవ. పాండవులు పూరించిన శంఖాలను గూర్చి సంజయుడు ధృతరాష్ట్రునికి వివరించాడు.*

**శ్లో॥ పాఞ్చజన్యం హృషీ కేశో దేవదత్తం ధనఞ్జయః।**
**పౌండ్రం దధ్మౌమహాశఙ్ఖం భీమకర్మా వృకోదరః॥ 15**

ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణుడు పాంచజన్యమునూ, ధనుంజయుడు అర్జునుడు దేవదత్తమునూ పూరించారు. అలాగే మహా భయంకర కార్యాలను సాధించగల భీమసేనుడు పౌండ్రమను గొప్ప శంఖాన్ని పూరించాడు.

*అవ. ధర్మరాజూ, నకుల సహదేవులూ శంఖాలను పూరించుట.*

**శ్లో॥ అనన్తవిజయం రాజా కున్తీపుత్రో యుధిష్ఠిరః ।**
**నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ 16**

ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణార్జునుల తర్వాత భీముడూ ఆపై ధర్మరాజూ అనన్త విజయమను శంఖాన్నీ, నకులుడు సుఘోష మను శంఖాన్నీ, సహదేవుడు మణిపుష్పకమను శంఖాన్నీ పూరించారు.

*అవ. పాండవుల సేనలోని వీరులు శంఖాలను పూరించుట.*

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీచ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః ॥ **17**

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।
సౌభద్రశ్చ మహాబాహుః శఙ్ఖా న్దధ్ముఃపృథక్ పృథక్ ॥ **18**

 ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఎంతో శ్రేష్ఠమైన ధనస్సు గల కాశీరాజూ, మహా రథుడైన శిఖండీ, ద్రౌపదీ సోదరుడు ధృష్టద్యుమ్నుడూ, బంధువు విరాటుడూ, ద్రౌపదీ పుత్రులైన ఉప పాండవులూ, సుభద్రా పుత్రుడు అభిమన్యుడూ తమ తమ శంఖాలను పూరించారు.

*అవ. పాండవులు పూరించిన శంఖాల ధ్వని గూర్చి వివరించుట.*

శ్లో॥ సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములోఽ భ్యనునాదయన్ ॥ **19**

 పాండవ పక్షంలోని వారంతా చేసిన శంఖధ్వనులకి భూమీ, ఆకాశం మారుమ్రోగింది. మహా ప్రతి ధ్వనులతో కౌరవపక్షాన ఉన్నవారికి గుండెలు చీల్చేసేలా చేసి మనసులను కకావికలం చేసింది.

*అవ. ఆ మహా శంఖాల ధ్వనికి అర్జునుడు ఆనందపడి శ్రీకృష్ణునితో చెప్పినది ధృతరాష్ట్రునికి సంజయుడు చెప్పాడు.*

శ్లో॥ అథ వ్యవస్థితా న్దృష్ట్వా ధార్త రాష్ట్రా న్కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్ర సంపాతే ధను రుద్యమ్య పాణ్డవః ॥ **20**

శ్లో॥ హృషీ కేశం తదా వాక్య మిద మాహ మహీపతే ।

 ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ తర్వాత రణరంగమున ఆయుధ ప్రయోగాలు జరగబోతుండగా, కపిధ్వజుడగు అర్జునుడు విల్లుని ధరించి శ్రీకృష్ణునితో చెప్పాడు.



*అవ. అర్జునుడు రణోత్సాహంతో శ్రీకృష్ణునునితో చెప్పాడు.*

అర్జున ఉవాచ.

శ్లో॥ సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽ చ్యుత ॥ **21**

శ్లో॥ యావ దేతాన్నిరీక్షేహం యోద్ధుకామా నవస్థితాన్ ।
కై ర్మయా సహయోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే ॥ **22**

 శ్రీకృష్ణా! యుద్ధమున నేను ఎవరితో రణము చేయవలెనో, వారిని నేను బాగా చూడగలిగేలా ఉభయ సేనల మధ్యకి రథాన్ని నడుపుము.

శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽ హంయఏతేఽ త్రసమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ **23**

 దుర్బుద్ధి గల దుర్యోధనుడికి రణరంగాన విజయాన్ని సాధించాలని భావించి కూడి ఉన్నారో వారందరినీ... యుద్ధానికి సిద్ధమైన వారినందరినీ నేను చూడగోరుతున్నాను.

*అవ. శ్రీకృష్ణుడు రథాన్ని ఉభయసేనల మధ్యకి నడిపాడు.*

సంజయ ఉవాచ.

శ్లో॥ ఏవ ముక్తో హృషీకేశో గుడా కేశేన భారత ।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ **24**

భీష్మద్రోణప్రముఖత స్స ర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతా న్సమవేతా న్కురూ నితి ॥ **25**

 సంజయుడు చెప్పాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడి పలుకులతో శ్రీకృష్ణుడు ఉత్తమమైన రథమును ఉభయ సేనల మధ్యకి తీసుకెళ్ళి భీష్మద్రోణాదుల ఎదుట, సకల రాజుల ఎదుట నిలిపి చెప్పాడు. ఓ అర్జునా! చూడుము ఇక్కడ చేరి ఉన్న ఈ కౌరవులను చూడుము.

అవ. ఆ తర్వాత అర్జునుడు ఏం పలికాడో సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పాడు.

శ్లో॥ త త్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్పుత్రాన్పౌత్రాన్సఖీం స్తథా ॥ 26

శ్లో॥ శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయో రపి ।

అర్జునుడు యుద్ధరంగము మధ్యన రథంపై నిలిచి రెండు సేనల వైపున్న తండ్రుల తాతలనూ, తాతముత్తాతలనూ, గురువులనూ, మేనమామలనూ, సోదరులనూ, పుత్రులనూ, అలాగే మామలనూ, ఆత్మీయులనూ.. అందరినీ చూశాడు.

అవ. అర్జునుడు ఇరుసైన్యమందలి బంధువులను చూసి అర్జునుడు చెప్పాడు.

శ్లో॥ తా న్సమీక్ష్య సకౌన్తేయ స్సర్వాన్ బన్ధూ నవస్థితాన్ ॥ 27
కృపయా పరయాఽఽ విష్టో విషీద న్నిద మబ్రవీత్ ।

అర్జునుడు యుద్ధ రంగమున నిలిచి ఉన్న ఇరు సేనలలోని సకల బంధువులను చూసి అపారమైన కనికరంతో దుఃఖిస్తూ శ్రీకృష్ణునితో చెప్పాడు.

అవ. అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మతో తన స్థితి గూర్చి చెప్పట.

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥ 28
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే ॥ 29
గాండీవం స్రంసతే హస్తా త్త్వ క్చైవ పరిదహ్యతే ।
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥ 30

అర్జునుడు ఇలా చెప్పాడు. ఓ కేశవా! సమరం చేయుటకై కూడి ఉన్న సకల బంధువులూ, నా స్వజనమునూ చూసి నా



అంగములు పట్టు జారిపోతున్నాయి. నోరు ఎండిపోతోంది. నా శరీరం కంపరమూ, గగుర్పాటుకు లోనవుతోంది. నా చేతిలోని గాండీవం జారిపోతోంది. నా శరీరమంతా మండిపోతోంది. గిర్రున తిరుగుతున్నట్టుంది. నిలుచుటకై కూడా శక్తి లేకుండా ఉంది.

అవ. సమరంపై తన అయిష్టతను శ్రీకృష్ణునితో అర్జునుడు చెప్పాడు.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
న చ శ్రేయోనుపశ్యామి హత్వా స్వజన మాహవే ॥ 31

ఓ శ్రీకృష్ణా! విపరీతములైన శకునములను చూచుచున్నాను. యుద్ధమున బంధువులని చంపి ఆపై పొందబోయే శ్రేయస్సు ఎట్టిదో నాకు కనిపించుటలేదు.

అవ. దేనిపైనా వ్యామోహం లేదని అర్జునుడు చెప్పాడు.

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖానిచ ।
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా ॥ 32

శ్రీకృష్ణా! నాకు అట్టి విజయము గానీ, రాజ్య సుఖముగానీ వలదు. అలాంటి రాజ్యము వలన వచ్చే భోగముల వల్లా, సుఖముల వల్లా ఏం ప్రయోజనం.. ఏం లాభం. నాకేమీ తెలియుటలేదు.

శ్లో॥ యేషా మర్థేకాఙ్క్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ ॥ 33

ఎవరి కోసం రాజ్యమునూ, భోగములనూ, సుఖాలనూ మనం కోరుతున్నామో, అట్టి వారంతా... వారూ, వీరూ కూడా సంపదల పైనా, ప్రాణములపైనా ఆశలను వదలుకొని యుద్ధరంగాన నిలిచి ఉన్నారు.

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః ।
మాతులా శ్శ్వశురాః పౌత్రా శ్యాలా స్సమ్బన్ధిన స్తథా ॥ 34

 గురువులూ, తండ్రులూ, తాతలూ, కొడుకులూ, మేనమామలూ, మామలూ, మనుమలూ, బావమరుదులూ.... ఇంకా అనేకమంది బంధువులు చేరి ఉన్నారు.

అవ. ముల్లోకాల ఆధిపత్యమైనా వద్దనుట.

శ్లో॥ ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే ॥ 35

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన ।
పాపమే వాశ్రయే దస్మా న్హ త్వైతా నాతతాయినః ॥ 36

 ఓ శ్రీకృష్ణా.. నేను మరణించినా సరే లేదా ఈ యుద్ధం ద్వారా మూడు లోకాల ఆధిపత్యం వచ్చినా సరే నాకొద్దీ యుద్ధం. ఇక ఈ భూమండలం కోసమే యుద్ధము అయితే చెప్పేదేముంది. ధృతరాష్ట్రుల పుత్రులను చంపటం వల్ల ఏం మూటగట్టుకుంటాము. ఈ సమరం నాకు వద్దు.

అవ. అయిన వాళ్లని చంపుకొని బావుకొనేది ఏముంది
అని అర్జునుడు చెప్పట.

శ్లో॥ తస్మా న్నార్హావయం హన్తుం ధార్తరాష్ట్రా న్సబాన్ధవా న్ ।
స్వజనం హి కథం హత్వా సుఖిన స్స్యామ మాధవ ॥ 37

 మధువను రాక్షసుణ్ణి చంపుట ద్వారా మధుసూదనుడిగా పిలవబడే శ్రీకృష్ణా... అయిన వారినీ, గురువులనీ, ఆప్తులనీ చంపుకొనుట ద్వారా ఏం సుఖాలు వస్తాయి. మన వారిని చంపుకోవటం ద్వారా మేం ఏం సుఖపడగలము.



శ్లో॥ యద్య ప్యేతే న పశ్యన్తి లోభోపహతచేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥38

శ్లో॥ కథం నజ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్ ।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ॥ 39

 శ్రీకృష్ణా... రాజ్యం కోసం అన్ని రకాలుగా పాపచింతనలతో భ్రష్టులైన దుర్యోధనాదులకు వంశ నాశనమునకు కలిగే దోషముల గూర్చీ, మిత్ర ద్రోహాలకు కలిగే పాపముల గూర్చీ తెలియకపోవచ్చు. అన్నీ తెలిసిన నేను ..... కులనాశనము వల్ల కలిగే నష్టాలను ఎరింగిన నేను ఆ పాపములకు దూరంగా ఉండుట ఎందుకు చేయరాదు. ఈ యుద్ధాన్ని ఎందుకు విరమించకూడదు.

అవ. పార్థుడు తన మనోగతాన్ని శ్రీకృష్ణునికి తెలుపుతున్నాడు.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మా స్సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత ॥ 40

 కులనాశనము వల్ల సకల కులధర్మములు పూర్తిగా నశించును. తద్వారా ధర్మములూ, ఆచారములూ అంతరించి అంతటా పాపం ఆవహించును.

శ్లో॥ అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥ 41

 అట్టి పాపములు ద్వారా, అధర్మము ద్వారా కులస్త్రీలు అన్ని రకాలుగా చెడిపోవుదురు. అలా స్త్రీలు చెడిపోయినప్పుడు వర్ణ సంకరం కలుగును.

శ్లో॥ సఙ్కరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః ॥ 42

వర్ణసంకరమను మహాపాపములను, కులనాశనము చేసిన వారిని నరకంలో పడవేస్తారు. దానితోపాటు ధర్మము లేకపోవటంతో శ్రాద్ధ తర్పణములుచేయుట మానుటతో పితరులు అధోగతి చెందెదరు.

శ్లో॥ దోషై రేతైః కులఘ్నానాం వర్ణసఙ్కరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥ 43

శ్రీకృష్ణా! కులనాశనము వల్ల వర్ణ సాంకర్యము కలిగి కుల ఘాతకుల యొక్క పూర్వ పురాతన, సనాతన శాశ్వత ధర్మములన్నీ నశించిపోవును.

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ ॥ 44

శ్రీకృష్ణా! అలా కులధర్మములు నశించిన వారికి శాశ్వత నరక నివాసమే గతి. అట్టి నరకములు నాకు తగునా!

శ్లో॥ అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
య ద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః ॥45

ఆహా! అన్ని ధర్మములు తెలిసీ బుద్ధిమంతులమై ఉండి కూడా రాజ్యము కోసం, తద్వారా వచ్చే సుఖముల కోసం అయిన వారిని చంపుటకు సిద్ధమయ్యాం. మహాఘోరపాపాలను చేయుటకు సంసిద్ధులమయ్యాము. ఎంతటి మహా దారుణము.

శ్లో॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రారణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్ ॥ 46

సకల దివ్య అస్త్రాలను తెలిసిన నన్ను, శస్త్ర రహితుడై వున్న నన్ను, అస్త్రములతో దుర్యోధనాదులు ఈ మహాయుద్ధ



రంగమున నన్ను వధించినా అది నాకు పుణ్యమూ, క్షేమకరమే అవుతుంది.

సంజయ ఉవాచ.

శ్లో॥ ఏవ ముక్త్వాఽర్జున స్సఙ్ఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥ 47

సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పాడు. ఓ మహారాజా! అలా అర్జునుడు బంధువులనూ, స్నేహితులనూ, మిత్రులనూ చూసి శోకించి యుద్ధ భూమి నందు ధనస్సునూ, బాణములనూ విడిచి రథం వెనుక భాగమున చతికిలబడ్డాడు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః**

## మానసిక ప్రశాంతత కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాణ్డవాశ్చైవ కి మకుర్వత సఞ్జయ ॥

1వ అధ్యాయము-1వ శ్లోకము చేయాల్సిన రోజులు-21 జపసంఖ్య-25 వేలు



# సాఙ్ఖ్య యోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- ★ రెండవ అధ్యాయములోని ఈ సాఙ్ఖ్య యోగంలో *1*వ శ్లోకము నుంచి *10*వ శ్లోకము వరకూ అర్జునుడు తన మానసిక వ్యధను శ్రీకృష్ణ పరమాత్మునికి చెప్పుట. శ్రీకృష్ణునితో సంవాదము.
- ★ *11*వ శ్లోకము నుంచి *30*వ శ్లోకము వరకూ జ్ఞాన ఆత్మ **స్వరూప వివరణలు**
- ★ *31*వ శ్లోకము నుంచి *38*వ శ్లోకం వరకూ క్షత్రియ ధర్మాలను అనుసరించి యుద్ధం చెయ్యాల్సిన ధర్మ ముందని అర్జునునికి శ్రీకృష్ణుడు తెలియచెప్పుట.
- ★ *39*వ శ్లోకము నుంచి *53*వ శ్లోకము వరకూ నిష్కామ కర్మ యోగం గూర్చి వివరణ.
- ★ ***54***వ శ్లోకము నుంచి *72*వ శ్లోకము వరకూ స్థిత ప్రజ్ఞుని లక్షణముల మహిమలు.



# సాఙ్ఖ్య యోగః

సంజయ ఉవాచ.

శ్లో॥ తం తథా కృపయా౽౽విష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః ॥ 1

సంజయుడు చెప్పాడు. ఓ మహారాజా! అలా పలికిన అర్జునుడి కనులు అశ్రువులతో నిండిపోయాయి. ఎంతగా వ్యధ చెందుతున్నాడో, శోకించాడో చూస్తుంటేనే వాని కనులు తెలుపుతున్నాయి. ఆ స్థితిలో ఉన్న అర్జునుడితో శ్రీకృష్ణుడు చెబుతున్నాడు.

*అవ. అర్జునుడి మనోస్థితి చూసి పరమాత్మ శ్రీకృష్ణుడు ధైర్యవచనములు చెప్పట.*

శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో॥ కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥ 2

శ్రీభగవానుడు చెబుతున్నాడు. ఓ అర్జునా! ఇలా రాకూడని సమయంలో పామరులకు వచ్చేది అయిన మోహము నీకెలా దాపురించింది. ఇది నీ వంటి వానికి రాకూడనిది. మోహము మహా

సుఖాలనూ, స్వర్గములనూ ఇచ్చేది కాదు. అపయశస్సును కలుగచేయు ఆ మోహము నీకు తగదు.

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్య క్త్వోత్తిష్ఠ పరన్తప ॥ 3

కాన అర్జునా! పిరికితనమునూ, అధైర్యమునూ పొందకు. నీ వంటి వానికి అవి తగవు. నీచమగు తుచ్ఛమైన హృదయ దౌర్భల్యమును వదలివేయి. యుద్ధమునకు సంసిద్ధుడవుగా.

*అవ. శ్రీకృష్ణుడు అలా ధైర్యవచనాలు చెప్పినా అర్జునుడు తన మనసు మార్చుకోలేక యుద్ధం పాపహేతువే అని చెప్పట.*

అర్జున ఉవాచ.

శ్లో॥ కథం భీష్మ మహం సఙ్ఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ వరిసూదన ॥ 4

అర్జునుడు పలుకుతున్నాడు. ఓ శ్రీకృష్ణా! భీష్మపితామహులు పూజ్యులు. ద్రోణాచార్యుల వారు గురువులు.యుద్ధమున వారిని ఎదిరించి వారిపై బాణములు ఎలా వేయగలను. వారిరువురిపై నాకు భక్తీ, గౌరవములు. ధనస్సును చేపట్టుట నా వల్లకాదు.

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయ శ్చర్తుం భైక్ష మపీహ లోకే ।
హ త్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ
భుఞ్జీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥ 5

అట్టి గౌరవమూ, భక్తి గలవారిని చంపకుండా లోకాన భిక్షమెత్తుకోనయినా జీవించటం ఎంతో మంచిది. గురువులనూ, బంధువులనీ చంపి వారి రక్తముతో తడిసిన సకల భోగములనూ, ధనములనే కదా నేను అనుభవించేది.



శ్లో॥ న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః ।
యా నేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥ 6

దానికి తోడు ఈ యుద్ధమున ఎవరు గెలుస్తారో, ఎవరు ఓడిపోతారో... ఈ రెంటిలో ఏదవుతుందో కూడా తెలీదు. మన కందరకూ ఆత్మీయులైన వారు మనముందు నిలిచి ఉన్నారు. వారిని చంపుటకు నేను ఇష్టపడలేకున్నాను. నా వల్ల కాదు. నేను అసక్తుడనవుతున్నాను. నాకేమీ పాలుపోవుట లేదు.

*అవ. కర్తవ్యము తెలియ చెప్పమని అర్జునుడి ప్రార్థన.*

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
య చ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్ ॥ 7

పిరికితనమునకు లోనయ్యాను. నా అసలు సిసలు స్వభావమును పోగొట్టుకున్నాను. ధర్మాధర్మముల విచక్షణ చేస్తూ నా కర్తవ్యాన్ని నిర్ణయించుకోలేకపోతున్నాను. ఓ శ్రీకృష్ణా! నేను నీకు శిష్యుడను. ఏది మంచిదో నీవే చెప్పుము. నిన్నే శరణు పొంది ఉన్నాను. నీవు నిర్ణయించిన ప్రకారం నడచుకుంటాను.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మిన్ద్రియాణామ్ ।
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్ ॥ 8

నన్ను ఆవహించిన మహాశోకము నన్ను దహించి వేస్తోంది. మహా సంపదలతో ఎదురు లేని తిరుగులేని రాజ్యము పొందినా కూడా ఆఖరుకు దేవేంద్ర పదవి వచ్చినా కూడా ఈ శోకము చల్లార్చునదీ, పోగొట్టగలిగేదీ ఏదో తెలియకుండా ఉంది.

అని అర్జునుడు పలికాడు అని సంజయుడు చెప్పటం ప్రారంభించాడు.

సంజయ ఉవాచ.

శ్లో॥ ఏవ ముక్త్వా హృషీ కేశం గుడాకేశః పరన్తపః ।
నయోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ ॥9

సంజయుడు చెబుతున్నాడు. ఓ మహారాజా! అలా పలికిన అర్జునుడు శ్రీకృష్ణునితో నేను యుద్ధము చేయనే చేయను అని స్పష్టం చేసి మౌనంగా ఉండిపోయాడు.

శ్లో॥ త మువాచ హృషీ కేశః ప్రహసన్నివ భారత ।
సేనయో రుభయో ర్మధ్యే విషీదన్త మిదం వచః ॥ 10

ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇరుసేనల మధ్య మహా శక్తి సంపన్నుడైన అర్జునుడిని చూసి సన్నగా చిరుమందహాసము చేసి శ్రీకృష్ణుడు పలికాడు.

శ్రీ భగవాన్ ఉవాచ.

శ్లో॥ అశోచ్యా నన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూ నగతాసూం శ్చ నానుశోచన్తి పణ్డితాః ॥ 11

శ్రీ భగవానుడు చెబుతున్నాడు. ఓ అర్జునా... నీవు శోకింపదగని వారి గూర్చీ, వాటి గూర్చీ శోకిస్తున్నావు. దానికి తోడు పండితుని



వలె మాట్లాడుతున్నావు. జ్ఞానులు మరణించిన వారిని గూర్చీ, జీవించి ఉన్న వారి గూర్చీ ఎన్నటికీ శోకించరు.

అవ. బంధుమిత్రుల గూర్చి శోకించరాదని పరమాత్మ చెప్పట.

శ్లో॥ న త్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్ ॥12

ఓయీ అర్జునా! నేను గానీ, నీవు గానీ ఈ రాజులందరు గానీ ఒకప్పుడు లేనివారూ కాదు.. ఇక ముందు లేకపోవటమూ ఉండదు. అన్ని కాలములందు మనమంతా ఉన్నాము (శరీరం నాశనమయినంత మాత్రాన నశించేది కాదు ఆత్మ).

అవ. దేహం అశాశ్వతమని శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారంయౌవనంజరా।
తథా దేహాన్తరప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి ॥ 13

జీవునికి శరీరమునందు బాల్యమూ, యౌవ్వనమూ, వార్ధక్యమూ ఉన్నట్టే ఇంకొకటి అయిన దేహప్రాప్తియు (మరణానంతరము మరొక శరీరాన్ని ఆశ్రయించుట) ఉంటుంది. కావున అర్జునా.. ఆ విషయాన పండితుడన్నవాడూ, ధీరుడన్న వాడూ మోహమును చెందడు.

అవ. బంధుమిత్రుల వల్ల కలిగే సుఖాలు శాశ్వతములు కావని చెప్పట.

శ్లో॥ మాత్రాస్పర్శా స్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽ నిత్యా స్తాం స్తితిక్షస్వ భారత ॥ 14

ఓ కౌంతేయా... విషయముల వల్ల శరీరమునకు శీతమూ, ఉష్ణమూ, సుఖదుఃఖములు కలుగుతాయి. అట్టివి శాశ్వతమైనవి కావు. రాకపోకడలు గలవి. అవి అనిత్యములు. కాన అర్జునా... వాటి గూర్చి పట్టించుకోక ఓర్చుకొనుము.

అవ. సమభావం వల్ల ఎంత ఉన్నతి స్థితి కలుగుతుందో చెప్పట.

శ్లో॥ యం హి న వ్యథయ న్త్యేతే పురుషం పురుషర్ష భ।
సమదుఃఖసుఖం ధీరం సోఽ మృతత్వాయ కల్పతే ॥ 15

అదెలాగో చెబుతాను విను. అర్జునా! ధీరుడన్న వాడు సుఖాలనీ, దుఃఖాలనీ సరిసమానంగా చూస్తాడు. అట్టి వానికి ఎట్టి విషయాలు చలింపచేయవు. అట్టి వాడే మహా మోక్షమునకు అర్హుడు.

అవ. సత్యమైన వాటి గూర్చి అసత్యమైనవాటి గూర్చి చెప్పట.

శ్లో॥ నా సతో విద్యతేభావోనాఽ భావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽ న్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥ 16

అసత్యములైన వాటికి ఉనికి లేదు. సత్యమైన ఆత్మకు లేమి లేదు. ఈ రెంటి వాస్తవ స్వరూపాలను తత్త్వజ్ఞానులు నిశ్చయంగా తెలుసుకొని ఉన్నారు.

శ్లో॥ అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్।
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి ॥ 17

ఓ అర్జునా... ఈ సకల ప్రపంచము పరమాత్మచే వ్యాపించి ఉంది. అది నాశరహితము. అది శాశ్వతము. దాన్ని ఎవ్వరూ నశింప చేయలేరు.

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్య స్యోక్తాః శరీరిణః।
అనాశినోఽ ప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత ॥ 18

ఈ శరీరములు మాత్రమే నశిస్తాయి. జీవాత్మకు నాశనము లేదు. అది అనిర్వచనీయము. శాశ్వతమైనదాన్ని ఎవ్వరూ నాశనం చేయలేరు. కాన ఈ విషయము తెలుసుకొని యుద్ధము చేయుము అర్జునా.



అవ. ఆత్మకు మరణం లేదు. అది చంపబడదని ఆత్మ స్వభావములు తెలుపుట.

శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌతౌన విజానీతో నాయం హన్తి న హన్యతే ॥ 19

ఆత్మను ఇతరులు చంపునని భావించినవాడూ, లేక ఇతరులచే చంపబడునని భావించేవాడూ ఇద్దరూ అజ్ఞానులే. అర్జునా ఆత్మ ఎవ్వరినీ చంపదు. అలాగే ఎవ్వరి చేత చంపబడదు.

అవ. ఆత్మ నిర్వికారుడని చెప్పట.

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః ।
అజో నిత్య శ్శాశ్వతోఽ యం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ 20

ఈ ఆత్మ ఏ కాలమునందు పుట్టదు. గిట్టదు. శరీరము నశించిననూ ఆత్మ నశించదు. ఆత్మ నాశరహితము. జన్మ లేనిది. శరీరం నశించినా ఆత్మ మరణించుట లేదు. నిత్యము, శాశ్వతము, పురాతనము అయినది.

శ్లో॥ వే దావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయం ।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తికమ్ ॥ 21

ఓ అర్జునా.... ఈ ఆత్మ నిత్యము. జనన మరణము లేనిది. నాశరహితము. అది తెలిసినవాడు జ్ఞాని. అట్టి జ్ఞాని ఒకరిని చంపుతానని ఎలా అనుకోగలడు. మరెలా చంపగలడు.

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽ పరాణి ।

తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥ 22

 ఓ అర్జునా! మానవుడు చినిగిపోయిన పాత వస్త్రమును వదలి అనగా జీర్ణవస్త్రమును వదలి నూతన వస్త్రమును ధరించినట్టు నాశరహితమైన ఆత్మ జీర్ణమైన శరీరాన్ని వదలి నూతన శరీరాన్ని ఆశ్రయించును.

అవ. ఆత్మను భూమీ, నీరూ, ఆకాశమూ, గాలీ, అగ్నీ బాధించలేవని చెప్పట.

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
నచైనం క్లేదయ న్త్యాపో న శోషయతి మారుతః ॥ 23

 ఈ ఆత్మను శస్త్రములు ఛేదింపలేవు. అగ్ని దహించలేదు. నీరు తడుప లేదు. వాయువు ఆరిపోయేటట్టు చేయలేదు.

శ్లో॥ అచ్ఛేద్యోఽ యమదాహ్యోఽ యమక్లేద్యోఽ శోష్యఏవచ।
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽ యం సనాతనః ॥24

 ఈ ఆత్మ ఛేదించుటకు, దహించుటకు, తడుపుటకు, నాశనము చేయుటకు సాధ్యము కాదు. ఆత్మ నిత్యము. సర్వవ్యాప్తి స్థిర స్వరూపము. శాశ్వతము. సనాతనము.

అవ. అర్జునునికి ఆత్మ శాశ్వతము అని చెప్పట.

శ్లో॥ అవ్యక్తోఽ యమచిన్త్యోఽ యమవికార్యోఽ యముచ్యతే।
తస్మా దేవం విది త్వైనం నానుశోచితు మర్హసి ॥ 25

 ఈ ఆత్మ ఇంద్రియములు చూడలేనిది. మనస్సునకు అందనిది. ఎట్టి వికారములూ లేనిది. కాన అర్జునా... ఈ సత్యమును తెలుసుకొని శోకింపకు.



అవ. ఆత్మ గూర్చి దుఃఖించుట తగదని చెప్పట.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి ॥ 26

 అర్జునా! ఆత్మకు జ్ఞానము, మరణము ఉన్నవని నీవు భావించినప్పటికీ అలాంటి స్థితికి కూడా నీవు ఈ ప్రకారము శోకించుట తగదు.

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్యచ ।
తస్మా దపరిహార్యేఽ ర్థే న త్వం శోచితు మర్హసి ॥ 27

 ఆత్మకు చావు పుట్టుకలు గలవని తలచినా, పుట్టిన వారికి మరణం తప్పదు. మరణించిన వారికి తిరిగి పుట్టుక తప్పదు. తప్పని సరిగా జరిగే ఆ విషయాల గూర్చి శోకింప తగదు.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనా న్యేవ తత్ర కా పరిదేవనా ॥ 28

 ఓ అర్జునా! ప్రాణికోటంతా పుట్టుటకు ముందు ఇంద్రియ గోచరములు కావు. మరణానంతరమున కూడా అవి గోచరించవు. మధ్యకాలమందు మాత్రమే, శరీరంలో ఉన్నంతవరకే, జనన మరణముల మధ్య కాలమందే అవి ఇంద్రియ గోచరములు. అట్టి వానికి శోకించి నిష్ప్రయోజనము.

శ్లో॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేనమ్
ఆశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః ।
ఆశ్చర్యవ చ్చైన మన్యః శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥ 29

ఆత్మను ఒకడు ఆశ్చర్యమైనదానివలే చూస్తున్నాడు. మరొకరు ఆశ్చర్యంగా చెప్పుచున్నాడు. ఇంకొకరు ఆశ్చర్యమైనదానివలే వినుచున్నాడు. విన్నా, చూసినా, చెప్పినా ఎవరూ దాన్ని గూర్చి తెలుసుకొనుటలేదు.

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽ యం దేహే సర్వస్య భారత ।
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి ॥ 30

ఓ అర్జునా! ప్రతి శరీరమునందు ఉండే ఆత్మను వధించుటకు ఎటుల వీలగును. కాన నీవు ఏ ప్రాణి గూర్చీ శోకింపవలదు.

*అవ. క్షత్రియ ధర్మమునననుసరించి నీవు దుఃఖించుట తగదని శ్రీభగవానుడు చెప్పట.*

శ్లో॥ స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽ న్యత్ క్షత్రియస్య నవిద్యతే ॥ 31

ఓ అర్జునా! నీవు క్షత్రియుడవు. స్వధర్మమును గూర్చి విచారించినను యుద్ధంలో వెనక్కి తగ్గటం క్షత్రియ ధర్మం కాదు. ధర్మయుద్ధం క్షత్రియునకు శ్రేయస్కరమైన కర్తవ్యము.

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభన్తే యుద్ధ మీదృశమ్ ॥ 32

కామక్రోధరాగద్వేష దుష్ట ఆలోచనలతో కలిగే పోరు ప్రతి వారికి వస్తుంది. క్షత్రియులకి మాత్రమే ఇట్టి ధర్మపోరు లభిస్తుంది.. ఓ పార్థా... అప్రయత్నంగా లభించిన ఈ యుద్ధము నీ వంటి అదృష్టవంతులైన క్షత్రియులకే లభిస్తుంది. ఇట్టి అవకాశం స్వర్గమునకు తెరిచిన ద్వారము వంటిది. మహా సుఖశాంతులను కలిగిస్తుంది.



శ్లో॥ అథచేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి ।
తత స్స్వధర్మం కీర్తించ హిత్వా పాప మవాప్స్యసి ॥ 33

ఇట్టి సమయంలో ధర్మయుద్ధం చేయకుంటే దాని స్వధర్మమును విడిచిన వాడివై కీర్తిని పోగొట్టుకొని పాపమును పొందెదవు. అయిన వారిలోనూ, లోకులలోనూ తక్కువవుతావు.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽ వ్యయామ్ ।
సమ్భావితస్య చాకీర్తిః మరణా దతిరిచ్యతే ॥ 34

ఇంకా లోకులంతా నీ అపకీర్తినీ, యుద్ధరంగము నుంచి నీవు జారిపోయిన విషయాన్నీ అనేక రకాలుగా చిరకాలం చెప్పుకుంటారు. మహా గౌరవముతో బ్రతికిన నీ వంటి వానికి అపకీర్తి చావుకంటే భయంకరమైనది.

శ్లో॥ భయా ద్రణా దుపరతం మన్యన్తే త్వాం మహారథాః ।
యేషాంచత్వం బహుమతోభూత్వాయాస్యసిలాఘవమ్॥ 35

ఎందరో మహారథులూ, మహాత్ముల దృష్టిలో నీవు ఘనుడవు. అట్టి వారంతా నిన్ను చులకనగా చూస్తారు. మాట్లాడతారు. భయంతో యుద్ధరంగము నుంచి పారిపోయినట్టు తలుస్తారు.

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూ న్వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥ 36

నీ శత్రువులు నీ యొక్క పరాక్రమము గూర్చి అనరాని మాటలను అంటారు. దుర్భాషలాడతారు. అంతకు మించిన దుఃఖమేముంది.

*అవ. కురుక్షేత్ర ధర్మ యుద్ధం వల్ల ఇహలోకంలోనూ, పరలోకంలోనూ కలిగే సుఖముల గూర్చి చెప్పట.*

శ్లో॥ హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావా భోక్ష్యసే మహీమ్ ।
తస్మా దుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ 37

 ఓ అర్జునా... యుద్ధరంగమున మరణించినచో నీవు వీర స్వర్గము పొందుతావు. అదే విజయాన్ని సాధిస్తే ఈ భూమండల రాజ్యాన్ని సకల వైభవోపేతంగా అనుభవించగలవు. రెండూ నీకు మేలే. కాన కృతనిశ్చయుడవై యుద్ధానికి సంసిద్ధుడవవ్వు.

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥ 38

 సుఖదుఃఖాలు, లాభనష్టములు, జయము, అపజయము లను సమానంగా భావించి రణమునకు సిద్ధుడవు కమ్ము. నీకు ఏ పాపములు అంటవు.

అవ. ఇక ఆపై కర్మయోగములు గూర్చి శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ ఏషా తేఽభిహితాసాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాంశృణు ।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి ॥ 39

 ఓ పార్థా! నీకు ఆత్మతత్త్వమును జ్ఞానయోగ దృష్టితో తెలిపాను. దాన్నే నీకు కర్మ యోగ సంబంధమైన ధృక్పథముతో వివరిస్తాను. దాన్ని గ్రహించిన నీవు కర్మబంధము నుండి తేలికగా విముక్తుడవు అవుతావు. కాన శ్రద్ధతో వినుము.

శ్లో॥ నే హాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్ ॥40

 నిష్కామ కర్మ యోగము చేయుట వ్యర్థము కాదు. దీనికి విపరీతమైన ఫలములుండవు. పైగా జన్మ మృత్యు రూప భీతుల నుంచీ, భయముల నుంచి నిన్ను సదా కాపాడును.



శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునన్దన ।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ॥ 41

 ఓ అర్జునా! కర్మయోగం నిశ్చయంతో కూడిన బుద్ధి ఒకటియే ఉంటుంది. కాని భోగములు కోరువారూ, బుద్ధి చంచల ములు గలవారూ, కోరికల వెంట సదా పరుగులు తీస్తూ శాంతిలేక తల్లడిల్లిపోవును.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః ।
వేదవాదరతాః పార్థ నాన్య దస్తీతి వాదినః ॥ 42

కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥ 43

భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్ ।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ॥ 44

 ఓ పార్థా! వేదములలోని ఫలశ్రుతి చదివిన వారు అందు చెప్పిన స్వర్గసుఖముల కంటే అధికమైన సుఖఫలము లేదని చెబుతారు. అదే పరమప్రాప్తమని భావిస్తారు. అట్టి వారు వాటి అంతరార్థము మాత్రం అవగతం చేసుకోరు. కోరికలతో నిండిన మనస్సు గలవారూ, స్వర్గమే అన్నింటికంటే ముఖ్యమనుకునే వారూ ఖచ్చితంగా అవివేకులే.

భోగములు కొరకూ, ఐశ్వర్యముల కొరకూ అనేక కార్యకలా పములతో ఉన్నది ఫలప్రదము కాదు. కేవలం వినుటకు రమ్యంగా, మధురంగా ఉంటుంది. భోగైశ్వర్యముల యందు ఆశలు గలవారికి ఏకాగ్రబుద్ధి దైవధ్యానము నందు నిలవదు.

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భ వార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥ 45

అర్జునా... వేదములు సంసారమును గూర్చి, సమస్త భోగములగూర్చి వాటిని ఎలా పొందాలో, సాధనలు చెయ్యాలో వివరిస్తున్నాయి.

అట్టి భోగముల గూర్చీ, సాధనల గూర్చీ ఆలోచనలు విరమించు. సుఖదుఃఖములకు అతీతుడవు కమ్ము. నిండు మనస్సుతో పరమాత్మ యందు నీ మనస్సు లగ్నం చేయి. నీ క్షేమ సమాచారముల గూర్చి ఆలోచించవద్దు. ఆత్మజ్ఞానివి కమ్ము.

**శ్లో॥ యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే ।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥ 46**

బావి, చెరువు వంటివి స్నానపానాదులకై ఎంతటి ప్రయోజనం ఇచ్చునో, అంతటి ప్రయోజనం పరమాత్మప్రాప్తి పొందిన బ్రహ్మజ్ఞానికి మహాజలాశయం వంటి వేదముల వల్ల కలుగును.

*అవ. కర్మయోగ పద్ధతి అర్జునుడికి తెల్పుట.*

**శ్లో॥ కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన ।**
**మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సఙ్గో స్త్వకర్మణి ॥ 47**

ఓ అర్జునా! నీకు కర్మను ఆచరించుటకే అధికారము కలదు. ఎప్పటికీ ఆ కర్మల ఫలాలను ఆశించుటకు నీకు అధికారం లేదు. కర్మలు మానుట నీవు చేయరాదు. కాన నీవు ఫలాపేక్షరహితుడవై కర్తవ్య బుద్ధితో కర్మలను చేయుము.

**శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనఞ్జయ ।**
**సిద్ధ్యసిద్ధ్యో స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥ 48**

ఓ ధనుంజయా! యోగమునందు ఆసక్తిని వదలి సిద్ధి, అసిద్ధుల రెంటి యెడల సమభావము కలిగి కర్తవ్యములను ఆచరించు. అట్టి సమత్వభావమే యోగమనబడును.



**శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనఞ్జయ ।**
**బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥ 49**

ఓ అర్జునా! యోగబుద్ధితో ఉన్న నిష్కామ కర్మల కన్నా ఫలాపేక్షతో కూడిన కామ్యకర్మము తక్కువైనది. కాన కర్మాచరణమును యోగబుద్ధితో ఆశ్రయించు. ఏలనన ఫలాసక్తితో కర్మలు చేయువారు మహాదీనులు. అల్పులు.

*అవ. నిష్కామ కర్మముల గూర్చి చెప్పుట.*

**శ్లో॥ బుద్ధియుక్తో జహా తీహ ఉభే సుకృతదుష్కృతే ।**
**తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥ 50**

సమత్వబుద్ధి కలవాడయిన నిష్కామ కర్మయోగి పుణ్యపాపాలను ఈ లోకమునందే వదిలేస్తాడు. వానికి కర్మ ఫలములు అంటవు. కాన నీవు సమత్వ బుద్ధిని ఆశ్రయించుము. కర్మబంధముల నుంచి విముక్తుడగుటకు ఇదియే సులభ మార్గము.

**శ్లో॥ కర్మజం బుద్ధియుక్తాః హి ఫలం త్యక్త్వా మనీషిణః ।**
**జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్ ॥ 51**

ఏలననగా సమత్వము బుద్ధి గల జ్ఞానులు కర్మ ఫలములను త్యజించి జనన మరణముల నుండి విముక్తులవుతారు. అట్టివారు దుఃఖరహితమయ్యే మోక్షాన్ని పొందుతున్నారు.

*అవ. మోక్షము ఎలా కలుగుతుందో భగవానుడు చెప్పుట.*

**శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥ 52**

అర్జునా! మోహమనే మహా ఊబి నుంచి నీవు బైట పడినప్పుడే, నీ అజ్ఞానము తొలిగినప్పుడే నీవు వినిన, వినబోవు ఇహలోక

సంబంధితమైన సకల భోగములు గూర్చి వైరాగ్యమును, విరక్తిని పొందగలవు.

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి ॥ 53

అనేక విధములైన మాటలు వినుట వల్ల కలత చెందుట, అయోమయం చెందుట వంటి వాటికి చలింపక బుద్ధి పరమాత్మ యందు నిశ్చలంగా, స్థిరముగా ఉంటుందో అప్పుడే నీవు యోగాన్ని పొందగలవు. అప్పుడే నీవు ఆత్మసాక్షాత్కారము పొందగలవు.

*అవ. స్థిత ప్రజ్ఞుని లక్షణముల గూర్చి పరమాత్మను అర్జునుడు అడుగుట.*

అర్జున ఉవాచ.

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్ర జేత కిమ్ ॥ 54

అర్జునుడు అడిగాడు. ఓ కేశవా! సమాధిస్థితియందు స్థితప్రజ్ఞుడవైన వాని లక్షణములేమిటి? అతడు ఎటుల మాట్లాడతాడు? ఏ రీతిగా ప్రవర్తిస్తాడు? మరెలా సంచరిస్తాడు?

*అవ. అర్జునుడి సందేహాలను తీరుస్తూ పరమాత్మ స్థిత ప్రజ్ఞుడి లక్షణాలను వివరించుట.*

శ్రీ భగవాన్ ఉవాచ.

శ్లో॥ ప్రజహాతి యదాకామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్త దోచ్యతే ॥ 55

ఓ అర్జునా! మనస్సులోని కోరికలన్నీ పూర్తిగా తొలగించు కొని ఆత్మయందే ఆత్మ ద్వారా సంతుష్టుడవుతాడో అనగా పరమాత్మ



సంయోగం వల్ల ఆత్మానందము పొందిన వానిని స్థితప్రజ్ఞుడని అంటారు.

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే ॥ 56

దుఃఖములకు నీరుగారి పోనివాడూ, క్రుంగిపోని వాడూ, సుఖములు రాగానే పొంగిపోని వాడూ, భయ క్రోధములు వదలిన వాడూ స్థితప్రజ్ఞుడు.

శ్లో॥ య స్సర్వ త్రానభిస్నేహః తత్త త్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 57

ఎవరు దేహమునందూ, బంధువులయందూ, భోగముల యందు అనుకూలంగా ఉన్నప్పుడు హర్షముగానూ, ప్రతికూల పరిస్థితుల్లో ద్వేషము మొదలగు వికారములకు లోనవ్వకుండా ఉండిన అట్టివాడు జ్ఞానవంతుడు... స్థితప్రజ్ఞుడు.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽ ఙ్గానీవ సర్వశః ।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 58

తాబేలు తన అవయవములన్నీ లోనికి ముడుచుకున్నట్టు అదే విధంగా యోగి ఇంద్రియములను ఇంద్రియార్థముల నుంచి సర్వత్ర వెనకకు మరల్చుచున్నాడో, అట్టి వాని జ్ఞానము స్థిరమైనది. అట్టివాని బుద్ధి స్థిరముగా నున్నట్టు తెలియును.

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః ।
రసవర్జం రసో ప్యస్య పరం దృష్ట్వానివర్తతే ॥ 59

ఇంద్రియములకు ఆహారములగు శబ్దాది విషయాలను స్వీకరించనప్పటికీ ఆ విషయములు మరులుచున్నవే గానీ వాటి వాసన

పోవుటలేదు. పరమాత్మను దర్శించిన స్థితప్రజ్ఞునకు వాసన కూడా విషయములతో పాటే నశించును.

*అవ. పరమాత్మ దర్శనము అందరికీ ఎందుకు లభించదో శ్రీభగవానుడు చెప్పట.*

**శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః ।**
**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥ 60**

ఇంద్రియములు మహా శక్తివంతమైనవి. ఆత్మసాక్షాత్కారమునకు ప్రయత్నిస్తున్న విద్వాంసుణ్ణి కూడా ఇంద్రియార్థముల వైపు బలవంతంగా బలంగా లాక్కెళ్ళటానికి ప్రయత్నం చేయుచునే ఉండును.

**శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి య స్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 61**

అట్టి బలవత్తరమైన ఇంద్రియములను బాగుగా వశ పరుచుకొని సాధకుడు సమాధి కలవాడై ఆత్మ యందే మనస్సు నిలిపి ఉంచవలెను. ఏలననగా ఇంద్రియములను ఎవరు స్వాధీన పరుచుకుందురో అట్టి వాని జ్ఞానమే స్థిరము. వాడే స్థితప్రజ్ఞుడు.

*అవ. కోప ఆవేశాల వల్ల జరిగే అనర్థములు చెప్పట.*

**శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తే షూపజాయతే ।**
**సఙ్గా త్సఞ్జాయతేకామఃకామాత్ క్రోధోఽభిజాయతే ॥ 62**

**క్రోధా ద్భవతి సమ్మోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః ।**
**స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥ 63**

అట్టి విషయచింతన చేయు మానవునకు వాటి యందే ఆసక్తి కలుగును. దానితో వాటిని పొందేందుకు భోగేచ్ఛ కలుగును. ఆ భోగేచ్ఛ తీరనప్పుడు క్రోథము కలుగును. ఆ క్రోధాన్నించి వ్యామోహము కలుగుతుంది. దానితో బుద్ధి నాశనమయ్యి పురుషార్థ సాధనకు అయోగ్యుడై పూర్తిగా చెడిపోవును.



*అవ. ఇంద్రియాలను వశము చేసుకోవటం వల్ల ఎంతటి పుణ్యం కలుగుతుందో వివరించుట.*

**శ్లో॥ రాగ ద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియై శ్చరన్ ।**
**ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥ 64**

కానీ ఆధీనమైన మనస్సు కలవాడు రాగ ద్వేషములు పట్టనివాడై, ఇంద్రియముల ద్వారా శరీరమునకు కావాల్సిన అన్నపానాదులను స్వీకరిస్తూ మనఃశాంతిని పొందుతున్నాడు.

**శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హాని ర స్యోపజాయతే ।**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠ తే ॥ 65**

అట్టి మనశ్శాంతి కలిగిన వానికి దుఃఖము నశించును. ప్రసన్న మనస్సు కలవాడై నిర్మల మనస్సుతో బుద్ధి అంతయూ పరమాత్మ యందు స్థిరమగుచున్నది.

*అవ. ఇంద్రియాలను వాటికి రుచించిన వైపు వెళితే ఎలాంటి క్లేశములు కలుగుతాయో చెప్పట.*

**శ్లో॥ నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా ।**
**న చాభావయత శ్శాన్తి రశాన్తస్య కుత స్సుఖమ్ ॥ 66**

మనోనిగ్రహం లేనివానికి నిశ్చయాత్మక బుద్ధి ఉండదు. అట్టి వానికి ఆత్మజ్ఞానము కలుగదు. అట్టి ఆత్మ జ్ఞానము లేనివానికి మనస్సు ప్రశాంతంగా ఉండదు. మనశ్శాంతే లేనప్పుడు సుఖము ఎటుల లభించును.

శ్లో॥ ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽ నువిధీయతే।
త దస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మి వామ్భసి ॥ 67

ఇంద్రియార్థములందు సంచరించే ఇంద్రియములలో మనస్సు ఏ ఒక్క ఇంద్రియముతో అనుసరించినా, నీటిపై తేలుతున్న నావను ప్రతికూల గాలి నెట్టి వేసినట్టు ఆ ఒక్క ఇంద్రియమే మనుజుని మనో నిగ్రహాన్ని హరించి వేస్తుంది.

శ్లో॥ తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ 68

కాన అర్జునా! ఎవరు తన మనస్సును ఇంద్రియములగు విషయాలపైకి పోనివ్వక మనస్సును సర్వ సమయాల్లోనూ, సర్వ విధాలు గానూ అరికట్టగలడో అట్టి వానికి జ్ఞానము స్థిరమై ఉండును.

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥ 69

పరమానంద ప్రాప్తి యందు స్థితప్రజ్ఞుడైన వాడు మేలుకొని ఉంటాడు. అది సామాన్యులకు రాత్రితో సమానం. ఇక ఐహిక సుఖములకై సామాన్యులు ప్రాకులాడూతూ మేలుకొని వుండును. అట్టి సమయము జితేంద్రియుడైన యోగికి రాత్రితో సమానం.

*అవ. పరమశాంతిని పొందగల అర్హులెవరో*
*శ్రీకృష్ణ పరమాత్మ చెప్పుట.*

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్।
తద్వ త్కామా యం ప్రవిశన్తి సర్వే
స శాన్తి మాప్నోతి న కామకామీ ॥ 70



సమస్త దిశల నుంచి నదిలోకి వచ్చిన నీరు నిశ్చలంగా ప్రవహిస్తూ సముద్రంలో లీనమయినట్టు సమస్త భోగములు స్థితప్రజ్ఞుని యందు ఎట్టి మనో వికారములు కలిగించక లీనమగును. దూరమగును. అట్లాంటి వాడే పరమ శాంతిని పొందుతాడు. భోగములపై ఆశ ఉన్నవాడు శాంతిని ఎన్నటికీ పొందజాలడు.

శ్లో॥ విహాయకామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్స్పృహః ।
నిర్మమో నిరహఙ్కార స్స శాన్తి మధిగచ్ఛతి ॥ 71

అన్ని కోరికలనూ త్యజించి మమతానురాగాలు, అహంకారాలు లేకుండా సంచరిస్తాడో అట్టివాడే శాంతిని పొందుతాడు.

*అవ. అంత గొప్పస్థితి చివరివరకూ ఉన్నప్పడే పరమాత్మను దర్శించగలుగుతారనీ, మోక్షాన్ని పొందుతారనీ వివరించుట.*

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాఽ స్యా మన్తకాలేఽ పి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥ 72

అర్జునా! ఆధ్యాత్మిక స్థితియైన ఈ బ్రహ్మప్రాప్తి పొందినవాడు ఎన్నటికీ మోహితుడు కాలేడు. అంత్యకాలమునందు కూడా ఈ ఆధ్యాత్మిక స్థితియందు స్థిరముగానున్నవాడు బ్రహ్మానందరూప మోక్షమును పొందుతున్నాడు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే సాఙ్ఖ్యయోగో నామ**
**ద్వితీయోఽధ్యాయః**

## మొండివ్యాధులు తగ్గుముఖము పట్టుట కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥

*2వ అధ్యాయము-2వ శ్లోకము, చేయాల్సిన రోజులు-40 జపసంఖ్య-108*

# కర్మ యోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

★ ఈ కర్మయోగంలో 1వ శ్లోకం నుంచి 8 వరకూ జ్ఞాన యోగ నిష్కామ కర్మలను అనుసరించటం ఉత్తమమని తెలియ చెప్పుట.

★ 9వ శ్లోకం నుంచి 16 వరకు యజ్ఞాది కర్మల ఆవశ్య కత.

★ 17వ శ్లోకం నుంచి 24 వరకు భగవంతుడు కూడా లోక సంగ్రహార్థమై కర్మలను ఆచరిస్తాడని చెప్పుట.

★ 25వ శ్లోకం నుంచి 35వ శ్లోకం వరకూ రాగ ద్వేష రహితంగా కర్మలను ఆచరించాలని చెప్పుట.



# కర్మ యోగః

**శ్లో॥ జ్యాయసీ చే త్కర్మణస్తే మతా బుద్ధి ర్జనార్దన ।**
**తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ॥ 1**

 ఓ జనార్ధనా! కర్మకంటే జ్ఞానము శ్రేష్ఠమైనచో మహా భయంకరమైన ఈ యుద్ధమును నన్నేల చెయ్యమంటున్నావు.

**శ్లో॥ వ్యామిశ్రే ణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।**
**తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽ హ మాప్నుయామ్ ॥ 2**

 శ్రీకృష్ణా! మిశ్రమమైన నీ మాటలతో నా బుద్ధి అనేక భ్రమలకు లోనవుతోంది. నా కలవరపాటును తొలగించి శ్రేయస్కర మైన మార్గమును నిశ్చయించి నాకు తెలుపుము.

అవ. మోక్షమునకు దారుల గూర్చి పరమాత్మ చెప్పట.

శ్రీ భగవాన్ ఉవాచ.

**శ్లో॥ లోకేఽ స్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తామయాఽ నఘ ।**
**జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥ 3**

శ్రీ భగవానుడు తెలిపెను. పాపములేని అర్జునా! ఈ లోకమున రెండు నిష్ఠలు కలవు. ఒకటి జ్ఞానయోగము. రెండవది (యోగులకు) కర్మ యోగము. అందు తత్త్వపరులకు జ్ఞానయోగము ద్వారా, యోగులకు కర్మయోగము ద్వారా నిష్ఠ కలుగుతుంది.

అవ. కర్మలను వదలి వేయుట వల్ల మోక్షం రాదని చెప్పట.

శ్లో॥ నకర్మణా మనారమ్భా న్నైష్కర్మ్యం పురుషోఽ శ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ 4

మనుజుడు కర్మలను ఆచరించకపోవుట వల్ల ఆత్మ స్వరూప స్థితి అనగా యోగనిష్ఠా సిద్ధి లభింపదు. అలాగే కర్మలను వదిలేసినంత మాత్రమున కూడా మోక్ష సిద్ధిని పొందజాలడు.

అవ. కర్మను వదిలెయ్యటం అసాధ్యమని చెప్పట.

శ్లో॥ న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః ॥ 5

ఈ ప్రపంచమున ఎవ్వరూ కర్మలను ఆచరింపక ఉండ లేరు. గాలి పీల్చుట, తినుట, నడుచుట అన్నియు కర్మలే. ప్రకృతి జనిత గుణములకు లోబడి కర్మలను ప్రతి ఒక్కరు ఆచరింపవలసి ఉండును.

శ్లో॥ కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే ॥ 6

ఎవరైతే బలవంతంగా ఇంద్రియ జ్ఞానేంద్రియములను నొక్కి పట్టి శబ్ద స్పర్శ రూప రసములను మనస్సులో స్మరించుకొను చున్నాడో అట్టివాడు మూఢుడు. డంబాచారము అనగా ఇంద్రియాలని అణిచి, మనస్సుని ముల్లోకములలో సంచరింపచేసేలా ఉండేవాడు అట్టివాడు కపటి.



శ్లో॥ యస్త్విన్ద్రియాణి మనసా నియ మ్యారభతేఽ ర్జున ।
కర్మేన్ద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే ॥ 7

కాన అర్జునా! మనస్సుతో ఇంద్రియములను వశపరుచు కొని, వానిచే కర్మ యోగము ఆచరించునో అట్టివాడు ఉత్తమమైన పురుష శ్రేష్ఠుడు.

అవ. శాస్త్రం చెప్పిన రీతిలో కర్మలను ఆచరించాలని భగవానుడు చెప్పట.

శ్లో॥ నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః ।
శరీరయాత్రాఽ పి చ తేన ప్రసిద్ధ్యే దకర్మణః ॥ 8

కాన అర్జునా... నీవు శాస్త్రములు చెప్పిన, నిర్ణయించిన కర్మలను చేయుము. కర్మ చేయకుండా ఉండటం కంటే చేయటమే ఉత్తమం. ఎప్పుడైతే కర్మలను చేయలేదో నీ దేహయాత్ర కూడా సాధ్యం కాదు.

అవ. కర్మలను ఎలా వదిలెయ్యాలో శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ యజ్ఞార్థా త్కర్మణోఽ న్యత్ర లోకోఽ యం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గ స్సమాచార ॥ 9

యజ్ఞార్థము చేయు ఫలకర్మలనే గాకుండా ఇతరములైనవి ఫలాపేక్షతో చేసిన కర్మల వల్ల మనుజులు కర్మబంధములో చిక్కుకు పోతారు. కాన నీవు యజ్ఞార్థము కర్తవ్య కర్మలను ఫలాసక్తి లేక చేయుము.

అవ. యజ్ఞాల శక్తి గూర్చి అర్జునుడికి చెప్పట.

శ్లో॥ సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽ స్త్విష్టకామధుక్ ॥ 10

పూర్వము బ్రహ్మదేవుడు కల్పాదియందు యజ్ఞసహితముగా ప్రజలను సృష్టించాడు. వారితో యజ్ఞములతోనే మీరు వృద్ధి చెందుతారని చెప్పాడు. ఆ యజ్ఞములు కామధేనువుల వలే కోరిన కోర్కెలు తీరుస్తాయి అని కూడా సృష్టికర్త పలికెను.

శ్లో॥ దేవా న్భావయతానేన తే దేవా భావయన్తు వః ।
పరస్పరం భావయన్తః శ్రేయః పర మవాప్స్యథ ॥ 11

అట్టి యజ్ఞములచే దేవతలు సంతృప్తి చెందుతారు. దానితో వర్షాలు కురిపించి మిమ్ము తృప్తి చెందేలా చేస్తారు. అలా ఇరువురూ తృప్తి పొందుతూ పరమశ్రేయస్సును పొందుతున్నారు.

*అవ. పరమాత్మకు నివేదింపక తాను స్వీకరించిన వాడు తస్కరుడవుతాడని చెప్పట.*

శ్లో॥ ఇష్టాన్భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥ 12

మనుజులు చేసిన యజ్ఞముల ద్వారా దేవతలు ఎంతో సంతోషించి అనేక భోగములు ఇస్తారు. అలా దేవతలు ఇచ్చిన భోగములు ఆ భోగ వస్తువులను తిరిగి వారికి సమర్పించక అనుభవించుట తగదు. అట్లు చేసినవాడు దొంగయే అగును.

*అవ. భగవంతునికి అర్పించగా మిగిలిన ప్రసాదాన్ని స్వీకరించటం ద్వారా కలిగే ఫలము.*

శ్లో॥ యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ।
భుఞ్జతే తే త్వఘం పాపా యే పచ న్త్యాత్మకారణాత్ ॥ 13

యజ్ఞమునందు అనగా భగవంతునకు అర్పించగా మిగిలినది తిన్న వారు సమస్త పాపాలను పోగొట్టుకుందురు. అలా కాక తమ కోసం తాము వండుకున్న ఆహారాన్ని భుజించిన వారు పాపములు భుజించిన వారే అగుదురు.



*అవ. యజ్ఞ పవిత్రత గూర్చి చెప్పట.*

శ్లో॥ అన్నా ద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః ।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః ॥ 14

కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్ ।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥ 15

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః ।
అఘాయు రిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ 16

సకల ప్రాణులు అన్నము నుంచి జన్మిస్తాయి. అన్నము మేఘముల వల్ల ఏర్పడుతుంది. అట్టి మేఘములు యజ్ఞము వల్ల కలుగును. అట్టి యజ్ఞములు సత్కర్మ వల్లనే కలుగుతుంది. సత్కర్మ వేదముల వల్ల సాధ్యపడును. అట్టి వేదములు పరమాత్మ నుంచి ఉద్భవించినవి. కాన పరమాత్మ సర్వదా యజ్ఞముయందే ప్రతిష్ఠితుడై ఉన్నాడు.

ఓ అర్జునా! ~~ఈ~~ ప్రకారంగా ధర్మచక్రము నడుస్తోంది. దాన్ని ఎవ్వరనుసరించరో, ఎవరు చేయరో అట్టివాడు పాపజీవితమును గడుపువాడు. ఇంద్రియలోలుడు.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥ 17

ఎవరు ఆత్మయందే రమిస్తూ దానియందే సంతృప్తిని పొందుతూ ఆత్మయందే సంతోషపడుతున్నాడో అట్టివాడు పూర్ణకాముడు. ఆ ఆత్మజ్ఞానికి ఎట్టి కర్తవ్యము ఉండదు.

శ్లో॥ నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః ॥ 18

అట్టి ఫలాపేక్ష లేని మహాత్ముడు ఈ ప్రపంచమున కర్మలు చేయుటా, చేయకుండా ఉండటమూ వంటి వాటివల్ల ఎలాంటి ప్రయోజనములూ, దోషములూ ఉండవు. అట్టి వానికి సృష్టిలోని ఎటువంటి ప్రాణులను ఎలాంటి ప్రయోజనము కొరకూ ఆశ్రయించ పనిలేదు.

*అవ. ఫలం ఆశించక కర్మలను చేయాలని అర్జునుడికి చెప్పట.*

**శ్లో॥ తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచార ।**
**అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః ॥ 19**

కాన నీవు వాని వలే నిరంతరము చేయవల్సిన కర్మను ఫలాపేక్ష లేకుండా చేయుము. అట్టి కర్మలను ఆచరించువాడు మాత్రమే మోక్షమును పొందుతున్నాడు.

*అవ. మహాత్ములైన వారు మోక్షాన్ని పొందిన క్రమం చెప్పట.*

**శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।**
**లోకసఙ్గ్రహ మే వాపి సంపశ్య న్కర్తు మర్హసి ॥ 20**

జనకుడు వంటి వారు నిష్కామ కర్మాచరణము ద్వారానే మోక్షాన్ని పొందారు. కాన జనులకు హితార్థమై సన్మార్గమున నడిచే ఉద్దేశ్యముతో కూడా నీవు కర్మలను చేయవలసి ఉంది.

*అవ. కర్మలకి అతీతుడిని కానని చెప్పట.*

**శ్లో॥ య ద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే ॥ 21**

గొప్పవాడు కర్మలను చేయుట ద్వారా సామాన్యులు ఆ గొప్ప కర్మలను చేయుదురు. శ్రేష్ఠమైన వారు ఆచరించినదే ప్రమాణంగా తీసుకొని తక్కిన వారు ఆచరించుదురు.



**శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కిఞ్చన ।**
**నా నవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ 22**

అర్జునా... నాకీ ముల్లోకాల్లోనూ చేయాల్సిన కార్యము లేదు. అట్లే పొందలేనిది, పొందదగినది కూడా లేదు. అయినా నేను కూడా కర్మలనే ఆచరిస్తున్నాను.

*అవ. పరమాత్మ అయిన నేను కూడా కర్మలకి లోబడియున్నానని చెప్పట.*

**శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః ।**
**మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 23**

ఓ పార్థా! ఎప్పుడైతే నేను సావధానుడనై కర్మలను ఆచరింపకున్నానో ఈ లోకములకు మహా ఆపద సంభవించును. దేనికంటే అంతా నా వలే అనగా కర్మములు చేయక నా మార్గమునే అనుసరిస్తారు. అందుకనే నేను సహితము కర్మబద్ధుడినే.

**శ్లో॥ ఉత్సీ దేయు రిమే లోకా న కుర్యాం కర్మచే దహమ్ ।**
**సఙ్కర స్యచ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥ 24**

ఒకవేళ నేను కర్మలను ఆచరింపకపోతే ఈ లోకాలన్నీ క్షీణించి నశించిపోతాయి. మహా అల్లకల్లోలములు జరగగలవు. అలా జరిగిన నష్టమునకు నేను బాధ్యుడగుదును.

*అవ. కర్మలని ఎలా చేయాలో చెప్పట.*

**శ్లో॥ సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత ।**
**కుర్యా ద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షుర్లోకసఙ్గ్రహమ్॥25**

ఓ భారతా! అర్జునా! జ్ఞానులూ, అజ్ఞానులూ ఇద్దరూ కర్మలను చేస్తున్నారు. అజ్ఞానులు ఫలాపేక్షతో చేస్తున్నారు. జ్ఞానులు

ఫలాపేక్షలలో చిక్కుకోకుండా లోక కళ్యాణము కోసం కర్మలను చేయవలసి ఉంటుంది.

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసఙ్గినాం ।
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్ ॥ 26

 జ్ఞాని అయినవాడు కర్మ ఫలాలను ఆశించే వారిని అనగా అట్టి అజ్ఞానులను కదిలింప చేయరాదు. విద్వాంసుడు తన కౌశలముతో శాస్త్ర సమ్మతమైన వాటిని చక్కగా చేయుచూ, తన ఆచరణను చూసి వారూ సర్వ కర్మలు ఆచరించేలా చేయవలెను.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।
అహఙ్కా రవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే ॥ 27

 నిజానికి కర్మలన్నీ ప్రకృతి వల్ల పుట్టిన సత్త్వ రజ స్తమో గుణముల చేత జరుగుతుంటాయి. అహంకారముతోనూ, జ్ఞానం లేనితనంతోనూ అన్నీ నేనే, అన్నింటికి నేనే కర్తనని తలుస్తున్నాడు.

శ్లో॥ తత్త్వవి త్తు మహాబాహో గుణకర్మవిభాగయోః ।
గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే ॥ 28

 కాన ఓ మహా బాహువులు గల ఓ అర్జునా! గుణ విభాగ తత్త్వమునూ, కర్మ విభాగముల తత్త్వములనూ గ్రహించిన వాడు జ్ఞానయోగి. గుణములే గుణముల యందు ప్రవర్తిల్లుచున్నవని తెలుసుకొని కర్మల యందు అభిమానము లేకుండా ఉండుము.

శ్లో॥ ప్రకృతే ర్గుణసమ్మూఢా స్సజ్జన్తే గుణకర్మసు ।
తానకృత్స్నవిదో మన్దాన్ కృత్స్న విన్నవిచాలయేత్ ॥ 29

 ప్రకృతి గుణములచే పూర్తిగా మోహమును పొందిన మనుజులు ఆ గుణాల యందూ, అలాంటి కర్మల యందూ ఎక్కువ



ఆసక్తిని కలిగి ఉంటారు. అట్టి అల్ప జ్ఞానులనూ, మందమతులనూ జ్ఞాని అన్నవాడు కర్మలను మానేలా చేయకూడదు. (నిష్కామాచరణ వల్ల వారు ప్రేరితులయ్యేలా వారు సన్మార్గములో పడేలా ప్రవర్తించవలెను.)

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్య స్యాధ్యాత్మచేతసా ।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥ 30

 అంతర్యామినీ, సర్వాంతర్యామినీ అయిన నా యందే నీ చిత్తమును ఉంచు. సకల కర్మలనీ నాకే అర్పించి మమతానురాగ బంధములను వీడి యుద్ధమును చేయుము.

*అవ. కర్మబంధముల నుంచి ఎలా బైటపడాలో శ్రీకృష్ణుడు చెప్పట.*

శ్లో॥ యే మే మత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥ 31

 మనుజులు శ్రద్ధతో అసూయాదులు లేని వారై ఈ నిష్కామకర్మాచరణమును అనుసరించిన వారు సకల కర్మబంధముల నుంచి విముక్తులవుతున్నారు.

శ్లో॥ యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్ ।
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః ॥ 32

 ఎవరైతే ఆధ్యాత్మిక మార్గమునూ, నిష్కామ కర్మ పద్ధతిని కాదని ఆచరింపరో అలాంటి వారు బుద్ధిహీనులై జ్ఞానములేని వారై చెడిపోవుచున్నారు.

శ్లో॥ సదృశం చేష్ట తే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి ।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥ 33

సకల ప్రాణులు ప్రకృతికి లోనయి కర్మలు చేయుచున్నారు. పూర్వ జన్మ సంస్కారమునకు తగ్గ గుణములతో ప్రవర్తిస్తున్నాడు. ఎవరైనా కర్మలను ఎటుల త్యజించగలరు.

*అవ. మనుష్యుని యొక్క శత్రువుల గూర్చి భగవానుడు వివరించుట.*

**శ్లో॥ ఇన్ద్రియ స్యేన్ద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ ॥ 34**

సర్వేంద్రియ విషయములతో రాగద్వేషములు దాగి ఉన్నాయి. ఆ రెంటికి మనుజుడు వశం కాకూడదు. అవే మనుజునికి మహా శత్రువులు.

**శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మా త్స్వనుష్ఠి తాత్ ।**
**స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥ 35**

చక్కగా ఆచరించబడుతున్న పరధర్మము కంటే గుణము లేనిదైననూ తన ధర్మమే అత్యుత్తమమైనది. శ్రేష్ఠమైనది. స్వధర్మములో మరణించినా ఉత్తమ లోకమే వరించును. పరధర్మము భయావహము.

*అవ. పాపకార్యాలూ, నీచకార్యాలూ, మహా దుఃఖదాయకమని తెలిసినా మనుజుడు వాటివైపు ఎందుకెళ్తున్నాడన్న దాని గూర్చి అర్జునుడు ప్రశ్నించుట.*

అర్జున ఉవాచ.

**శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుష ।**
**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥ 36**

అర్జునుడు అడిగాడు. ఓ శ్రీకృష్ణా! మనుజుడు పాపములు చేయ సంకల్పము లేనప్పటికీ వేటి ద్వారా ప్రేరేరింపబడి బలవంతంగా పాపము చేస్తున్నాడు.



*అవ. పార్థుడి ప్రశ్నకి పరమాత్మ చెప్పట.*

శ్రీ భగవాను ఉవాచ.

**శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహవైరిణమ్ ॥ 37**

భగవానుడు చెప్పెను. ఓ అర్జునా... రజోగుణము నుంచి వచ్చినదే కామము. ఆ కామము క్రోధము పుట్టుకకు కారణము. అట్టి కామము ఎంత అనుభవించినా చల్లారదు. ఆ కామమే సకల పాప కర్మాచరణములకు ప్రేరకము. కాన అర్జునా! కామమే మనుజునికి పరమ శత్రువు.

*అవ. కామము యొక్క మహారూపమును చెప్పట.*

**శ్లో॥ ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽ దర్శో మలేనచ ।**
**య థోల్బే నావృతో గర్భ స్తథా తే నేద మావృతమ్ ॥ 38**

పొగచేత అగ్ని, ధూళి చేత అద్దమూ, మావిచే శిశువూ కప్పివేసినట్టు ఆత్మజ్ఞానము కామముతో కప్పబడి యుండును.

**శ్లో॥ ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూ రే ణానలేన చ ॥ 39**

ఓ కౌంతేయా... అట్టి కామం మహాగ్నితో సమానం. అది ఎప్పటికీ చల్లారదు. జ్ఞానులకు అది శత్రువు. ఆ కామము మనుజుని జ్ఞానమును కప్పివేయు నిరంతర శత్రువు.

*అవ. మహాభయంకర శత్రువైన కామాన్ని ఎలా జయించాలో భగవానుడు చెప్పట.*

**శ్లో॥ ఇన్ద్రియాణి మనో బుద్ధి ర స్యాధిష్ఠాన ముచ్యతే ।**
**ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ ॥40**

అట్టి కామమునకు ఇంద్రియములు, మనస్సు, బుద్ధి ఆశ్రయములు.

ఆ ఇంద్రియముల చేత కామము ఆత్మజ్ఞానాన్ని కప్పివేసి మనుజుని మోహంలోకి నెట్టుచున్నది.

*అవ. భయంకరమైన కామాన్ని ఎలా త్యజించాలో శ్రీకృష్ణుడు చెప్పట.*

శ్లో॥ తస్మా త్త్వ మిన్ద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥ 41

భరతవంశ శ్రేష్ఠుడైన అర్జునా! నీవు తొలుత ఇంద్రియములను నిగ్రహించుకొనుము. జ్ఞానమునూ, అనుభవజ్ఞానములనూ నాశనము చేయునదీ పాప స్వరూపమయినదీ అయిన కామమును సంపూర్ణంగా సర్వశక్తులను వొడ్డి విడిచిపెట్టు.

శ్లో॥ ఇన్ద్రియాణి పరా ణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః ।
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః ॥42

దేహాదులకన్నా ఇంద్రియములు చాలా గొప్పవి. ఇంద్రియముల కంటే మనస్సు ఇంకా గొప్పది. దాని కన్నా బుద్ధి మరింత గొప్పది. ఆ బుద్ధి కంటే శ్రేష్ఠమైనది ఆత్మ.

*అవ. ఆత్మ ద్వారా కామాన్ని పారద్రోలమని చెప్పట.*

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్త భ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥ 43

మహాబాహువులు గల అర్జునా! బుద్ధి కన్నా గొప్పదైన ఆత్మను వివేకంతో బుద్ధి చేత మనస్సును అరికట్టి బహు కష్ట సాధ్యమైన దుర్జయ శత్రువు అయిన కామమును నశింపచేయుము.





**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మయోగో నామ తృతీయోఽధ్యాయః**

**మానసిక ప్రశాంతత కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ వ్యామిశ్రే ణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽ హ మాప్నుయామ్ ॥
3వ అధ్యాయము - 2వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 11
జప సంఖ్య - 11 వేలు

**శత్రువుపై విజయము కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్త భ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥
3వ అధ్యాయము - 43వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 21,
జప సంఖ్య - 41 వేలు

**అపార భక్తి కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ ఇష్టాన్భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః ।
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥
3వ అధ్యాయము - 12వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 150,
జప సంఖ్య - 5 లక్షలు

**మనసు తప్పులవైపు పోకుండా ఉండాలంటే**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ లోకేஉ స్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తామయాஉ నఘ ।
జ్ఞానయోగేన సాఙ్ఖ్యానాం కర్మయోగేన యోగినామ్ ॥

*3వ అధ్యాయము - 3వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 41,*
*జప సంఖ్య - 1 లక్షా 25 వేలు*





# జ్ఞాన యోగః

***నాలుగో అధ్యాయమైన ఈ జ్ఞానయోగంలో...***

- ★ *1వ శ్లోకం నుంచి 18వ శ్లోకం వరకూ భగవానుని ప్రభావము, నిష్కామ కర్మయోగ విషయములు.*
- ★ *19వ శ్లోకం నుంచి 23వ శ్లోకం వరకూ జ్ఞానులు, మహాత్ముల ఆచరణము.*
- ★ *24వ శ్లోకం నుంచి 32వ శ్లోకం వరకూ మంచి ఫల వివరణము.*
- ★ *33వ శ్లోకం నుంచి 42వ శ్లోకం వరకూ జ్ఞానము యొక్క మహిమలు.*

# జ్ఞాన యోగః

*అవ. కర్మయోగము గతంలో ఎవరికి చెప్పిందీ*
*శ్రీకృష్ణుడు చెప్పట.*

*శ్రీ భగవాన్ ఉవాచ.*

**శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।**
**వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽ బ్రవీత్ ॥1**

శ్రీ భగవానుడు పలికెను. నిత్యమైనదీ, సత్యమైనదీ అయిన కర్మయోగము ద్వారా పొందబడే ఈ జ్ఞాన నిష్ఠ పూర్వము సూర్యదేవునికి చెప్పితిని. సూర్యుడు వైవస్వత మనువుకూ, ఆ మనువు ఇక్ష్వాకునకు బోధించెను.

**శ్లో॥ ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్ష యో విదుః ।**
**స కాలే నేహ మహతా యోగో నష్టః పరన్తప ॥ 2**

ఓ అర్జునా! ఆ విధంగా పరంపరా ప్రాప్తమైన ఈ యోగమును సకల రాజర్షులంతా తెలుసుకుంటిరి. ఎంతో కాలం అయినందున ఆ యోగము లోకములో ప్రచారంలో లేకున్నది.



**శ్లో॥ స ఏవాయంమయాతేఽ ద్య యోగః ప్రోక్తః పురాతనః ।**
**భక్తోఽ సి మే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ॥ 3**

ఈ పురాతన యోగము అతి రహస్యమైనది. నీవు నా భక్తుడవు. ఎంతో ఇష్టుడవు. కాన అతి పురాతనమైన ఈ యోగమును నీకు తెలుపుతున్నాను.

*అవ. ఈ యుగంలో జన్మించిన శ్రీకృష్ణుణ్ణి పూర్వం*
*సూర్యాదుల వంటి వారికి ఎలా చెప్పావని అడుగుట.*

*అర్జున ఉవాచ.*

**శ్లో॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।**
**కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి ॥ 4**

అర్జునుడు పలికెను.

ఓ శ్రీకృష్ణా! మీ జన్మ ఇప్పటిది. సూర్యదేవుని జన్మ కల్పాది యందు జరిగింది. అతి ప్రాచీనమైనది. సృష్ట్యాదినందు సూర్యునికెలా బోధించావు. నా సంశయాన్ని తీర్చుము.

*అవ. జన్మలు ఒక్కటి కాదనీ... నిరంతరం*
*జరుగుతుంటాయని భగవానుడు చెప్పట.*

*శ్రీ భగవాన్ ఉవాచ.*

**శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।**
**తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥ 5**

శ్రీ భగవానుడు చెప్పెను.

ఓ పరంతపా! అర్జునా! నాకూ, నీకూ అనేక జన్మలు జరిగి పోయాయి. జరిగిపోయిన జన్మలన్నీ నాకు తెలియును. నీకు తెలియవు.

శ్లో॥ అజోఽపిస న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సమ్భవా మ్యాత్మమాయయా ॥ 6

నేను పుట్టుక లేనివాడను. నాశరహితుడను. సకల ప్రాణులకు ఈశ్వరుడను. అయినా కూడా ప్రకృతిని వశపరుచుకొని నా మహా మాయా శక్తితో సంభవిస్తున్నాను. పుట్టుచున్నాను.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥ 7

ఓ అర్జునా! ధర్మమెప్పుడు క్షీణించి అధర్మము వృద్ధి అగునో అప్పుడు నన్ను నేను సృష్టించుకొని అవతరించు తున్నాను.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే ॥ 8

సాధువులనూ, మంచివాళ్ళను రక్షించుటకొరకూ, దుర్మార్గులను రూపుమాపుటకు నేను ప్రతియుగమున అవతరించుచున్నాను.

*అవ. మోక్షము ఎలాంటి వారికి కలుగుతుందో,*
*ఏ ప్రవర్తనలు కలవారికి పరమాత్మ దర్శనము*
*కలుగుతుందో శ్రీ భగవానుడు చెప్పట.*

శ్లో॥ జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున ॥9

అర్జునా! అవతారములు దివ్యములు, నిర్మలములు. అట్టి నా దివ్యమైన జన్మలనూ, కర్మములనూ గూర్చి ఎవ్వరైతే తెలుసుకొనగలుగుతున్నాడో, అట్టి తత్త్వరహస్యములను తెలుసుకున్న వానికి మోక్షమును ఇచ్చుచున్నాను. అతడు నన్నే చేరుతున్నాడు.



శ్లో॥ వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః ॥ 10

ఓ అర్జునా! అనురాగం, భయం, క్రోధములు వదిలిన వారూ, నా యందే స్థిరచిత్తము కలవారూ, నన్నే ఆశ్రయించు వారూ అయిన అనేకులు జ్ఞాన తపస్సంపన్నులై పవిత్రులై నా స్వరూపము పొందినారు.

శ్లో॥ యే యథా మాంప్రపద్యన్తే తాంస్తథైవభజామ్యహమ్ ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥ 11

ఓ అర్జునా! ఏ విధంగా నన్ను సేవిస్తారో, వార్ని ఆ విధంగానే నేను అనుగ్రహిస్తున్నాను. మనుజులందరూ అనేక విధాలుగా నా మార్గమునే అనుసరిస్తున్నారు.

శ్లో॥ కాఙ్క్షన్తః కర్మ ణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా ॥ 12

ఈ లోకమున కర్మముల ఫలప్రాప్తిని ఆశించు వారు ఇంద్రాది దేవతలను పూజింతురు. అలా చేయటం వల్ల కర్మల వల్ల కలిగే సిద్ధి వారికి త్వరితంగా లభిస్తుంది.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తార మపి మాం వి ద్ధ్యకర్తార మవ్యయమ్ ॥13

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణముల వారిని వారి గుణకర్మల ప్రకారం వేరు వేరుగా సృష్టించాను. వారికి నేను కర్తనైనప్పటికీ నిజానికి నేను అకర్తను. నిర్వికారునిగా తెలుసుకొనుము.

శ్లో॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే ॥14

నాకు కర్మఫలాపేక్షపై ఆసక్తి లేదు. అందువల్ల నాకే కర్మలూ అంటవు. అట్టి నా తత్త్వమును తెలిసినవారు కర్మబద్ధులు కారు.

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః ।
కురు కర్మైవతస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ 15

ఓ అర్జునా! పురాతనమైన ముముక్షువులు నా తత్త్వ రహస్యములను తెలుసుకొని కర్మలను ఆచరించారు. నీవూ ప్రాచీనుల వలే నిష్కామ కర్మలను ఆచరించు.

అవ. కర్మ, అకర్మల గూర్చి భగవానుడు చెప్పట.

శ్లో॥ కిం కర్మ కి మకర్మేతి కవయోఽ ప్యత్ర మోహితాః ।
తత్తే కర్మప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామోక్ష్యసేఽ శుభాత్ ॥ 16

కర్మ అంటే ఏమిటి? అట్లే అకర్మ అంటే ఏమిటి? ఈ విషయంలో పండితులు సహితము తికమక చెందుతున్నారు. ఆ కర్మతత్త్వాన్ని వినుము. దాన్ని తెలుసుకున్న సంసారబంధము నుంచి విముక్తుడవి కాగలవు. అట్టి కర్మ రహస్యములను నీకు చక్కగా విశదం చేస్తున్నాను... తెలుసుకొనుము.

శ్లో॥ కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥ 17

కర్మ చేయదగినది, వికర్మ చేయరాని కర్మ. ఆ అకర్మ సోమరిగా ఉంచి కర్మ చేయనీయదు. అట్టి శాస్త్ర సమ్మతమైన కర్మలనూ, వికర్మలనూ ఆ కర్మల యొక్క స్వరూపాలను తెలుసుకొనవలెను. ఎందుకంటే కర్మ తత్త్వము అతి నిగూఢమైంది.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః ।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ 18



కర్మ యందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించువాడు బుద్ధిమంతుడు. మనుజులలో వివేకవంతుడు సకల కర్మలను చేయువాడు.

అవ. పండితుడన్న వాడి లక్షణాలని చెప్పట.

శ్లో॥ యస్య సర్వే సమారమ్భాః కామసఙ్కల్పవర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పణ్డితం బుధాః ॥ 19

ఎవరి కర్మలైతే శాస్త్ర ప్రకారం నుండునో, కామ సంకల్పరహితముగా జరుగునో అలాగే ఎవరి కర్మలు జ్ఞానము అనే అగ్నితో భస్మమగునో అట్టి పురుషుణ్ని జ్ఞానులు పండితులని సంబోధిస్తారు.

అవ. ఎలాంటి కర్మలకి కర్త బాధ్యుడుకాడో చెప్పట.

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽ పి నైవ కిఞ్చి త్కరోతి సః ॥ 20

ఎవడైతే కర్మ ఫలములపై ఆసక్తి వదలి సంతృప్తుడై పరమాత్మయందు నిత్యతృప్తుడై కర్మలను ఆచరిస్తాడో అట్టి వాని కర్మలకు అతడు కర్త కాడు.

శ్లో॥ నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ ॥ 21

ఆశలు లేనివాడూ, ఇంద్రియములను నిగ్రహించుకొనిన వాడూ, సకల భోగవస్తువులను వదిలేసినవాడూ యోగి. అట్టి సాంఖ్యయోగి శరీర కర్మలను చేసిననూ పాపాలను పొందజాలడు.

శ్లో॥ యదృచ్ఛాలాభస న్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాఽ పి న నిబధ్యతే ॥ 22

తాను ఆశించకుండా వచ్చిన అప్రయత్న లాభానికి సంతృప్తి చెందినవాడూ, అసూయ లేనివాడూ, సుఖదుఃఖాలకు అతీతుడూ, సమబుద్ధి కలిగినవాడూ అనగా కార్యము సిద్ధించిననూ, వికటించిననూ సమభావంతో నుండే అట్టి వాడు కర్మమును చేసినను అందు చిక్కుకొనడు.

అవ. బ్రహ్మం అను దానికి పరమార్థం పరమాత్మ చెప్పట.

శ్లో॥ గ తసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞా యాచరత ః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ 23

దేనిపై ఆసక్తి లేనివాడు రాగ ద్వేష కామ క్రోధాల నుంచి విముక్తుడగును. ఆత్మజ్ఞానమందు మనస్సును నిలిపిన వాడూ, ధర్మము కోసం కర్మలను ఆచరించువాడూ అట్టి వాని కర్మలన్నీ విలీనమైపోవుచున్నవి. అనగా ఏవీ మిగిలి ఉండుట లేదు.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌబ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥ 24

యజ్ఞ కార్యములందు ఉపయోగించే హోమసాధనము బ్రహ్మము. హోమద్రవ్యము బ్రహ్మం. హోమాగ్ని బ్రహ్మం. హోమము బ్రహ్మం. హోమము చేయువాడు బ్రహ్మం. హోమము అయినది బ్రహ్మం. అన్నీ బ్రహ్మ స్వరూపములే. ~~ఈ~~ బ్రహ్మ కర్మ యందు ఏకాగ్రతతో చేయు యజ్ఞాది కర్మలను చేయు మనుజుడు బ్రహ్మమునే పొందగలడు.

శ్లో॥ దైవ మే వాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నై వోపజుహ్వతి ॥ 25

కొంతమంది యోగులు దేవతారాధన యజ్ఞమును చేయుచున్నారు. మరికొందరు బ్రహ్మాగ్ని యందు అనగా పరబ్రహ్మ



పరమాత్మ రూపాగ్నినందు అభేద దర్శన రూపయజ్ఞము ద్వారా ఆత్మరూప యజ్ఞాన్ని ఆచరిస్తున్నారు.

అవ. ఎవరెవరు ఎలాంటి హోమాలు చేస్తున్నారో
శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీ న్విషయా నన్యే ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥ 26

కొందరు యోగులు నిగ్రహమనే అగ్నుల యందు, మరికొందరు శబ్దాది విషయములను, ఇంద్రియములును అగ్నుల యందు హోమం చేయుచున్నారు.

శ్లో॥ సర్వా ణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ 27

ఇంకొంతమంది యోగులు వివేకజ్ఞానప్రదీపమైన ఆత్మసంయమమనే అగ్నుల యందు హోమము చేస్తున్నారు. అట్టి వారికి ప్రాణాది ఇంద్రియముల ప్రభావము ఉండదు. అట్టి వారి బుద్ధి నందు ఆ పరమాత్మ ఉండును.

అవ. ఎన్ని రకాల యజ్ఞాలున్నాయో భగవానుడు చెప్పట.

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽ పరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞా శ్చ యతయ స్సంశిత వ్రతా ॥ 28

కొందరు ధనమును దానధర్మాది విషయములకు ఉపయోగిస్తున్నారు. కొందరు తపస్సే పరమావిధిగా ఆచరిస్తున్నారు. ఇంకొందరు యోగమే యజ్ఞముగా చేస్తున్నారు. ఇంకొంతమంది వేదాధ్యయమునూ, శాస్త్ర పఠనమునూ యజ్ఞంగా చేయుచున్నారు. అట్టివారు యత్నశీలురు. దృఢవ్రతములు కలవారు.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽ పానం తథాఽ పరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ॥29

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।
సర్వే ప్యే తే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥ 30

కొందరు యోగులు అపాన వాయువు నందు ప్రాణవాయువును, ఇంకొందరు ప్రాణవాయువునందు అపాన వాయువును హోమము చేస్తున్నారు. (ఆహారనియమము కూడా యజ్ఞం వంటిదే. మితంగా సాత్త్వికమైనదీ, న్యాయమైనదీ భగవంతునికీ అర్పించగా మిగిలినదీ) అట్టి వారు యజ్ఞమును తెలిసినవారు. అట్టి యజ్ఞము ద్వారా పాపము పోగొట్టుకొనుచున్నారు.

అవ. ఇహలోక పరలోక సుఖాలకి అడ్డంకులైన కార్యాలను భగవానుడు చెప్పట.

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽ స్త్య యజ్ఞస్య కుతోఽ న్యః కురుసత్తమ ॥ 31

కురువంశశ్రేష్ఠా అర్జునా! యజ్ఞములు ఆచరించిన తర్వాత మిగిలిన అన్నము అమృతరూపము. దాన్ని భుజించిన వారు మహా శాశ్వత పరబ్రహ్మమును పొందుదురు. అలాంటి యజ్ఞం ఒక్కటి కూడా చేయని వారికి ఇహలోకములో సుఖం ఉండదు. ఇక పరలోక సంగతేలా?

అవ. సకల సంపదలిచ్చే యజ్ఞాలు ఎందులో ఉన్నాయో శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజాన్ విద్ధి తా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ 32

ఇలాంటి అనేక యజ్ఞములు వేదములలో ఇంకనూ ఉన్నాయి. ఆ యజ్ఞములను ఎవరైతే త్రికరణ శుద్ధిగా ఆచరిస్తారో



వారు సుసంపన్నులగుదురు. అలాంటి కర్మతత్త్వాన్ని తెలుసుకొని చేయుట ద్వారా కర్మ బంధములనుంచి విముక్తుడవుకాగలవు.

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33

ఓ అర్జునా! ధనము వల్ల చేయు యజ్ఞము కన్నా జ్ఞాన యజ్ఞము శ్రేష్ఠం. కర్మములన్నీ జ్ఞానమునందే పరి సమాప్తి అవుతాయి.

అవ. జ్ఞానాన్ని ఎవరి నుంచి ఏ రకంగా పొందాలి అని అర్జునుడికి చెప్పట.

శ్లో॥ త ద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥ 34

నీవు జ్ఞానమును, తత్త్వమును దర్శించిన వారి వద్దకెళ్ళి ఆ జ్ఞానాన్ని పొందు. అట్టి వారికి నమస్కరించుట, సేవించుట, భక్తి శ్రద్ధలతో గౌరవభావంతో అడుగుట ద్వారా పరమాత్మ తత్త్వమును నీకు అర్థమయ్యేలా ఇష్టంతో చెప్పుదురు.

శ్లో॥ యద్ జ్ఞాత్వా న పున ర్మోహ మేవం యాస్యసి పాణ్డవ ।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి ॥ 35

ఓ అర్జునా... ఈ తత్త్వజ్ఞానము నీవు తెలుసుకున్నచో తిరిగి నీవు వ్యామోహంలో పడవు. అట్టి జ్ఞానం ద్వారా సమస్త ప్రాణులను నీ యందు, భగవంతుని యందు చూడగలవు.

అవ. మహా పాపశౌచ కార్యాలను చేసినవారు సహితం ఆ పాపాలను ఎలా పోగొట్టుకోవాలో వివరించుట.

శ్లో॥ అపి చే దసి పాపేభ్య స్స ర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సన్తరిష్యసి ॥ 36

ఒకవేళ పాపాత్ములందరికంటే నీవు మహా పాపము చేసిన మహాపాపివి అయినట్లయితే జ్ఞానమనే నౌక సహాయంతో ఆ మహా పాపసముద్రం నుంచి నీవు నిశ్చయంగా బైటపడగలవు.

శ్లో॥ య థై ధాంసి సమిద్ధోఽ గ్ని ర్భస్మసాత్కురు తేఽ ర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ 37

ఓ అర్జునా! మండుతున్న అగ్ని సమిధలను ఎటుల కాల్చి వేయునో, భస్మం చేయునో... అట్లే జ్ఞానమనే అగ్ని కర్మలనన్నింటినీ బూడిద చేయును.

శ్లో॥ నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।
త త్స్వయం యోగసంసిద్ధః కాలేనాఽ త్మని విన్దతి ॥ 38

ఈ లోకములో జ్ఞానముతో సమానమైనదీ, పవిత్రమైనదీ ఏదీ లేదు. అట్టి సాధకుడు కర్మ యోగాచరణం గావించి ఆత్మ యందు అనగా తన యందే జ్ఞానమును స్వయంగా తనంతట తానే పొందగలుగుతున్నాడు.

*అవ. మోక్షాన్ని మనుజులు ఎలా పొందగలుగుతున్నారో చెప్పట.*

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరే ణాధిగచ్ఛతి ॥ 39

గురువుల శాస్త్రములందు భక్తి గలవాడూ, వాటిని ఏకాగ్రతతో గ్రహించిన వాడూ, ఇంద్రియములను జయించిన వాడూ జ్ఞానాన్ని పొందుతున్నాడు. అట్టి వాడు పరమ శాంతి రూపమైన మోక్షమును పొందుతున్నాడు.

*అవ. జ్ఞాన, అజ్ఞానములకన్నా తక్కువ స్థాయిని గూర్చి శ్రీకృష్ణుడు పలుకుట.*



శ్లో॥ అజ్ఞ శ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽ స్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ 40

ఆత్మ జ్ఞానము లేనివాడూ, శ్రద్ధ లేనివాడూ, అనుమానమున్నవాడూ నశిస్తున్నాడు. అట్టి వానికి ఇహంలోనూ, పరంలోనూ సుఖములు కలుగవు. అసలు వేటిపై శ్రద్ధ లేని వాడి కన్నా, అజ్ఞానికన్నా అనుమానమున్నవాడే భ్రష్టుడవుతాడు.

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసఞ్ఛిన్న సంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ॥ 41

ఓ ధనుంజయా! కర్మలను ఆచరిస్తూ ఆ కర్మ ఫలాలను భగవంతునికి అర్పిస్తూ, జ్ఞానముచే సంశయము లను తొలగించుకున్న బ్రహ్మజ్ఞానిని కర్మములు బంధించవు.

శ్లో॥ తస్మా దజ్ఞానసమ్భూతం హృత్ స్థం జ్ఞానాసినాఽ త్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతి ష్ఠోత్తిష్ఠ భారత ॥42

కాన ఓ భరతా అర్జునా! నీ హృదయంలో అజ్ఞాన పూరితమైన సంశయములను వివేకమనే మహాఖడ్గంతో ఛేదించి నిష్కామకర్మయోగం ఆచరించుచు యుద్ధమునకు సిద్ధుడవవ్వు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగోనామ చతుర్థోఽ ధ్యాయః.**

## అపార భక్తి కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప ॥

**4వ అధ్యాయము-5వ శ్లోకము, చేయాల్సిన రోజులు-51, జప సంఖ్య-6 లక్షలు**

# కర్మసన్న్యాస యోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

- ★ ఐదవ అధ్యాయము అయిన ఈ కర్మసన్న్యాస యోగంలో 1వ శ్లోకం నుంచి 6వ శ్లోకం వరకూ నిష్కామకర్మయోగం గూర్చి.
- ★ 7వ శ్లోకం నుంచి 12 వ శ్లోకం వరకూ కర్మయోగి లక్షణములు, మహత్మ్యము.
- ★ 13వ శ్లోకం నుంచి 26వ శ్లోకం వరకూ జ్ఞానయోగంపై వివరణ.
- ★ 27వ శ్లోకం నుంచి 29 వరకూ ధ్యానయోగ వర్ణనము.



# కర్మసన్న్యాస యోగః

*అవ. కర్మత్యాగము, కర్మయోగము ఈ రెంటిలో ఏది శ్రేష్ఠమైనదని భగవానుణ్ణి అర్జునుడు అడుగుట.*

అర్జున ఉవాచ.

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగం చ శంససి ।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్ ॥ 1

 అర్జునుడు అడిగెను.

హే శ్రీకృష్ణా! ఓసారి కర్మసన్న్యాసమూ, ఇంకోసారి కర్మయోగమూ శ్రేష్ఠమని చెప్పుచుంటివి. ఆ రెంటిలో ఏది శ్రేష్ఠమో నిశ్చయించి నాకు తెలుపుము.

*అవ. అర్జునుడి సందేహానికి శ్రీకృష్ణుడు సమాధానం చెబుతున్నాడు.*

శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో॥ సన్న్యాసః కర్మయోగ శ్చ నిశ్శ్రేయసకరా వుభౌ ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥ 2

కర్మసన్న్యాసమూ, కర్మయోగమూ రెండూ మోక్షమును ఇచ్చేవే... అయితే ఆ రెంటిలో సాధకుడు ప్రారంభమున కర్మత్యాగము కన్నా కర్మయోగము సాధనము చేయుట శ్రేష్ఠం. రెండూ ముక్తిదాయకములే.

*అవ. మహా దుఃఖ, సుఖ సాగరమనే సంసారం నుంచి ఎలా బైటపడాలో స్వామి అర్జునుడికి చెప్పట.*

**శ్లో॥ జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యోన ద్వేష్టి నకాఙ్క్షతి ।**
**నిర్ద్వన్ద్వోహి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే ॥ 3**

మహాబాహువులు గల అర్జునా! ఎవ్వరినీ ద్వేషింపక దేనిపై వ్యామోహం లేక రాగద్వేషాదులను అధిగమించిన వాడు తేలికగా సంసారబంధము నుంచి విముక్తి అవుతున్నాడు.

*అవ. కర్మయోగము, జ్ఞానయోగము రెంటి వల్ల ఒకే ఫలమొస్తుందని శ్రీ భగవానుడు చెప్పట.*

**శ్లో॥ సాఙ్ఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః ।**
**ఏకమ ప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్ ॥ 4**

కర్మసన్న్యాసము, కర్మ యోగములు రెండూ వేరు వేరు అని కొంతమంది జ్ఞానము లేని వారు భావింతురు. అట్టివారు వివేకవంతులు కారు. ఆ రెంటిలో దేనియందైనా నిష్ఠతో ఉన్నవాడు రెండింటి యొక్క ఫలములను పొందుతున్నాడు.

**శ్లో॥ య త్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగైరపి గమ్యతే ।**
**ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి ॥ 5**

జ్ఞానయోగులు ఎలాంటి మోక్షమును పొందుతున్నారో అదే మోక్షములు కర్మయోగులు కూడా పొందుతున్నారు.



జ్ఞానయోగము, కర్మయోగములను ఒక్కటిగా చూసేవాడే నిజముగా యదార్థమును గ్రహించినవాడు.

**శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః ।**
**యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరే ణాధిగచ్ఛతి ॥ 6**

గొప్ప భుజములు గల అర్జునా! కర్మయోగాన్ని అనుష్ఠింపక శరీరము, మనస్సుల ద్వారా వచ్చే కర్మలన్నీ వదిలివేయుట కష్టం. కర్మయోగంలో కూడిన దైవ స్వరూపాన్ని ధ్యానించుట వల్ల కర్మయోగి బ్రహ్మమును పొందుతున్నాడు.

*అవ. కర్మలను అంటిన లక్షణములు గూర్చి అర్జునుడికి చెప్పట.*

**శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియ ।**
**సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ 7**

మనసును తన వశం చేసుకున్నవాడూ, పరిశుద్ధ నిర్మలహృదయం కలవాడూ, ఇంద్రియములను జయించిన వాడూ, సకల ప్రాణుల యందున్న ఆత్మా, తన ఆత్మ ఒకటేనని తెలుసుకున్నవాడు కర్మయోగి. అట్టి వాడు కర్మలు ఆచరించిననూ కర్మలు అంటవు.

*అవ. తత్త్వజ్ఞుడు ఇంద్రియాదులు చేసే కార్యాలను తను చేయుట లేదని వాటి పని అవి చేస్తుంటాయని తెలుసుకుంటాడని భగవానుడు చెప్పట.*

**శ్లో॥ నైవ కిఞ్చి త్కరో మీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।**
**పశ్యఞ్ శృణ్వఞ్ స్పృశఞ్ జిఘ్ర న్నశ్నన్గచ్ఛఞ్ స్వపఞ్ శ్వసన్ ॥ 8**

**శ్లో॥ ప్రలపఞ్ విసృజఞ్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి ।**
**ఇన్ద్రియా ణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥ 9**

తత్త్వజ్ఞానుడైన పరమార్థతత్త్వమును తెలుసుకున్నవాడు చూస్తున్నా, వింటున్నా, తాకుతున్నా, వాసన చూస్తున్నా, తినుచున్నా, నడుచుచున్నా, నిదిరించుచున్నా, ఊపిరి వదలి తీసుకుంటున్నా, మాట్లాడుతున్నా, కనులను మూసినా, తెరిచినా ఇంద్రియములు వాటి వాటి పని చేస్తున్నాయని తలుస్తాడు. తానేమీ చేయుటలేదని భావిస్తాడు.

*అవ. కర్మల తాలూకు పాపములు ఎలా అంటకుండా వుండాలో భగవానుడు చెప్పట.*

**శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః ।**
**లిప్యతే న స పాపేన పద్మపత్రమి వామ్భసా ॥ 10**

ఎవరైతే తాను చేసిన కర్మలపై ఆసక్తి లేకుండునో అట్టి వానికి తామరాకుపై నీటి బిందువుల వలే పాపములు అంటవు.

**శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రిన్ద్రియై రపి ।**
**యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥ 11**

నిష్కామ కర్మయోగులు ఫలాసక్తిని వదలి శరీరం చేత, మనస్సు, బుద్ధి చేత తనకే మాత్రం అభిమానం లేని ఇంద్రియముల చేత కర్మలు చేస్తున్నాడు.

*అవ. ఎలాంటి కోరికలు గలవారు సంసారంలో మునిగిపోతున్నారో భగవానుడు చెప్పట.*

**శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్ ।**
**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ 12**

నిష్కామకర్మయోగి కర్మానుష్ఠానము పరమాత్మ కోసమేనని తన కోసం కాదని స్థిర అభిప్రాయం కలవాడై కర్మఫలాలని వీడి జ్ఞాననిష్ఠతో మోక్షరూపమైన శాంతిని పొందుతున్నాడు. అలాకాక ఫలము కోరి కర్మలను చేసేవాడు కామమునకు లోనై కర్మలను చేస్తూ



దానికోసమే ప్రాకులాడుతూ సంసార సముద్రంలో మునిగి ఉంటున్నాడు.

*అవ. శరీరమనే నగరంలో సుఖంగా ఎలా ఉండాలో శ్రీభగవానుడు చెప్పట.*

**శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్య స్యాస్తే సుఖం వశీ ।**
**నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్ ॥ 13**

హృదయమును అదుపులో ఉంచుకొని సాంఖ్య యోగాలను ఆచరిస్తూ కర్మఫలములను పరిత్యజించి అన్నీ చేసేవాడై ఏమి చేయనివాడై నవద్వార నగరమైన శరీరమనే పట్టణమునందు హాయిగానుంటున్నాడు.

**శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।**
**న కర్మఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే ॥ 14**

సృష్టికర్తయైనవాడు జీవరాసులలో దేనికీ కర్తృత్వముతోగానీ, కర్మములతో గానీ, కర్మఫలములతోగానీ ఎట్టి సంబంధము కలుగచేయుటలేదు.

జన్మాంతర సంస్కారమే కర్తృత్వాదులను కలిగిస్తోంది. మామిడి విత్తనము నాటితే మామిడి పండ్ల ఫలము వచ్చును. గన్నేరు చెట్టు నాటితే విషఫలమే వచ్చును.

**శ్లో॥ నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః ।**
**అజ్ఞానే నాఽఽవృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥ 15**

సకల వ్యాప్తి అయిన ఆ పరంధాముడు ప్రాణుల పుణ్యాపాప కర్మలకు ఎట్టి బాధ్యుడూ కాడు. అజ్ఞానముచే జ్ఞానము కప్పి వేయుట వల్ల మనుజులు భ్రమలు పొందుతున్నారు.

శ్లో॥ జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనామ్ ।
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥ 16

జ్ఞానము వల్ల ఎవరి అజ్ఞానము పోతుందో అట్టి వారి జ్ఞానము పరమాత్మను సూర్యుని వలే దర్శింపచేయును.

*అవ. మహా క్లేశములు గల మానవజన్మ మళ్ళీ మళ్ళీ రాకూడదంటే ఎలాంటి నిష్ఠలతో ఉండాలో శ్రీభగవానుడు చెప్పట.*

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః ।
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ 17

ఆ పరమాత్మ యందు బుద్ధీ, మనస్సులనూ నిలిపిన వారూ, నిష్ఠగలవారూ ఆ పరమ దేవుణ్ని పరమగతిగా భావించినవారూ జ్ఞానముచే పాపములను పోగొట్టుకున్న వారై మరుజన్మ లేకుండా మహా మోక్ష పదవిని పొందుతున్నారు.

*అవ. సకల ప్రాణుల యందు సమభావముగా ఉండటమే జీవాత్మకి మార్గమని చెప్పట.*

శ్లో॥ విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శునిచైవ శ్వపాకేచ పణ్డితా స్సమదర్శినః ॥ 18

జ్ఞాని అయినవాడు సకల విద్యాపారంగతుడి యందూ, బ్రాహ్మణుని యందూ, గోవు యందూ, ఏనుగు యందూ, కుక్క మాంసము తిను చెండాలుని యందూ సమదృష్టినే కలిగి ఉంటారు.

శ్లో॥ ఇహైవ తైర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః ॥ 19

ఎవరి మనస్సు సమభావమందు నిశ్చలముగా నుండునో అట్టి నిర్మల మనస్సు గలవారు ఈ జన్మమునందే జనన మరణ



రూప సంసారమును జయించుతున్నారు. పరమాత్మ దోషరహితుడు. సమ భావ స్థిర మనస్సు గల జ్ఞానులు పరమాత్మ యందు స్థితులు. కాన వారు జీవన్ముక్తులు.

*అవ. బ్రహ్మజ్ఞాని లక్షణాలను శ్రీభగవానుడు చెప్పట.*

శ్లో॥ న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య
నో ద్విజే త్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః ॥ 20

ఇష్టమైన దాన్ని పొందినప్పుడు సంతోషించటం, అయిష్టమైన దాన్ని పొందినప్పుడు క్రుంగిపోవటం వంటివి స్థిరమైన బుద్ధి కలవాడూ, మోహరహితుడూ, బ్రహ్మమునందు స్థిరమైనవాడూ చేయడు.

*అవ. బ్రహ్మస్థితియందు నిలకడ ఎలా కలుగుతుందో చెప్పట.*

శ్లో॥ బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్ద త్యాత్మని య త్సుఖమ్ ।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే ॥ 21

బాహ్యవిషయముల నందు ఆసక్తిలేనివాడై నిర్మల హృదయం గల సాధకుడు ఆత్మస్థితధ్యానాల ద్వారా వచ్చే మహదానందమును పొందుతున్నాడు. ఆపై అక్షయ సుఖమును పొందుతున్నాడు.

*అవ. మహాసుఖాలుగా అనిపించే భయంకర దుఃఖాల గూర్చి శ్రీభగవానుడు చెప్పట.*

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః ॥ 22

అర్జునా... విషయేంద్రియ సంయోగము వల్ల కలిగే సుఖాలు దుఃఖానికి హేతువులే. సుఖములుగా అనిపించే దుఃఖములు. కాన అర్జునా! వివేకి అట్టి వానికి వ్యామోహం చెందడు.

శ్లో॥ శక్నోతీహైవ య స్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః ॥ 23

 ఈ శరీరమును ఆత్మ వీడక ముందే కామక్రోధాలను అదుపులో ఉంచుకున్న వాడే యోగి.. సుఖవంతుడు.

అవ. సాంఖ్యయోగి బ్రహ్మానుభూతిని ఎలా పొందాలో చెప్పట.

శ్లో॥ యోఽన్తస్సుఖోఽన్తరారామస్తథాఽన్తర్జ్యోతిరేవయః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ 24

 బాహ్యావిషయముల యందు గాక అంతరాత్మ యందే సుఖించేవాడు, బైటి విషయాలపై క్రీడాశూన్యుడైన వాడు సాంఖ్యయోగి. అట్టి వాడు బ్రహ్మస్వరూపుడై జీవించినప్పుడే మోక్షమును పొందుతున్నాడు.

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః ॥ 25

 పాపములు పోగొట్టుకున్న వారూ, సంశయములు లేనివారూ, ఇంద్రియములను స్వాధీన పరుచుకున్నవారూ సకల ప్రాణుల యందు హితము గలవారు అట్టి వారు ఋషులు. బ్రహ్మ సాక్షాత్కారములను పొందగోరుతున్నారు.

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విజితాత్మనామ్ ॥ 26

 కామక్రోధములు లేనివారూ, మనోనిగ్రహము కలవారూ, ఆత్మతత్త్వము తెలుసుకున్నవారికి శరీరము ఉన్నప్పుడూ, లేనప్పుడూ బ్రహ్మానందము, మోక్షములు అందుచున్నాయి.



అవ. ధ్యాన పద్ధతిలో మోక్షాన్ని పొందే విధం చెప్పట.

శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం
శ్చక్షు శ్చై వాన్తరే భ్రువోః ।
ప్రాణాపానౌ సమౌ కృత్వానాసాభ్యన్తరచారిణౌ ॥ 27

శ్లో॥ యతేన్ద్రియమనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః ।
విగ తేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్త ఏవ సః ॥ 28

 బాహ్య విషయాలపై మమకారం పెంచుకొనక వాటిని వెలపలికి నెట్టి వేస్తూ లోపలికి ప్రవేశింపనీయక దృష్టిని భ్రూ మధ్యమున నిలిపి, నాసిక ద్వారా ప్రాణవాయువులను సమంగా చేసి ఇంద్రియ నిగ్రహంతో కోరికలూ, భయమూ, కోప క్రోధములు లేనివాడై, మోక్షమునకై మనస్సుని నిలిపెదడో అట్టి వాడు ముక్తుడగును.

అవ. మోక్షానికి సులభమైన పద్ధతులను శ్రీభగవానుడు చెప్పట.

శ్లో॥ భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాంశాన్తిమృచ్ఛతి ॥29

 పరమాత్ముడు యజ్ఞములకూ, తపస్సులకూ భోక్త. సకల లోకములకూ, లోకపాలకులకీ అధిపతి. సకల ప్రాణులకీ హితుడు. ఇట్టి భగవత్ తత్త్వమును తెలుసుకున్నవాడు మహా పరమ శాంతిని పొందుతున్నాడు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జునసంవాదే కర్మసన్న్యాసయోగోనామ**
**పంచమోఽధ్యాయః.**

## మహాసాధనకై జపించాల్సిన మంత్రము

శ్లో॥ భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాంశాన్తిమృచ్ఛతి ॥

*5వ అధ్యాయము-29వ శ్లోకము, చేయాల్సిన రోజులు-21, జప సంఖ్య - 43*

## ఆకస్మిక ధనలాభం కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ య త్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగైరపి గమ్యతే ।
ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి ॥

*5వ అధ్యాయము – 5వ శ్లోకము, చేయాల్సిన రోజులు – 40, జప సంఖ్య – 108*





# ఆత్మసంయమ యోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- ★ ఆరవ అధ్యాయము అయిన ~~ఈ~~ ఆత్మసంయమ యోగంలో *1*వ శ్లోకము నుంచి *4*వ శ్లోకము వరకూ నిష్కామ కర్మ యోగ లక్షణములు.
- ★ *5*వ శ్లోకము నుంచి *10*వ శ్లోకము వరకూ జితేంద్రియుడైన జ్ఞాని లక్షణము.
- ★ *11*వ శ్లోకము నుంచి *32*వ శ్లోకము వరకు ధ్యానయోగ పద్ధతులు.
- ★ *33*వ శ్లోకము నుంచి *36*వ శ్లోకము వరకు మనో నిగ్రహం గూర్చి.
- ★ *37*వ శ్లోకము నుంచి *47*వ శ్లోకము వరకు ధ్యానయోగ మహిమల గూర్చి.

# ఆత్మసంయమ యోగః

అవ. యోగి సన్న్యాసి లక్షణములు శ్రీభగవానుడు చెప్పట.

శ్రీ భగవాన్ ఉవాచ.

శ్లో॥ అనాశ్రిత ః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీచ యోగీచ న నిరగ్ని ర్న చాక్రియః ॥ 1

ఎవరైతే చేయవల్సిన కర్మలను ప్రతిఫలాపేక్ష లేకుండా చేస్తాడో అట్టి వాడు యోగి అగును. అగ్నిహోత్రమునూ, కర్మలనూ విడిచి పెట్టినవాడు సన్న్యాసి ఎంత మాత్రం కాజాలడు. అలాగే క్రియలను వదిలేసినంత మాత్రాన యోగి కూడా కాడు.

శ్లో॥ యం సన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ ।
న హ్యసన్న్యస్తసజ్కల్పో యోగీ భవతి కశ్చన ॥ 2

ఓ అర్జునా! దేన్నయితే సన్న్యాసమని సంబోధిస్తారో అదియే యోగమని తెలుసుకొనుము. సంకల్పత్యాగాలు చేయనివాడు యోగి కాలేడు.



అవ. జ్ఞాన, ధ్యాన యోగాల ద్వారా మోక్షం పొందే
విధం చెప్పట.

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥ 3

జ్ఞానయోగము, ధ్యానయోగములు సాధించుట నిష్కామ కర్మసాధనము. సర్వసంకల్ప రాహిత్యమే మోక్షమునకు మూలము.

శ్లో॥ యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే ।
సర్వసజ్కల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥ 4

ఇంద్రియమైన సుఖభోగాలపై ఆసక్తిని వదలి సకల సంకల్పములను విడిచి పెడతాడో అట్టివాడు యోగా రూఢుడు.

అవ. తనకి తాను శత్రువు ఎలా అవుతాడో శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ ఉద్ధ రే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః ॥ 5

ఈ మహా సంసార సాగరం నుంచి తమని తామే ఉద్ధరించుకొనవలెను. ఇంద్రియములు జయించినచో తమకు తామే హితులు. జయింపకున్నచో తమకు తామే శత్రువులు.

శ్లో॥ బన్ధురాత్మాఽఽత్మన స్తస్య యే నాత్మై వాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥ 6

ఎవరైతే ఇంద్రియములను మనస్సులో జయించుకొనునో అట్టి వాని మనస్సు ఉపకారము చేయును. లేనిచో ఆ మనస్సు అపకారము చేయును.

అవ. ఇంద్రియాలను అదుపులో పెట్టుకొనుట వల్ల కలిగే
ఫలములు చెప్పట.

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ 7

 ఇంద్రియములతో మనస్సు జయించినవానికి మహా శాంతి లభించును. అట్టివానికి సుఖదుఃఖములు, మానావమానములగు అనేక విషయములందు హృదయము చలింపకుండును. అట్టి వాని జ్ఞానము నందు పరమాత్మ స్థిరమై ఉండును.

అవ. నిర్వికార తత్త్వమును వివరించుట.

శ్లో॥ జ్ఞాన విజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥ 8

 జ్ఞాన విజ్ఞానములు కలవాడు తృప్తి చెందిన మనస్సు కలవాడు నిర్వికారుడు.

ఇంద్రియాదులను పూర్తిగా తన వశం చేసుకున్నవాడు మట్టినీ, రాతినీ, బంగారమునూ సమానంగా చూచును.

అవ. సమభావం గూర్చి మరింత వివరంగా వివరించుట.

శ్లో॥ సుహృ న్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే ॥ 9

 ఫలితం ఆశించి చేయని వారివద్దా, ప్రతిఫలం ఆశించి చేసే వారి వద్దా, శత్రువుల వద్దా, మిత్రుల వద్దా, మధ్యవర్తుల వద్దా, విరోధుల వద్దా, బంధువుల వద్దా, ధర్మాత్ముల వద్దా, పాపుల వద్దా సమబుద్ధితో ఉండేవాడు శ్రేష్ఠుడు.

అవ. శ్రీ భగవానుడు ధ్యానపద్ధతిని చెప్పట.

శ్లో॥ యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః ।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః ॥ 10



 యోగి ఎవరూ లేని ప్రదేశమున మనస్సునూ, ఇంద్రియాలనీ వశపరుచుకొని ఎట్టి ఆశలూ లేనివాడై, ఆశించని వాడై పరమాత్మ యందు మనస్సును లగ్నము చేయవలెను.

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ॥ 11

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః ।
ఉపవిశ్యాఽ సనే యుఞ్జ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే ॥12

 చక్కని ప్రదేశమున దర్భాసనమున అనగా జింక వస్త్రమును (సహజంగా లభించినది లేదా కంబళి వంటి దానిపై) పరచి తక్కువ ఎత్తులో గానీ, ఎక్కువ ఎత్తులో గానీ కూర్చొనకుండా ఆసనమును స్థిరంగా ఉంచవలెను. అట్టి ఆసనంపై కూర్చుండి మనస్సును పరమాత్మపై నిలిపి ఇంద్రియములను స్వాధీనం చేసుకొని హృదయ శుద్ధి కొరకు ధ్యాన పద్ధతిలో శరీరం ఉంచి ధ్యానయోగమును సాధన చేయవలెను.

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః ।
సమ్ప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్ ॥ 13

ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ 14

 శరీరము, మెడ, శిరస్సు నిటారుగా నిలిపి మనస్సునూ, శరీరమునూ పక్కలకి పోనివ్వక నాసికను చూస్తూ, ప్రశాంత చిత్తంతో బ్రహ్మచర్యమును పాటిస్తూ, మనో నిగ్రహముతో పరమగతిన సమాధి స్థితిలో నుండవలెను.

శ్లో॥ యుఞ్జ న్నేవం సదాఽఽ త్మానం యోగీ నియతమానసః ।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి ॥ 15

అట్టి స్థితి అనగా మనోనిగ్రహ శీలి అయిన యోగి పరమానందరూపమైన మహా మోక్షాన్ని పొందుతున్నాడు.

అవ. మోక్షం దరి చేరనివ్వని
దుర్గుణాలను శ్రీభగవానుడు చెప్పట.

శ్లో॥ నాత్యశ్న త స్తు యోగోఽ స్తి న చైకాన్త మనశ్నతః ।
న చాతిస్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ 16

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ 17

ఓ అర్జునా! ఇష్టం వచ్చినట్టు భుజించిన వానికి, అసలు భుజింపనివానికి అట్లే అతిగా నిద్రించిన వానికి, అలాగే అసలు నిద్రపోనివానికి, ఎప్పుడూ మేల్కొని ఉండే వానికి మోక్షమెన్నటికీ లభింపదు. ఆహార విషయాలందూ, కర్మలయందూ మిత నిద్ర, మిత ఆహారములను పాటించిన వానికి సకల సంసార దుఃఖములు సమసిపోవును.

అవ. ధ్యాన యోగి లక్షణాలు చెప్పట.

శ్లో॥ యదా వినియతం చిత్త మాత్మన్యే వావతిష్ఠతే ।
నిస్స్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥18

మనస్సును నిగ్రహంతో ఉంచి పరమాత్మ యందే స్థిరముగా నిలిపినచో సర్వ భోగములపై వ్యామోహం పోతుంది. అటుల చిత్తమును వశము చేసుకున్నవాడు యోగసిద్ధిని పొందుతున్నాడు.

అవ. బ్రహ్మానంద స్థితి యోగికి ఎలా కలుగుతుందో చెప్పట.

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగ మాత్మనః ॥19



గాలి లేని చోట దీపం ఎలా నిశ్చలంగా నుండునో ఆత్మ ధ్యానము చేయుచున్న యోగి గాలిలేని చోట దీపం వలే నిశ్చలంగా నాయందే ఉండును.

శ్లో॥ య త్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్రచైవాత్మనాఽఽ త్మానం పశ్య న్నాత్మని తుష్యతి ॥ 20

సుఖ మాత్యన్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్ ।
వేత్తి యత్ర న చై వాయం స్థిత శ్చలతి తత్త్వతః ॥ 21

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽ పి విచాల్యతే ॥ 22

తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చ యేన యోక్తవ్యో యోగోఽ నిర్విణ్ణచేతసా ॥ 23

యోగాభ్యాసము చేత స్థిరమైన మనస్సు ఎక్కడ ఉపరతి పొందుతుందో ఎప్పుడు తన ఆత్మను ఆత్మ యందు ఆత్మ చేత దర్శించుకోగలుగుతున్నాడో అట్టివాడు సంతోషించుతున్నాడు.

అట్లే ఇంద్రియములకు అతీతమై, బుద్ధికి మహా సుఖము ఎలా వచ్చిందో గ్రహించిన వాడు యోగి తత్వమున విచిలితుడు కాడు.

అట్టి పరమానందమును పొందినవాడు ఏ లాభాన్నీ ఆశించడు. అట్లే మహా దుఃఖాన్ని పొందినా చలింపడు. అట్టి వాడే బ్రహ్మానంద స్థితిలోనున్న యోగి.

సంకల్పము వల్ల కలిగిన దుఃఖములనూ, కోరికలనూ వదిలేసి, మనసును స్థిరంగా ఆత్మయందు నిలిపి నిశ్చయ బుద్ధితో యోగము కొరకు అభ్యాసం చేయవలెను.

అవ. ధ్యానం ద్వారా ఆత్మని
ఎలా నిలపాలో శ్రీభగవానుడు చెప్పట.

శ్లో॥ సఙ్కల్పప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః ।
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః ॥ 24

శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చి దపి చిన్తయేత్ ॥ 25

 సంకల్పముల వల్ల కలిగే కోర్కెలను సకలము సంపూర్ణంగా విడిచి ఇంద్రియములను నిగ్రహించి, బుద్ధిని బాహ్య ప్రపంచము నుంచి మరల్చి ఆత్మ యందు విశ్రాంతి పొందవలెను. ఆత్మకు సంబంధం లేని విషయాల గూర్చి చింతించకుండా వుండవలెను.

శ్లో॥ యతోయతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరమ్ ।
తతస్తతో నియ మ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥ 26

 చంచలమైనదీ, నిలకడ లేనిదీ అగు మనస్సును సంచరింపచేయుట ఆపి దానిని పూర్తిగా ఆత్మ యందే నిలుప వలెను.

అవ. మహాసుఖాలని ఇచ్చే లక్షణములు చెప్పట.

శ్లో॥ ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్ ।
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥ 27

 ప్రశాంతమైన మనస్సుకలవాడూ, పాపాలు చేయని వాడూ, శాంతి పొందిన రజోగుణము కలవాడూ బ్రహ్మ భూతుడు. అట్టి యోగి ఉత్తమమైన సుఖాన్ని పొందుతాడు.

శ్లో॥ ఏవం యుంజన్నే సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖ మశ్నుతే ॥ 28

 అలా మనస్సును ఎల్లప్పుడూ ఆత్మ యందు నిలిపి, కల్మషం లేనివాడై బ్రహ్మసాక్షాత్కార రూపమైన పరమ సుఖాన్ని సులభంగా పొందుతున్నాడు.



శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ 29

 అట్టి యోగి అన్నింటి యందు సమదృష్టి కలిగి ఉంటాడు. సకల భూతములయందు తననీ, తన యందు సకల భూతములనూ చూచుచున్నాడు.

అవ. భగవంతుడు ఎలాంటి వారిపట్ల ప్రీతితో ఉంటాడో చెప్పట.

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
త స్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి ॥ 30

 సకల భూతముల యందు తనను, తన యందు సకల భూతములను చూచుచున్నాడో అట్టి వానిని నేను చూచుచున్నాను. అట్టి వాడు నన్ను చూచుచున్నాడు.

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥ 31

 సకలభూతముల యందు పరమాత్మనైన నన్ను తాదాత్మ్యంచెంది సేవించుతున్నాడో అలాంటి యోగి సమాధి నిష్ఠలో నున్నా, లేక మరో వ్యవహారంలోనున్నా నాయందే స్థితి కలిగి ఉంటాడు.

అవ. యోగి యొక్క మహోత్తరమైన లక్షణాలు.

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥ 32

 అర్జునా! ఏ యోగి సుఖదుఃఖములను తనకి జరిగితే కలిగే భావాన్ని ఇతరులకి కలిగితే కూడా తనవిగా భావిస్తాడో, సానుభూతితో చేయగలిగిన సహాయము చేస్తాడో అట్టివాడు యోగులలో ఉత్తముడు.

అవ. అర్జున ఉవాచ.

శ్లో॥ యో౽యం యోగస్త్వయాప్రోక్తస్సామ్యేన మధుసూదన ।
ఏతస్యాహం నపశ్యామి చఞ్చలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ **33**

చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదష్కరమ్ ॥ **34**

 అర్జునుడు పలికాడు.

ఓ మధుసూదనా! సమభావము గూర్చి నీవు ఉపదేశించినది అయిన ఆ యోగము యొక్క స్థిరమైన స్థితిని చంచలమైన మనస్సు వల్ల తెలుసుకోలేకపోతున్నాను.

శ్రీకృష్ణా! మనస్సు చంచలమైనది. బాధను కలిగించునది. బలమైనదీ, దృఢమైనది. అట్టి దాన్ని బంధించుట గాలిని బంధించినంత అసాధ్యమని నాకు అన్పిస్తోంది.

అవ. మనస్సును నిగ్రహించుకునే మార్గాలని చెప్పట.

శ్రీ భగవాన్ ఉవాచ.

శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ **35**

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యో౽వాప్తు ముపాయతః॥ **36**

 శ్రీకృష్ణుడు చెప్పెను.

ఓ మహాబాహూ! ఓ అర్జునా! నీవన్నట్టు మనస్సు చంచలమైనదే. దాన్ని వశపరుచుకొనుట కష్టమే. కానీ కౌంతేయా..... అభ్యాసము ద్వారా, వైరాగ్యము ద్వారా మనస్సును నిగ్రహింపవచ్చును.

అవ. మనసును అదుపులో పెట్టని వాని స్థితి గూర్చి అర్జునుడు అడుగుట.



అర్జున ఉవాచ.

శ్లో॥ అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥**37**

 శ్రీకృష్ణా! శ్రద్ధ గలవాడయినను నిగ్రహశక్తి లేని వానికి యోగముపై మనసు నిలువక మనసు వశమవక ఆత్మ సాక్షాత్కారము పొందక మరణించిన సాధకుడు ఏమగును.

అవ. మనసును అదుపుచేయనివాడు ఇహపరములకు ఉభయభ్రష్టుడవుతాడని చెప్పట.

శ్లో॥ కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ **38**

 హే మహాబాహో! అట్టి వాడు భ్రష్టుడు. అటూ ఇటూ కానివాడై చెదిరిన మేఘము వలే అధోగతి చెందును. ఇహలోకానికీ, పరలోకానికీ .... రెంటికీ చెడ్డ రేవడవుతాడు.

శ్లో॥ ఏతన్మ సంశయం కృష్ణ ఛేత్తు మర్హ స్య శేషతః ।
త్వ దన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥**39**

 ఓ శ్రీకృష్ణా! నా సందేహములను పూర్తిగా తొలగించుటకు నీవే సమర్థుడవు. నా సంశయము తొలగించుటకు నిన్ను మించిన వారెవ్వరూ లేరు.

శ్రీ భగవాన్ ఉవాచ.

శ్లో॥ పార్థ నై వేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే ।
న హి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి ॥ **40**

 భగవానుడు పలికెను.

అర్జునా! ఓ పార్థా! యోగభ్రష్టుడు ఈ లోకములో గానీ, పరలోకంలో గానీ అధోగతి పాలవ్వడు. భగవంతుని ప్రీతికై కర్తవ్య

కర్మలను ఆచరించిన వాడు దుర్గతి పాలు కాడు. పుణ్యాత్ముడైన వాడు దుర్గతి చెందదు.

*అవ. యోగ భ్రష్టుడు దేహాన్ని వదిలిననాడు మళ్ళీ ఎలా జన్మిస్తున్నాడో చెప్పట.*

**శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః ।**
**శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥ 41**

యోగ భ్రష్టుడు పుణ్యాత్ములు అనుభవించే లోకాలను పొంది అక్కడ అనేక సంవత్సరములు ఉండి పిదప సదాచార సంపన్నమైన శ్రీమంతుల ఇంట జన్మిస్తున్నాడు.

**శ్లో॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।**
**ఏత ద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥ 42**

అటుల కానీ లేదా జ్ఞానవంతులైన యోగుల కులమున జన్మిస్తున్నాడు. ~~ఈ~~ లోకమున అట్టి జన్మము కలుగుట మిక్కిలి దుర్లభము.

**శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।**
**యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన ॥ 43**

అర్జునా! అటుల యోగి వంశమున జన్మించిన వాడు పూర్వ జ్ఞానబుద్ధితో సంస్కారము పొందును. ఓ కురుపుత్రా! అట్టి వాడు మళ్ళీ పరమాత్మ ప్రాప్తికై క్రిందటి జన్మ కంటే ఎక్కువగా సాధనము చేయును.

*అవ. యోగశక్తి గూర్చి పరమాత్మ వివరించుట.*

**శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।**
**జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ 44**



ధనవంతుల గృహంలో జన్మించినవాడు ప్రయత్నం లేకున్నా పూర్వ జన్మ ప్రభావం వల్ల యోగము వైపు వెళుతున్నాడు. వేదములలో చెప్పిన కర్మానుష్ఠాన ఫలమును మనుజుడు దాటుతున్నాడు.

**శ్లో॥ ప్రయత్నా ద్యతమాన స్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।**
**అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్ ॥ 45**

నిత్య ప్రయత్నము చేసే యోగి పాపాల నుంచి విముక్తుడగును.

ముందు జన్మ యందు చేసిన సిద్ధిని పొంది ఆపై పాపరహితుడై బ్రహ్మ సాక్షాత్కారమును పొంది పరమ పదము చేరుతున్నాడు.

*అవ. యోగి యొక్క విశిష్టతలను శ్రీభగవానుడు చెప్పట.*

**శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।**
**కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భ వార్జున ॥ 46**

తపము చేయువాని కంటే, జ్ఞానవంతుల కంటే, కర్మలు చేయువాని కంటే ఉత్తముడు యోగి. కాన అర్జునా! నీవు యోగివికా.

*అవ. అట్టి యోగులలో కూడా తనకెవరు ప్రీతిగల వారో కూడా శ్రీభగవానుడు తెలవిస్తున్నాడు.*

**శ్లో॥ యోగినా మపి సర్వేషాం మద్గతే నా న్తరాత్మనా ।**
**శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమోమతః ॥ 47**

ఎవడైతే నా యందు సదా మనస్సును నిలిపి శ్రద్ధతో సేవించుచున్నాడో అలాంటి వాడు యోగులందరి కంటే ఉత్తముడు. పరమశ్రేష్ఠుడు. సర్వశ్రేష్ఠుడు. ఇది నా నిశ్చితాభిప్రాయం అర్జునా!

ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే
శ్రీకృష్ణార్జునసంవాదే ఆత్మసంయమయోగోనామ
షష్ఠో౽ ధ్యాయము
ప్రథమషట్కము సంపూర్ణము

**శత్రువుపై విజయం కొరకు**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ సుఖ మాత్యన్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్ ।
వేత్తి యత్ర న చై వాయం స్థిత శ్చలతి తత్త్వతః ॥
*6వ అధ్యాయము - 21వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 150, జప సంఖ్య - ఒకటిన్నర లక్ష*

**అపార భక్తి కొరకు**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
త స్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి ॥
*6వ అధ్యాయము - 30వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 150, జప సంఖ్య - 5 లక్షల పదివేలు*

**మహాజయమునకై**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కిఞ్చి దపి చిన్తయేత్ ॥
*6వ అధ్యాయము - 25వ శ్లోకమును*
ఇన్ని రోజులు అని మనసులో అనుకొని చేయగలిగినన్ని సార్లు చేయాలి.

శ్లో॥ యతోయతో నిశ్చరతి మన శ్చఞ్చల మస్థిరమ్ ।
తతస్తతో నియ మ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥
*6వ అధ్యాయము - 26వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 26, జప సంఖ్య - 13 వేలు*



**ద్వేష భావము పోవుట కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ బన్ధురాత్మా౽ ౽ త్మన స్తస్య యే నాత్మై వాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥
*6వ అధ్యాయము - 6వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 21, జప సంఖ్య - 21 లక్షల పదివేలు*

**ఋణవిమోచనము కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానో౽ పి స యోగీ మయి వర్తతే ॥
*6వ అధ్యాయము - 31వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 40, జప సంఖ్య - 108*



# విజ్ఞానయోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- ★ *ఈ విజ్ఞాన యోగములో 1వ శ్లోకము నుంచి 7వ శ్లోకము వరకు విజ్ఞాన విషయములు.*
- ★ *8వ శ్లోకము నుంచి 12వ శ్లోకము వరకూ సమస్త ప్రకృతి నందూ, పదార్థముల నందూ భగవంతుని వ్యాప్తి వర్ణనము.*
- ★ *13వ శ్లోకము నుంచి 19 శ్లోకము వరకూ చతుర్విద భక్తుల ప్రశంస.*
- ★ *20వ శ్లోకము నుంచి 23వ శ్లోకము వరకూ ఇతర దేవతల ఉపాసన గూర్చి.*
- ★ *24వ శ్లోకము నుంచి 30వ శ్లోకము వరకూ భగవంతుని గూర్చి గ్రహించిన వారి మహిమలు.*



# విజ్ఞానయోగః

*అవ. పరమాత్మను ఎలా దర్శించగలరో*

*శ్రీ భగవానుడు చెప్పట.*

*శ్రీభగవాన్ ఉవాచ.*

***శ్లో॥ మ య్యాసక్తమనాః పార్థ యోగం యుఞ్జ న్మదాశ్రయః ।***
***అసంశయం సమగ్రం మాం యథాజ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1***

 *ఓ పార్థా! మహా భక్తి ప్రపత్తులతో నాయందు ఆసక్తమైన మనసు కలవారై నన్నే ఆశ్రయించుచున్నారో వారు నన్ను ఎలా తెలుసుకొనగలుగుతున్నారో వినుము.*

***శ్లో॥ జ్ఞానం తేஉహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః ।***
***యద్జ్ఞాత్వా నేహ భూయోஉ న్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే ॥2***

 *దేన్ని తెలుసుకోవటం ద్వారా ఈ లోకంలో మరేదీ తెలుసుకొనదగినిది ఉండదో విజ్ఞాన సహితంగా తత్త్వజ్ఞానమును తెలిపెదను వినుము.*

అవ. పరమాత్మ తత్త్వాన్ని గ్రహించేవారు అతికొద్ది మాత్రమేనని వివరించుట.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే ।
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥ 3

వేలకొలది మనుష్యులలో ఎవ్వరో ఒక్కరు మాత్రమే నా గూర్చి తెలుసుకొనగలుగుతున్నాడు. అలా ప్రయత్నించినవాడు సిద్ధి పొంది నన్ను యదార్థముగా తెలుసుకొనుచున్నాడు.

అవ. భగవంతుడు ఎన్ని రూపాలతో ఉంటాడో వివరించుట.

శ్లో॥ భూమి రాపోஉనలో వాయుః ఖం మనో బుద్ధి రేవచ ।
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ 4

భూమీ, నీరూ, నిప్పు, గాలీ, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అను నా ప్రకృతి ఎనిమిది విధాలుగా ఉండును.

అవ. పరమాత్మ ఎనిమిది విధములైన ప్రకృతి గూర్చి చెప్పుట.

శ్లో॥ అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ 5

అర్జునా! భూమీ, నీరూ, నిప్పు, వాయువూ, ఆకాశమూ, మనస్సూ, బుద్ధీ, అహంకారమూ అను ఎనిమిది విధాలైన ప్రకృతినే 'అపరా' ప్రకృతి అంటారు. దానికంటే వేరైనదీ సంపూర్ణ జగత్తును ధరించినదీ అయిన మరో ప్రకృతి కలదు.

అదియే 'పరా ప్రకృతి'. ప్రాణులకు జీవరూపమదే. అట్లే జగత్తుకు ఆధారమూ అదే. అలాగే మహా శ్రేష్ఠమైనది. దాన్ని గూర్చి వినుము.

అవ. ప్రకృతికి తాను అతీతుడనని వచించుట.



శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ 6

సకల ప్రాణులు ఈ రెండు విధానాలైన ప్రకృతుల వల్లే జన్మిస్తున్నారు. ఈ జగత్తు పుట్టుకకూ, ప్రళయమునకూ నేనే కారణము.

అవ. జగత్తుకి హేతువు ఆధారములతో పాటు జగత్తు అంతా వ్యాపించి ఉన్నానని భగవానుడు చెప్పుట.

శ్లో॥ మత్తః పరతరం నాన్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ 7

ఓ ధనుంజయా! నాకన్నా శ్రేష్ఠమైనది ఏదీ లేదు. దారమందు మణులు కూర్చబడినట్టు జగత్తులోని వస్తువులన్నీ సూత్రమున సూత్రమణుల వలే నా యందు కూర్చబడియున్నవి.

శ్లో॥ రసోஉహ మప్సు కౌన్తేయ ప్రభాஉస్మి శశిసూర్యయోః ।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8

అర్జునా... నీటి యందు సారము నేనే. చంద్రుని లోని, సూర్యునిలోని ప్రకాశము నేనే. వేదాలలో ఉండే ఓంకారమూ, ఆకాశాన శబ్దమూ, మనుష్యులలో పరాక్రమమూ నేనే.

శ్లో॥ పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు ॥ 9

పృథ్వియందు సువాసనా, అగ్నిలోని తేజస్సూ, సకల భూతముల యందు జీవమూ, తపస్సు చేయు తాపసులలో తపస్సూ నేనే.

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజస్తేజస్వినా మహమ్ ॥ 10

ఓ పార్థా! సమస్త జీవులకూ మూల కారణం నేనే. బుద్ధిమంతులలో బుద్ధినీ నేనే. తేజోవంతులలో తేజస్సు నేనే.

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥ 11

అర్జునా! బలవంతులలో కామరాగ రహితమైన బలమును నేనే. సకల ప్రాణులలో నున్నదీ, ధర్మ విరుద్ధం కానిదీ అయిన కామాన్నీ నేనే.

అవ. ఈ జగత్తునకు మూలము తానేనని చెప్పట.

శ్లో॥ యేచైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే ।
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ 12

సత్త్వ, రజో, తామస భావములన్నీ నా నుంచే కలుగుతున్నాయి. కానీ అర్జునా! వాస్తవముగా అందులో నేను గానీ, నాలో అవి గానీ లేవు. అనగా అట్టి వాటికి త్రిగుణాతీతుడను.

అవ. అంతటి పరమాత్మను మనుజులు తెలుసుకోవటానికి కారణములు చెప్పట.

శ్లో॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్ ।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్ ॥13

త్రివిధములైన గుణాలచేత అనేక వికార స్వభావముల చేత సకల ప్రపంచమూ మోహము చెందుతున్నది. ఆ భ్రమలో వాటికంటే విలక్షణుడిగా వినాశనము లేని వాడయిన నన్ను గ్రహించలేకపోవుచున్నది.

అవ. మాయా బంధముల గూర్చి వివరించుట.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా ।
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే ॥ 14



మహా దైవ సంబంధమైనదీ, త్రిగుణస్వరూపమైనదీ అయిన నా మాయను దాటుట మనుజులకు సాధ్యపడుట లేదు. అయితే నన్ను సేవించిన వారికీ, ఆశ్రయించిన వారికీ అది దాటుట సులభం.

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥ 15

పాపాత్ములూ, మూఢులూ, మాయలో చిక్కుకున్న వారూ, రాక్షసప్రవృత్తి కలవారూ, జ్ఞానంలేనివారూ నన్ను ఆశ్రయించుట లేదు.

అవ. భక్తుల్లో వివిధములైన వారి గూర్చి చెప్పట.

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ 16

ఓ భరతశ్రేష్ఠా! నాలుగు విధాలైన భక్తులు మాత్రమే నన్ను భజిస్తున్నారు. వారు ఆపదలున్నవారూ, జ్ఞానముపై శ్రద్ధ కలవారూ, సంపదలను ఆశించువారూ, ఇంకా జ్ఞాని.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే ।
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమ ప్రియః ॥17

ఈ చతుర్విధ భక్తులలో నిత్య నిరంతరము ఏక భావంతో పరమాత్మపై మహాభక్తి కలవాడు జ్ఞాని అవుతున్నాడు. అట్టి వాడు నాకు మిక్కిలి ఇష్టమైనవాడు. నాకు మిక్కిలి ప్రీతికరుడు.

శ్లో॥ ఉదారా స్సర్వ ఏ వైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।
ఆస్థిత స్సహి యుక్తాత్మా మా మే వానుత్తమాం గతిమ్ ॥ 18

నా భక్తులంతా గొప్పవారే. అయినా జ్ఞాని మాత్రమే నా ఆత్మ స్వరూపుడిగా నా నిశ్చయము. దానికి కారణము అతను నన్నే పరమగతిగా భావించి సేవిస్తున్నాడు.

*అవ. అంతటి వారు ఈ జగత్తులో అరుదని భగవానుడు చెప్పట.*

శ్లో॥ బహూనాం జన్మనా జ్ఞానవా మంతే న్మాం ప్రపద్యతే ।
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదర్లభః ॥ 19

ఎన్నో జన్మల పుణ్య ఫలం వల్ల అప్పటి కర్మల వల్ల జ్ఞాని చివరిదయిన జన్మలో జగత్తు అంతా నేనే అనే భావంతో జ్ఞానంతో నన్ను ఆశ్రయిస్తాడు. అట్టి వారు ~~ఈ~~ లోకంలో అరుదు.

శ్లో॥ కామై స్తై స్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽ న్యదేవతాః ।
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యానియతా స్స్వయా ॥ 20

మనుజులు తమ తమ స్వభావముల వల్లా, కోరికల వల్లా జ్ఞానమును పోగొట్టుకుని వారి మనస్సు అడిగే కోరికలను దానికి తగ్గ దేవతలను ఆరాధిస్తారు. ఆ దేవతలనే చేరుతున్నారు.

శ్లో॥ యోయోయాంయాంతనుంభక్తఃశ్రద్ధయార్చితు మిచ్ఛతి ।
తస్యతస్యాచలాంశ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్ ॥ 21

అలాంటి భక్తుడు ఏయే దేవతా స్వరూపమును భక్తి శ్రద్ధలతో పూజించి కోరికలు కోరుతున్నాడో, అట్టి వానికి ఆయా దేవతలపై శ్రద్ధను నేను కలుగ చేస్తున్నాను.

*అవ. ఏ దేవతా రూపులని పూజించినా, అనుగ్రహించేది మాత్రము తానే అని చెప్పట.*

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్త స్త స్యారాధన మీహతే ।
లభతేచతతఃకామా౯ మయైవ విహితా౯ హితాన్ ॥ 22

అట్టి భక్తుడు ఆయా దేవతలను ఆరాధిస్తూ తత్ఫలితంగా నేను కలుగ చేసే అనుగ్రహం ద్వారా కామితార్థాలనే వాటిని అతడు ఆయా దేవతల నుంచి పొందుతున్నాడు.



*అవ. అటుల ఇతర దేవతలని కాక తనని సేవించినవారికే పరమగతి లభిస్తుందని చెప్పట.*

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్ ।
దేవా౯ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తిమామపి ॥23

అల్పబుద్ధులు పొందే ఫలితాలు అశాశ్వతాలు. అన్య దేవతలను పూజించే వాళ్ళు వాళ్ళనే చేరుతారు. కానీ పరమాత్మ అయిన నన్ను సేవించే భక్తులు మాత్రం నన్నే పొందుతారు.

*అవ. మనుజులు తన లీలా వినోదం గూర్చి తెలుసుకోలేక పోవటానికి కారణములు.*

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్య న్తే మా మబుద్ధయః ।
పరం భావ మజానన్తో మ మావ్యయ మనుత్తమమ్ ॥ 24

అవివేకులు శాశ్వతమైనదీ, సర్వోత్తమమైనదీ అయిన నా మహా స్వరూపాన్ని తెలుసుకోలేక, గ్రహించలేక నన్ను సాధారణ మనుజునిలా తలుస్తారు.

*అవ. తనిని మామూలు వ్యక్తిగా నమ్ముతున్నారు కొందరు. వారి స్వభావము గూర్చి చెప్పట.*

శ్లో॥ నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయా సమావృతః ।
మూఢోఽ యం నాభిజానాతి లోకో మామజ మవ్యయమ్ ॥ 25

మహాయోగము చేత కప్పబడి వుండే నేను అందరికీ కనిపించను.

కాగా గోచరించకపోవటంతో నన్ను జన్మరహితుడిగా, పరమాత్మునిగా, శాశ్వతుడిగా తెలుసు కోలేరు.

*అవ. జరిగిన కాలం, జరుగుతున్న కాలం, జరగబోవు కాలం తనకి తెలుసునని పరమాత్మ చెప్పట.*

శ్లో॥ వే దాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥ ***26***

 హే అర్జునా! భూత భవిష్యవర్తమాన కాలాలన్నీ నేను ఎరుగుదును. సకల జీవులకి సంబంధించిన విషయములన్నీ నాకు తెలియును. కానీ నన్ను భక్తి శ్రద్ధలతో తప్ప ఎవ్వరూ ఎరుగలేరు.

శ్లో॥ ఇచ్ఛా ద్వేషసము త్థేన ద్వన్ద్వమోహేన భారత ।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప ॥ ***27***

 అర్జునా! పుట్టినప్పుడే మనుజులు ఇష్టాయిష్టములు, అనురాగ ద్వేషాలు కలిగి ఉంటారు. వాటివల్ల కలిగే సుఖదుఃఖముల మోహంలోపడి మనుజులు అజ్ఞానులవు తున్నారు.

*అవ. అజ్ఞానమనే మహా చీకటిని ఎలా పారద్రోలాలో చెప్పట.*

శ్లో॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥ ***28***

 పుణ్యకార్యాలను చేసి అనేక పాపాలను పోగొట్టుకున్నవారు మోహాల నుంచి అనగా సుఖదుఃఖాల రూపమైన మోహం నుంచి విముక్తులై నిశ్చల భక్తితో నన్ను సేవిస్తున్నారు.

*అవ. స్థిరభావాలతో భక్తి శ్రద్ధలతో తనను సేవిస్తే కలిగే ఫలమును చెప్పట.*

శ్లో॥ జరామరణమోక్షాయ మా మాశ్రిత్య యతన్తి యే ।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మచాఖిలమ్ ॥ ***29***

 ఎవరైతే ముసలితనమూ, మృత్యువుల నుంచీ ఇంకా ముక్తి పొందటానికి నన్ను ఆశ్రయిస్తున్నారో అట్టి వారు పరబ్రహ్మ తత్త్వాన్నీ, సకల కర్మలనూ తెలుసుకుంటున్నారు.



శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః ॥***30***

 అధిభూత, అధిదైవ, అధి యజ్ఞములను నేనే అని ఎవరు గ్రహించగలుగుతారో అట్టి వారు వారి మరణ కాలమందైనను నన్ను తెలుసుకొని నన్ను చేరుదురు.

***ఇతి భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విజ్ఞానయోగో నామ సప్తమోఽధ్యాయః***

## మొండి వ్యాధులు తగ్గు ముఖము పట్టుట కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ మత్తః పరతరం నాన్య త్కిఞ్చి దస్తి ధనఞ్జయ ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥

***7వ అధ్యాయము - 7వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 40, జప సంఖ్య - 108***

## మనోనిగ్రహం కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః ।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః ॥

***7వ అధ్యాయము - 30వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 40, జప సంఖ్య - 108***



# అక్షరపరబ్రహ్మ యోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- ★ *అక్షర పరబ్రహ్మ యోగంలో 1వ శ్లోకం నుంచి 7వ శ్లోకం వరకూ బ్రహ్మము, కర్మములతో పాటు ఆధ్యాతిక విషయములు.*
- ★ *8వ శ్లోకం నుంచి 16వ శ్లోకం వరకూ ప్రణవోపాసన ఫలితము.*
- ★ *17వ శ్లోకం నుంచి 19వ శ్లోకం వరకు సృష్టి మరియు ప్రళయముల గూర్చి.*
- ★ *20వ శ్లోకం నుంచి 22వ శ్లోకం వరకూ భగవంతుని సనాతన స్వరూపాలు.*
- ★ *23వ శ్లోకం నుంచి 28వ శ్లోకం వరకూ యోగము యొక్క మహిమలు.*



# అక్షరపరబ్రహ్మ యోగః

*అవ. ఆదిదైవము గూర్చి అర్జునుడు భగవానుని ప్రశ్నించుట.*

అర్జున ఉవాచ.

**శ్లో॥ కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।**
**అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే ॥ 1**

 అర్జునుడు పలికెను. *శ్రీకృష్ణా! పురుషోత్తమా!* బ్రహ్మ అనగా ఏమిటి? అట్లే ఆధ్యాత్మికమంటే ఏమిటి? కర్మ మనగా ఏది? అధిభూతము చెప్పేది ఏది? అధి దైవమనగా దేనిని అంటారు.

**శ్లో॥ అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన ।**
**ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥ 2**

 శ్రీకృష్ణా! అధియజ్ఞమని అనగానేమి? ఈ శరీరమునందు ఎటుల తెలుసుకొనగలము. మనస్సును పరమాత్మ యందు లగ్నము చేసిన యోగులు ప్రాణ ప్రయాణ దశయందు నిన్నేల తెలుసుకొనగలరు. నాకు తెలియ చెప్పుము.

అవ. అర్జునుడి సందేహాలకి భగవానుడు సమాధానం చెప్పట.

శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో॥ అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽ ధ్యాత్మ ముచ్యతే ।
భూతాభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥ 3

శ్రీ కృష్ణుడు పలికెను. అర్జునా! బ్రహ్మమనగా సర్వశ్రేష్ఠుడు. నాశరహితమైనదే బ్రహ్మమంటారు. ఆత్మ పరమాత్మ తత్త్వాన్ని ఆధ్యాత్మము అందురు. సకల జీవుల పుట్టుకకూ, ఉనికికీ కారణమైన యజ్ఞాది రూపము కర్మము.

శ్లో॥ అధిభూతం క్షరోభావః పురుష శ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽ హ మే వాత్ర దేహే దేహభృతాం వర ॥4

అర్జునా! ఈ దేహంనందు నశించే స్వభావము కలది అధిభూతము. పురుషుడు అధిదైవము. మహాశ్రేష్ఠా అర్జునా! అందరి శరీరాల్లోని అంతర్యామిని నేనే. అధి యజ్ఞము అను వాసుదేవుడనూ నేనే.

అవ. అవసాన కాలమునందు పరమాత్మను ఎలా చేరాలో చెప్పట.

శ్లో॥ అన్త కాలేచ మామేవ స్మర న్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి సమద్భావం యాతినాస్త్యత్ర సంశయః ॥ 5

అవసాన కాలమునందు పరమాత్మ అయిన నన్నే స్మరిస్తూ దేహాన్ని విడిచిన వాడు నన్నే పొందుతున్నాడు. అట్టి దానిలో ఎట్టి సంశయమూ లేదు.

అవ. దేహం వదులునప్పుడు ఏ భావాలతో ఉంటారో
అదే రూపంతో జన్మిస్తారని చెప్పట.

శ్లో॥ యంయం వాపి స్మరన్ భావం త్యజ త్యన్తే కళేబరమ్ ।
తం తమే వైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥ 6



ఓ అర్జునా! మరణ సమయమున మనుజుడు ఏ భావాలతో దుఃఖిస్తూ జీవయాత్ర చాలిస్తున్నాడో అట్టివాడు అదే భావాలతో మళ్ళీ అలాంటి రూపాన్ని పొందుతున్నాడు.

శ్లో॥ తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్యచ ।
మ య్యర్పితమనోబుద్ధిర్మామే వైష్య స్యసంశయః ॥ 7

కాన అర్జునా! నీవు సర్వవేళల నన్నే స్మరించు. నీ కర్తవ్యాన్ని నీవు చేయుము. అలాగే నీ మనస్సునూ, బుద్ధినీ నా యందు ఉంచు. నీవు నన్ను పొందగలవు. ఇందు సంశయము లేదు.

అవ. పరంధాముడిని దర్శించేందుకు
చెయ్యాల్సిన ధ్యానవిధానము.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చిన్తయన్ ॥ 8

అర్జునా! అభ్యాస యోగము పూని వేరే విషయాల మీదకు మనస్సును పోనివ్వక నిరంతరము పరమ పురుషుడైన పరమాత్మను ధ్యానించేవాడు పరమగతిని ఇచ్చే పరంధాముడ్ని పొందగలడు.

అవ. నిశ్చలస్థితే తనని పొందే మార్గము
అని భగవానుడు చెప్పట.

శ్లో॥ కవిం పురాణ మనుశాసితారమ్
అణో రణీయాంస మనుస్మరేద్యః ।
సర్వస్య ధాతార మచిన్త్యరూపమ్
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥ 9
ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।

భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యమ్ ॥ 10

సకలం తెలిసినవాడూ, పురాతనమైన వాడూ, అందరినీ శాసించేవాడూ, అణువుకంటే చిన్నదైనవాడూ, అందరినీ పోషించు వాడూ, సూర్యునివలే నిత్య ప్రకాశుడూ, అజ్ఞానమునూ, అంధకారమునూ పోగొట్టువాడైన పరమేశ్వరుణ్ణి అపస్మారక దశలో మనస్సునందు నిశ్చలంగా ఉంచుకొని భక్తి, యోగ భావములతో కనుబొమ్మల మధ్య ప్రాణ వాయువును నిలిపి ధ్యానించినవాడు ఆ దివ్యపురుషుణ్ణి పొందుతాడు.

అవ. మహామహులు పరమపదం ఎలా చేరుతున్నారో చెప్పట.

శ్లో॥ య దక్షరం వేదవిదో వదన్తి
విశన్తి యద్యతయో వీతరాగాః ।
య దిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి
తత్తేపదం సఙ్గ్రహేణ ప్రవక్ష్యే ॥ 11

వేదాల అర్థం, పరమార్థం తెలిసినవారు చెప్పేదీ, కామక్రోదాదులు జయించిన సన్యాసులూ, యోగులూ చేరేదీ, బ్రహ్మచర్యాన్ని పాటించేవారు చేరేదీ అయిన పరమపదం గూర్చి నీకు వివరిస్తాను.

అవ. ధ్యానం ద్వారా పరమగతిని ఎటుల పొందవచ్చో శ్రీభగవానుడు వివరిస్తున్నాడు.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥ 12
ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజ్ఞ దేహం సయాతి పరమాం గతిమ్ ॥ 13



ఇంద్రియాలన్నింటినీ నిగ్రహించి, మనస్సును హృదయము నందు నిలిపి, ప్రాణాన్ని శిరస్సులో ఉంచి ఆత్మ యోగంను అభ్యసిస్తూ, పరబ్రహ్మ వాచకమైన ఓంకారమును ఉచ్ఛరిస్తూ, నన్నే ధ్యానిస్తూ ఎవడైతే దేహమును విడిచి పెడుతున్నాడో అట్టివాడు పరమగతిని అనగా మోక్షమును పొందుతున్నాడు.

అవ. ఎట్టి వానికి తను సులభవశుడో వివరించుట.

శ్లో॥ అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
త స్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ 14

ఓ పార్థా! ఎవడు అనన్య చిత్తముతో నిరంతరము నన్నే స్మరించుచున్నాడో, అట్టి స్థిర నిశ్చల చిత్తముగల యోగికి నేను సులభుడను.

అవ. ఎలాంటి లోకాలని చేరినవారికి జన్మ ఉంటుందో చెప్పట.

శ్లో॥ మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః ॥ 15

పరమపదము చేరిన మహాత్ములు నన్ను పొందిన వారై దుఃఖములనూ, పునర్జన్మలనూ పొందరు.

శ్లో॥ ఆబ్రహ్మభవనా ల్లోకాః పునరావర్తినోஉర్జున ।
మా ముపేత్యతు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥ 16

అర్జునా.... బ్రహ్మలోకము వరకూ ఉన్న అనేక లోకములను చేరిన వారంతా మళ్ళీ జన్మిస్తున్నారు. నన్ను పొందినవారు మాత్రం పునర్జన్మ ఎత్తుటలేదు.

అవ. కాలతత్త్వమును చెప్పట.

శ్లో॥ సహస్రయుగపర్యన్త మహ ర్య ద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగసహస్రాన్తాం తేஉహోరాత్రవిదోజనాః ॥ 17

మనుజుల వేయి యుగములు బ్రహ్మదేవునికి పగలు. అట్లే రాత్రి వేయి యుగములు. దాన్ని గ్రహించిన వారు కాలతత్త్వమును తెలుసుకున్నవారు.

*అవ. సకల ప్రాణికోటి పుట్టుట, గిట్టుటల గూర్చి వివరించుట.*

**శ్లో॥ అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవ న్త్యహరాగమే ।**
**రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రై వావ్యక్తసంజ్ఞికే ॥ 18**

బ్రహ్మదేవునికి పగలు ప్రారంభమయినప్పుడు ప్రకృతి నుంచి సమస్తము పుడుతున్నాయి. మరల రాత్రి అయినంతనే ఆ ప్రకృతిలోనే అన్నీ లీనమవుతున్నాయి.

*అవ. పరమాత్మను తెలుసుకోలేని వారు మళ్లీ మళ్లీ జన్మిస్తున్నారని చెప్పట.*

**శ్లో॥ భూతగ్రామ స్స ఏ వాయం భూత్వాభూత్వా ప్రలీయతే ।**
**రాత్ర్యాగమేఽ వశః పార్థ ప్రభవ త్యహరాగమే ॥ 19**

అర్జునా! సకల భూతములు బ్రహ్మదేవునకు పగలప్పుడు పుడుతున్నాయి. బ్రహ్మదేవునికి రాత్రికాగానే లయమవుతున్నాయి. ఈ విధంగా పగలు రాగానే కర్మల ప్రకారం మళ్ళీమళ్ళీపుడుతున్నాయి.

**శ్లో॥ పరస్తస్మాత్తుభావోఽ న్యోఽ వ్యక్తోఽ వ్యక్తాత్సనాతనః ।**
**య స్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ 20**

ప్రకృతికంటే వేరైనదీ, అతీతమైనదీ, అగోచరమైనదీ, శాశ్వతమైనదీ, పురాతనమైనదీ అయిన పరబ్రహ్మ తత్త్వము ప్రాణులన్నీ నశించినా నశించదు. (అనగా ఆ పరమ పురుషుడు నశించడు.)

*అవ. పరమపదం స్థానాల్లో మలిజన్మ ఉండదని భగవానుడు వచించుట.*



**శ్లో॥ అవ్యక్తోఽ క్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిమ్ ।**
**యం ప్రాప్య న నివర్తన్తే త ద్ధామ పరమం మమ ॥21**

అగోచరుడనీ, శాశ్వతుడనీ చెప్పే పరమాత్మనైన నన్ను పరమగతిగా భావించినవారు నాకు నిలయమైన పరమ పదాన్ని పొంది ఇక జన్మన్నది పొందజాలరు.

*అవ. పరమాత్మను పొందే విధం.*

**శ్లో॥ పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా ।**
**య స్యాన్తస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్॥ 22**

అర్జునా... సకల భూతలములనూ తనలో ఉంచుకొని సకల లోకాల్లోనూ వ్యాపించి ఉన్న ఆ పరమాత్మను మహా భక్తి ప్రవత్తులతోనే పొందవచ్చు.

*అవ. దేహ యాత్ర ఏ సమయంలో రావటం ద్వారా జన్మ జన్మల ప్రశక్తి ఉంటుందని చెప్పట.*

**శ్లో॥ యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః ।**
**ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥ 23**

అర్జునా! యోగులు ఏ సమయంలో దేహమును విడిస్తే మళ్ళీ జన్మింపరో, ఏ వేళ దేహమును వదిలితే మళ్ళీ జన్మిస్తారో వినుము.

**శ్లో॥ అగ్నిర్జ్యోతి రహ శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్ ।**
**తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥ 24**

అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షము, ఆరునెలల ఉత్తరాయణము వీటి యందు దేహమును విడిచిన బ్రహ్మోపాసకులు బ్రహ్మప్రాప్తిని పొందుతున్నారు. వారు కొలిచిన దేవతలు వారిని పరమపదానికి చేరుస్తున్నారు.

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్ ।
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే ॥ 25

ధూమము, రాత్రీ, కృష్ణపక్షము, దక్షిణాయణమైన ఆరుమాసాలకాలము నందు దేహమును వదిలినవారు చంద్ర లోకాదులను చేరి తిరిగి జన్మిస్తున్నారు.

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే ।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతేపునః ॥ 26

అర్జునా! పై రెండు కాలములు శుక్ల, కృష్ణ మార్గములు అనీ లేదా పితృ, దేవయాన మార్గాలనీ పండితులు చెబుతారు. అవి సనాతనములు.

దేవయాన మార్గంలో దేహాన్ని విడిచిన వాడు క్రమ ముక్తినీ, పితృయాన మార్గమున వెళ్ళిన వారు తిరిగి మళ్ళీ వారి కర్మ వశముల ప్రకారం జన్మిస్తారు.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన ।
తస్మా త్స ర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ 27

పార్థా! పై రెండు మార్గాలు తెలిసిన యోగి ఎట్టి మోహములోనూ పడడు. కాన నీవు నిరంతరము యోగివి కమ్ము.

అవి. వేటి వల్ల పరమపదం అందుతుందో చెప్పట.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు య త్పుణ్యఫలం ప్రదిష్టమ్ ।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరంస్థాన ముపైతి చాద్యమ్ ॥ 28



ఈ మహత్యమును గ్రహించిన యోగి వేదముల వల్లా, యజ్ఞముల వల్లా, తపస్సు వల్లా, దానము వల్లా కలిగే మహా పుణ్యాలను దాటిపోతున్నాడు. పరమపదమును చేరుతున్నాడు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే అక్షరబ్రహ్మయోగోనామ**
**అష్టమోఽ ధ్యాయః**

## శత్రువుపై విజయము కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చిన్తయన్ ॥

*8వ అధ్యాయము - 8వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 50,*
*జప సంఖ్య - ఒకటిన్నర లక్ష*



# రాజవిద్యారాజగుహ్య యోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- ★ *రాజవిద్యారాజగుహ్య యోగములో 1వ శ్లోకము నుంచి 6వ శ్లోకము వరకూ జ్ఞానవిషయములు.*
- ★ *7వ శ్లోకము నుంచి 10వ శ్లోకము వరకూ జగత్తు ఉత్పత్తి.*
- ★ *11వ శ్లోకము నుంచి 15వ శ్లోకము వరకూ భగవంతుని వ్యతిరేకించిన వారి గూర్చి.*
- ★ *16వ శ్లోకము నుంచి 19వ శ్లోకము వరకూ భగవంతుని వర్ణనము.*
- ★ *20వ శ్లోకము నుంచి 25వ శ్లోకము వరకూ ఉపాసనల ఫలములు.*
- ★ *26వ శ్లోకము నుంచి 34వ శ్లోకము వరకూ నిష్కామ భక్తి యోగాలు.*



# రాజవిద్యారాజగుహ్యయోగః

*అవ. అర్జునుడికి బ్రహ్మ జ్ఞానమును శ్రీ భగవానుడు చెప్పట.*

*శ్రీ భగవాన్ ఉవాచ.*

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వామోక్ష్యసేஉ శుభాత్ ॥ 1

 శ్రీ భగవానుడు చెప్పెను.

ఓ అర్జునా... నీవు దోషములు లేనివాడవు. కాన నీవు దేనిని తెలుసుకొనుట ద్వారా అశుభమును వీడెదవో అట్టి రహస్య జ్ఞానమును నీకు తెలుపుతున్నాను. నీవు దుఃఖరూప సంసార బంధముల నుంచి బైటపడగలవాడవు.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥ 2

 ఈ జ్ఞానము సర్వ విద్యలలో రాజు వంటిది. సకల రహస్య విషయములకు శిరోభూషణము వంటిది. మహా పవిత్రం. ఉత్తమము. ఫలదాయకము. ధర్మ స్వరూపము. ఆచరించుటకు సులభమైనది. అట్లే నాశన రహితము.

శ్లో॥ అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥ 3

ఓ అర్జునా! ఈ ధర్మములనందు శ్రద్ధ లేనివారు నన్ను చేరలేరు. అట్టి వారు మళ్ళీ మళ్ళీ జనన మరణ రూపమైన సంసార చక్రమునందు పడి తిరుగాడుతున్నారు.

అవ. తాను ఎందున్నానో వచించుట.

శ్లో॥ మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని న చాహం తే ష్వవస్థితః ॥ 4

నిరాకార పరబ్రహ్మనైన నా చేతనే ఈ విశ్వమంతా వ్యాపించి ఉంది. సకల ప్రాణులు నాలోనే ఉన్నాయి. నేను వాటిలో లేను.

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్ ।
భూతభృ న్న చ భూతస్థో మ మాత్మా భూతభావనః ॥5

సకల ప్రాణి కోటి నా యందు లేవు. ఈశ్వర సంబంధిత నా యోగ శక్తి చూడుము. సకల భూతములను సృష్టించి పోషిస్తున్నప్పటికీ వాటిలో నా ఆత్మ ఉండదు.

శ్లో॥ యథాఽఽ కాశస్థితోనిత్యంవాయుస్సర్వత్ర గోమహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ॥ 6

అంతటా వ్యాపించిన వాయువు ఆకాశంలో నున్నట్లే సకల భూతములూ నాలోనే ఉన్నాయని గ్రహించు.

శ్లో॥ సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్ ॥ 7



కౌంతేయా! ప్రాణులన్నీ కల్పాంతమునందు నన్నే చేరుతున్నాయి. అనగా లీనమవుతున్నాయి. తిరిగి సృష్టి కాలంలో నేనే వాటినన్నింటినీ మళ్ళీ సృష్టిస్తున్నాను.

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః ।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥8

ప్రకృతికి ఆధీనమై అస్వతంత్రమైన సర్వభూతములను ప్రకృతి వశమున మళ్ళీ మళ్ళీ పుట్టిస్తున్నాను.

అవ. కర్మలను అంటని వాడినని శ్రీభగవానుడు చెప్పట.

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ।
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు ॥ 9

అయినా అర్జునా! వాటిపై నాకెటువంటి మమకారం లేనివాణ్ణి గనుక ఆ కర్మలేమీ నన్ను కట్టి వేయలేవు.

శ్లో॥ మయాఽ ధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునాఽ నేన కౌన్తేయ జగద్వి పరివర్తతే ॥ 10

కౌంతేయా! ఈ ప్రకృతి నా పర్యవేక్షణలో ఈ సకల చరాచర జగత్తును సృష్టిస్తోంది. దాని వల్లే జగత్తులో నిరంతరము జగన్నాటకం జరుగుతోంది.

అవ. భగవానుని నిజతత్వం గ్రహించాలని వివరించుట.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్ ।
పరంభావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥ 11

సకలప్రాణి కోటికి ప్రభువైన నన్ను మూఢులు తెలుసుకోలేక మామూలు వ్యక్తిగా తలస్తున్నారు. అవమానం చేయుచున్నారు.

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః ।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ 12

వ్యర్థములైన ఆశలనూ, కర్మలనూ చేసేవారూ, జ్ఞానము లేనివారూ, అవివేకులూ, మహిమలు కలవారూ, బుద్ధి కలవారూ, రాక్షస ప్రవృత్తి స్వభావము గలవారు ప్రకృతినే పొందుతున్నారు.

శ్లో॥ మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః ।
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥ 13

పార్థా! సాత్త్విక స్వభావములు గల మహాత్ములు సకల భూతములకు మూలకారణముగా, నాశనము లేనివాడిగా అక్షర స్వరూపుడిగా నన్ను తెలుసుకొని నిశ్చల స్థిర మనస్సుతో నన్నే భజింతురు.

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః ।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ 14

అందు కొంతమంది నిరంతరము నన్నే ధ్యానిస్తూ నిశ్చల వ్రతంలా భక్తి శ్రద్ధలతో నన్నే సేవిస్తూ ఉపాసిస్తున్నారు.

అవ. ఎవరెవరు తనని ఏ విధంగా సేవిస్తున్నారో చెప్పట.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ 15

మరికొంత మంది జ్ఞానయజ్ఞము చేత విశ్వ రూపంలోనున్న నన్ను పూజిస్తున్నారు. కొంతమంది ఏకరూపునిగా, మరికొంతమంది బహురూపునిగా సేవిస్తున్నారు.

శ్లో॥ అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధమ్ ।
మన్త్రోహ మహమేవాజ్య మహ మగ్ని రహం హుతమ్ ॥ 16



నేనే క్రతువును. నేనే యజ్ఞమును. ఓషధులను కూడా నేనే. అట్లే మంత్రమూ, నేయీ, నిప్పు, హోమములూ నేనే.

అవ. సకల వేదాలూ, శాస్త్రాలూ తనే అని చెప్పట.

శ్లో॥ పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్ర మోఙ్కార ఋ క్సామ యజురేవచ ॥ 17

ఈ జగత్తును ధరించువాడనూ, కర్మ ఫలములను ఇచ్చువాడనూ నేనే. తల్లీ, తండ్రీ నేనే. తెలుసుకోవాల్సింది నన్నే. ఓంకారమూ, ఋగ్వేదమూ, సామవేదమూ, యజుర్వేదమూ నేనే.

శ్లో॥ గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్ ।
ప్రభవ్యప్రలయఃస్థానం నిధానం బీజ మవ్యయమ్ ॥18

ఈ సకల జగత్తుకు గతిని నేనే. పతినీ, ప్రభువునీ, సాక్షినీ, ప్రాణుల నివాసమునూ, ఆధారమునూ, ప్రళయమునూ, సంహారకుడనూ, నాశనము కాని శాశ్వత బీజమునూ నేనే.

అవ. తనెలా ప్రకృతిని నడిపిస్తున్నదీ శ్రీభగవానుడు చెప్పట.

శ్లో॥ తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ ।
అమృతం చైవ మృత్యుశ్చ స దస చ్చాహ మర్జున ॥19

అర్జునా... సూర్యునిచే కిరణాలను పంపుతున్నాను. వరుణ దేవునితో వర్షాన్ని కురిపిస్తున్నాను. అమృతాన్నీ నేనే, మరణాన్నీ నేనే. కనిపించే వస్తువూ, కనిపించని వస్తువునూ నేనే.

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపాః
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోకమ్
అశ్నన్తి దివ్యా- దివి దేవభోగాన్ ॥ 20

వేదాలను అధ్యయనము చేసిన వారూ, సకల యజ్ఞాలు చేసి నన్ను పూజించిన వారూ, సోమపానము చేసిన వారూ స్వర్గంకై ప్రార్థిస్తున్నారు. అట్టి వారు ఇంద్ర లోకమున దివ్య భోగములు అనుభవిస్తున్నారు.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలమ్
క్షీ ణే పుణ్యే మర్త్యలోకం విశన్తి ।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః
గతాగతం కామకామా లభన్తే ॥ 21

అట్టి వారు పుణ్యం ఉన్నంతవరకూ ఇంద్రలోకములో సుఖములనుభవించి తిరిగి మానవ జన్మ ఎత్తుతున్నారు. కామ్యకర్మల అనుష్ఠించినట్టి వారు జనన మరణములు పొందుతున్నారు.

శ్లో॥ అనన్యా శ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 22

ఎవరైతే వేరు భావములు లేకుండా, చింతించకుండా నన్నే తలుస్తున్నారో అట్టి వారి యోగక్షేమాలను సదా నేను పరిరక్షిస్తుంటాను.

*అవ. ఇతరములైన దేవతలను ఆరాధించువారూ తననే సేవించిన వారి క్రింద వస్తారని శ్రీభగవానుడు చెప్పట.*

శ్లో॥ యే ప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః ।
తేఽపి మా మేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్ ॥23

అర్జునా! ఎవరైతే మిగతా దేవతలను పూజిస్తున్నారో, వారు క్రమము తప్పి ఆరాధిస్తున్నవారవుతున్నారు. అట్టి వారి సేవలు అవిధి కలవి. అజ్ఞానములతో చేసినవి.



శ్లో॥ అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవ చ ।
న తు మా మభిజానన్తి తత్త్వేనాత శ్చ్యవన్తితే ॥ 24

సకల యజ్ఞాలలో భోక్తను నేనే. యజమానుణ్ని నేనే. అట్టి నన్ను గ్రహించని వారు మళ్ళీ మళ్ళీ పునర్జన్మను పొందుతున్నారు.

*అవ. ఎవర్ని సేవిస్తే వారి వద్దకే వెళతారని శ్రీభగవానుడు చెప్పట.*

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తిపితృవ్రతాః ।
భూతానియాన్తిభూతేజ్యాయాన్తిమద్యాజినోఽపిమామ్ ॥ 25

దేవతలను ఆరాధించే వారు దేవతలనూ, పితృ దేవతలను పూజించేవారు పితృదేవతలనూ, భూతములను ఆరాధించే వారు భూతములనూ చేరుతున్నారు. అట్లే నన్ను సేవించేవారూ, పూజించేవారూ నన్నే చేరుతున్నారు.

*అవ. భక్తితో ఎంత చిన్నది ఇచ్చినప్పటికీ అదే నాకు పరమానందమని శ్రీ భగవానుడు చెప్పట.*

శ్లో॥ పత్రంపుష్పంఫలంతోయం యో మేభక్త్యా ప్రయచ్ఛతి ।
త దహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥ 26

ఎవరు భక్తితో పత్రమునైనా, పుష్పమునైనా, పండునైనా, జలమునైనా నాకు సమర్పిస్తున్నారో వాటిని నేను ప్రీతిగా స్వీకరిస్తున్నాను. ఎంతో ఇష్టంగా ఆరగిస్తున్నాను.

*అవ. తనకి సకల కర్మలను అర్పించమని బోధించుట.*

శ్లో॥ యత్కరోషి యదాశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
య త్తపస్యసి కౌన్తేయ త త్కురుష్వ మదర్పణమ్ ॥ 27

ఓ అర్జునా! నీవు చేయు సమస్త కర్మలను... అనగా భుజించే ఆహారాన్నీ, చేయు హోమాదులనూ, దానములనూ, చేసే తపస్సునూ అన్నింటినీ నాకు అర్పించు.

శ్లో॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి ॥28

అలా నీవు కర్మలు అర్పణ చేయటం ద్వారా పుణ్యాపాప ఫలముల నుంచి సకల కర్మ బంధముల నుంచి నీవు విముక్తుడవవుతావు.

*అవ. పరమాత్మతో నుండేదెవరో శ్రీ భగవానుడు చెప్పట.*

శ్లో॥ సమోఽహంసర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః ।
యే భజన్తితు మాం భక్త్యా మయితే తేషుచాప్యహమ్ ॥ 29

నేను సకల ప్రాణుల యందూ ఉన్నాను. నేను ద్వేషించేవారు గానీ, ప్రేమించేవారు గానీ ఎవరూ లేరు. నన్ను ప్రీతితో, భక్తితో సేవించే వారంతా నాతోనే ఉంటారు.

*అవ. ఎంతటి క్రూరుడైనా అనన్యభక్తితో సేవించటం ద్వారా సాధువవుతాడని శ్రీ భగవానుడు చెప్పట.*

శ్లో॥ అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధు రేవ స మన్తవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః ॥ 30

మిక్కిలి దురాచారములు గలవాడైనా, అసమాన భక్తి గలవాడైనా మరే ఇతర విషయాలను తలచక నన్నే ఆశ్రయించువాడు స్థిరమైన చిత్తము కలవాడు.

అట్టి వానిని సత్పురుషుని గానే ఎంచుతాను. ఎందుకనగా పరమాత్మను సేవించటం కన్నా గొప్పది ఏదీ లేదని అట్టి వాని నమ్మకం.



శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

పాపాత్ముడు కూడా నన్ను ఆశ్రయించటం ద్వారా స్థిరమైన శాంతిని పొందుతున్నాడు. ఓ అర్జునా... నా భక్తుడు ఎన్నటికీ చెడడు అని తెలుసుకో.

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్యయేఽపిస్యుః పాపయోనయః ।
స్త్రియోవైశ్యాస్తథాశూద్రాస్తేఽపియాన్తిపరాంగతిమ్ ॥ 32

పాపపు జన్మలెత్తిన ఎవరైనా నన్ను శరణు కోరినచో ఉత్తమమైన గతిని పొందగలరు.

శ్లో॥ కింపున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా ।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్ ॥33

ఇక పుణ్యాత్ములైన వారి గూర్చి చెప్పవల్సిన పని లేదు. శాశ్వతము కానిదీ, సుఖరహితము కానిదీ అయిన ఈ లోకమున నీవు నన్ను భజించి ముక్తుడవవ్వు.

*అవ. భగవంతుని ప్రాప్తికి మార్గమును చెప్పట.*

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥ 34

నా యందే మనస్సుని నిలుపుము. నా భక్తుడవై నన్నే సేవించు. నాయందే మనస్సును నిలిపి నన్నే పరమ గతిగా ఎంచి సేవించిన తుదకు నన్ను చేరగలవు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే రాజవిద్యారాజగుహ్య యోగో నామ నవమోఽధ్యాయము**

**పూర్వ జన్మ పాపము పోవుటకొరకు**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ ।
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు ॥

*9వ అధ్యాయము - 9వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 210, జప సంఖ్య - 1లక్ష 90వేలు*

**కుటుంబమున సుఖశాంతుల**
**కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ అనన్యా శ్చిన్తయన్తో మాం యేజనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥

*9వ అధ్యాయము - 22వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 75, జపసంఖ్య - 1 లక్ష 90 వేలు*

**భగవంతుని ప్రీతి కొరకు**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ యత్కరోషి యదాశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
య త్తపస్యసి కౌన్తేయ త త్కురుష్వ మదర్పణమ్ ॥

*9వ అధ్యాయము - 27వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 50, జప సంఖ్య - 1 లక్ష 50 వేలు*





# విభూతియోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

- ★ ఈ విభూతి యోగంలో 1వ శ్లోకము నుంచి 7వ శ్లోకము వరకూ యోగశక్తుల గూర్చి.
- ★ 8వ శ్లోకము నుంచి 11వ శ్లోకము వరకూ ఫల ప్రభావములు.
- ★ 12వ శ్లోకము నుంచి 18వ శ్లోకము వరకు పార్థుడు శ్రీకృష్ణుణ్ని స్తుతించటం.
- ★ 19వ శ్లోకము నుంచి 42వ శ్లోకము వరకు విభూతుల గూర్చి, యోగ శక్తుల గూర్చి భగవంతుడు చెప్పుట.

# విభూతియోగః

శ్రీ భగవాన్ ఉవాచ.

శ్లో॥ భూయఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయమవక్ష్యామిహిత కామ్యయా॥ 1

శ్రీభగవానుడు చెప్పెను. హే మహాబాహూ! నీవు నాపై అపార ప్రేమగలవాడవు. అందుకే నీ హితం కోరి నేను చెబుతున్న వచనాలు వినుము. అవి అతిరహస్యములు, మహిమలు గలవి.

అవ. భగవానుడు అతిరహస్యమైన
విషయాలను వచించుట.

శ్లో॥ న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః ॥ 2

నా అవతార రహస్యాలను దేవతలు గానీ, మహర్షులు గానీ తెలుసుకోలేరు. ఏలనన్న దేవతల కన్నా, మహర్షుల కన్నా తొలుత వాడిని నేను. అనగా కారణభూతుడను.

అవ. కర్మఫలములు ఎలా వదిలించుకోవాలో చెప్పట.



శ్లో॥ యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥ 3

జన్మమూ, అంతమూ లేనివాడను. సకల లోక ప్రభువును. అది తెలుసుకున్నవారు సకల కల్మషముల నుంచి విముక్తులవుతున్నారు.

అవ. మహాత్ముల జననము గూర్చి చెప్పట.

శ్లో॥ బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః ।
సుఖం దుఃఖం భవోఽ భావో భయం చాభయమేవచ ॥ 4

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽ యశః ।
భవన్తి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః ॥ 5

బుద్ధి, జ్ఞానము, మోహరాహిత్యము, ఓర్పు, సత్యము, దమము, శమము, సుఖము, దుఃఖము, భయము, అభయము, అహింస, సమత్వము, సంతృప్తి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి అన్నీ నా వల్లనే కలుగుతున్నాయి.

శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥ 6

జనులు ఎవరి సంతతియై ఉన్నారో, అట్టి పూర్వీకులైన సప్త మహర్షులూ, సనకాది దేవర్షులు నలుగురూ, పద్నాలుగు మనువులూ దైవ భావము గలవారై నా వలననే జన్మించియున్నారు.

అవ. మహా ఫలం గూర్చి భగవానుడు చెప్పట.

శ్లో॥ ఏతాంవిభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః ।
సోఽ వికంప్యేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ 7

నా యొక్క విభూతిని అనగా ఐశ్వర్యమునూ, శక్తినీ ఎవరు గ్రహించగలుగుతున్నాడో అట్టి వాడు నిశ్చల యోగము గలవాడు. ఈ విషయమున సంశయము లేదు.

అవ. అట్టి వారు దైవచింతనలతో దేహయాత్ర సాగిస్తున్నారని చెప్పట.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥ 8

 ఈ సకల జగత్తు నా వల్లే జన్మించినది. నా వల్లే నడుస్తున్నది. దాన్ని తెలుసుకున్న జ్ఞానులు నన్నే సేవిస్తున్నారు.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్త శ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥ 9

 అట్టివారు సదా మనస్సు నా యందు నిలిపి, నా గూర్చే చెప్పుకుంటూ బోధిస్తూ ఉన్నవారు సకల సంతృప్తిని పొందుతున్నారు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తితే ॥ 10

 సదా యోగము కలిగి, ప్రీతితో భజించినవారికి నన్ను పొందే బుద్ధియోగాన్ని నేను ఇస్తున్నాను.

శ్లో॥ తేషా మే వానుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ 11

 ఓ అర్జునా! వారి అంతఃకరణములందు స్థితుడనై ప్రకాశమైన జ్ఞాన దీపముతో వారి అజ్ఞాన అంధకారమును నేను పోగొడుతున్నాను. వారిని అనుగ్రహించుచున్నాను.

అవ. భక్తి తత్త్వములను గ్రహించిన అర్జునుడు పరమాత్మ తత్త్వమును చెప్పమని అడుగుట. ఎలా నిన్ను తెలుసుకోవాలో అని అడుగుట.

అర్జున ఉవాచ.

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ ॥ 12



ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥ 13

 అర్జునుడు పలికెను. నీవు పరబ్రహ్మవు. పరంధాముడవు. పవిత్రుడవు. సనాతనుడవనీ, దివ్య పురుషుడవనీ, దేవదేవుడవనీ, జన్మరహితుడవనీ, సకల వ్యాప్తి గలవాడవనీ నారదుడూ, అసితుడూ, దేవలుడూ, వ్యాసమహర్షి స్తుతిస్తున్నారు. అట్టి వారు చెప్పినట్టే నీవు నీ గూర్చి చెబుతున్నావు.

శ్లో॥ సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః ॥ 14

 ఓ శ్రీకృష్ణా! నీవు చెప్పినదంతయూ సత్యమే. ఓ దేవాదిదేవా! నీ నిజ స్వరూపమును దేవతలూ, రాక్షసులు గానీ తెలుసుకొనలేరు.

శ్లో॥ స్వయమే వాత్మనాఽ త్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ 15

 ఈ జగత్తుకు కారణమైన సర్వభూతేశా! దేవాదిదేవా! జగన్నాథా, పురుషోత్తమా... నీ తత్త్వమును నాకు తెలుపుము.

శ్లో॥ వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ 16

 సకల లోకముల యందు వ్యాపించి వున్నావు. అట్టి వాడవైన నీ గూర్చి నాకు సంపూర్ణంగా చెప్పుము.

శ్లో॥ కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచిన్తయన్।
కేషు కేషుచ భావేషు చిన్త్యోఽసి భగవ న్మయా ॥ 17

 ఓ యోగేశ్వరా! నేను ఎలా నిన్ను ధ్యానించి తెలుసుకోగలను.

ఓ భగవంతుడా... ఏ ఏ వస్తువులయందు మిమ్ము స్వీకరించుకొనవలెను.

శ్లో॥ విస్తరే ణాౖ త్మనో యోగం విభూతించ జనార్దన ।
భూయఃకథయతృప్తిర్హి శ్రుణ్వతో నాస్తి మేౖ మృతమ్॥ 18

ఓ జనార్థనా! నీ యోగములనూ, ఐశ్వర్య శక్తులనూ, విభూతులనూ మళ్ళీ నాకు చెప్పుము. అమృతం వంటి నీ పలుకులు నాకు ఎంతో తృప్తినిస్తున్నాయి.

అవ. భగవానుడు తన విభూతులను

కొన్ని మాత్రమే వివరించుట.

శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో॥ హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ భూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నా స్త్యన్తో విస్తరస్య మే ॥ 19

శ్రీభగవానుడు పలికెను. ఓ అర్జునా... నా విభూతములు అనంతములు. దివ్యములైన నా విభూతులను గూర్చి కొన్ని చెప్పెదను. వినుము.

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మన్త ఏవచ ॥ 20

సకలభూతములందు ఉన్న ఆత్మను నేనే. నేనే భూతములను సృష్టించుచున్నాను. సృష్టి, స్థితి, లయములకు కారణము నేనే.

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్ ।
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥ 21

నేను ద్వాదశ ఆదిత్యులలో విష్ణువును. జ్యోతుల యందు సూర్యుడను. మరుత్తుల యందు మరీచిని. తారలలో చంద్రుడను.



శ్లో॥ వేదానాం సామవేదోౖ స్మి దేవానా మస్మి వాసవః ।
ఇన్ద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతనా ॥ 22

వేదములందు సామవేదమును, దేవతలలో ఇంద్రుడను, ఇంద్రియాలలో మనస్సును, భూతములందు చైతన్యమును నేనే.

శ్లో॥ రుద్రాణాం శఙ్కర శ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్ ॥ 23

ఇక రుద్రులలో శంకరుడను. యక్షరాక్షసులలో కుబేరుడను. అష్టమవసువుల్లో అగ్నిని. పర్వతాల్లో మేరు పర్వతమును.

శ్లో॥ పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్ ।
సేనానీనా మహం స్కన్దః సరసా మస్మి సాగరః ॥ 24

ఓ అర్జునా! రాజపురోహితుల్లో బృహస్పతిని, సేనాధిపతుల్లో కుమారస్వామిని, సరస్సులలో సముద్రాన్ని.

శ్లో॥ మహర్షీ ణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోౖ స్మి స్థావరాణాం హిమాలయః ॥ 25

మహర్షులలో భృగుమహర్షిని. అర్థవంతమైన వాక్కులలో ఓంకారమును నేనే. యజ్ఞముల యందు జపయజ్ఞము, స్థావరములలో హిమాలయ పర్వతమును నేనే.

శ్లో॥ అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీ ణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః ॥ 26

వృక్షాలలో రావిచెట్టును నేను. గంధర్వులలో చిత్రరథుడను. సిద్ధులలో కపిలమునినీ నేనే. దేవర్షులలో నారదుణ్ణీ నేనే.

శ్లో॥ ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్ ।
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ 27

అశ్వాలలో ఉచ్చైశ్శ్రవమును, ఏనుగులలో ఐరావతమును నేనే. నరులలో రాజును.

శ్లో॥ ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్ ।
ప్రజన శ్చాస్మి కన్దర్పః సర్పాణా మస్మి వాసుకిః ॥ 28

ఆయుధాల్లో వజ్రాయుధమును నేనే. ఆవులలో కామధేనువును, సంతానకారుడైన మన్మథుణ్ణి, సర్పములలో వాసుకిని నేనే.

శ్లో॥ అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్ ।
పి తౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్ ॥ 29

నేను నాగులలో అనంతుడను. జలదేవతలలో వరుణుడను. పితృదేవతల్లో ఆర్యమముణ్ణి, దండించే వారిలో యముణ్ణి నేనే.

శ్లో॥ ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేన్ద్రోహం వైనతేయ శ్చ పక్షిణామ్ ॥30

దైత్యులలో ప్రహ్లాదుణ్ణి, గణిత శాస్త్రములలో కాలాన్ని, మృగాల్లో సింహాన్ని, పక్షులలో గరుత్మంతుడను నేనే.

శ్లో॥ పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్ ।
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ ॥ 31

పవిత్రము చేయువానిలో వాయువును, శస్త్ర ధారులలో శ్రీరామచంద్రుణ్ణి, మత్స్యములలో మకరుణ్ణి, నదులలో గంగానదినీ నేనే.

శ్లో॥ సర్గాణా మాది రన్త శ్చ మధ్యం చై వాహ మర్జున ।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్ ॥ 32



సకల సృష్టి ఆదిమధ్యాంతాదులు నేనే. విద్యల్లో ఆధ్యాత్మ విద్యని, తత్వనిశ్చయము చేయుటకై వాదించే వారి వాదమును నేనే.

శ్లో॥ అక్షరాణా మకారో౽స్మి ద్వన్ద్వ స్సామాసికస్యచ ।
అహమే వాక్షయః కాలో ధాతా౽హం విశ్వతోముఖః ॥ 33

అక్షరములలో అకారుణ్ణి, సమాసములలో ద్వంద్వ సమాసమును నేనే. కాలమూ నేనే...బ్రహ్మనూ నేనే.

అవ. స్త్రీలలో వుండే స్వభావములూ తనే అని చెప్పట.

శ్లో॥ మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్ ।
కీర్తి శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥ 34

సకలాన్ని హరించే మృత్యువునూ నేనే, జన్మించే వారికి జన్మమూ నేనే. ఇక స్త్రీలలో కీర్తి, సంపద, వాక్కూ, స్మృతి, ధైర్యమూ, ఓర్పూ నేనే.

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసా మహమ్ ।
మాసానాం మార్గశీర్షో౽హ మృతూనాం కుసుమాకరః ॥ 35

సామగీతలలో బృహత్సామము, ఛందస్సులో గాయత్రి, మాసములో మార్గశిరమాసము, ఋతువులలో వసంతఋతువును నేనే.

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ।
జయో౽స్మివ్యవసాయో౽స్మిసత్త్వం సత్త్వవతామహమ్ ॥ 36

మోసం చేసే వారి జూదమూ, తేజోవంతుల తేజమూ నేనే అయి ఉన్నాను. జయశీలుర జయమూ నేనే. సాత్త్వికుల సత్త్వగుణమునూ నేనే.

అవ. వింటున్న నీవు కూడా నేనే అని శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాణ్డవానాం ధనఞ్జయః ।
మునీనా మ ప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః ॥ 37

యాదవులలో శ్రీకృష్ణుడను. పాండుపుత్రులలో అర్జునుడను. మునులలో వ్యాసుడను. కవులలో శుక్రాచార్యుడనునేనే.

శ్లో॥ దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥ 38

నేను దండించే వారి దండమును, జయశీలుర రాజనీతిని, రహస్యములలో మౌనాన్ని, జ్ఞానవంతులలో జ్ఞానాన్ని.

శ్లో॥ య చ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున ।
న త దస్తి వినా యత్స్యా న్మయాభూతం చరాచరమ్ ॥ 39

ఓ అర్జునా... సకల భూతములకి మూలమును నేనే. ఈ చరాచర స్వరూపమైన భూతములలో నా విభూతి కానిది ఏదీ లేదు.

అవ. భగవానుడు తన అంశల గూర్చి చెప్పట.

శ్లో॥ నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా ॥ 40

అర్జునా! నా యొక్క దివ్యములగు విభూతులకు అంతమే లేదు. అందువల్లనే నా విభూతుల గూర్చి నీకు సంక్షిప్తముగా చెప్పాను.

శ్లో॥ యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా ।
తత్త దే వావగచ్ఛ త్వం మమ తేజోంశసమ్భవమ్ ॥ 41

లోకములో ఏ ప్రాణి అయినా, వస్తువు అయినా, ఐశ్వర్య లక్ష్మీ యుక్తములైనా అది నా అంశ వల్ల కలిగినదే అని తెలుసు కొనుము.



అవ. సకల జగత్తును ఏక అంశతో వ్యాపించానని చెప్పట.

శ్లో॥ అథవా బహునైతేన కిం జ్ఞానేన త వార్జున ।
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥42

ఓ అర్జునా! ఈ విభూతులు (జ్ఞానములు) ఎన్ని తెలుసుకున్నా నీకు ప్రయోజనం ఏమిటి? ఈ సమస్త జగము ఒకే ఒక్క అంశము వల్ల వ్యాపించి ఉన్నాను. దాన్ని తెలుసు కొనుము.

**ఇతి శ్రీభగవద్గీతా నూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం**
**యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగోనామ**
**దశమోఽధ్యాయః**



**భగవంతుని ప్రీతి కొరకు**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

*10వ అధ్యాయము - 16వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 31, జప సంఖ్య - 36 వేలు*

**మహాఘోర పాపాలు పోవుటకొరకు**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥

*10వ అధ్యాయము - 3వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 50,*
*జప సంఖ్య - 1 లక్ష 50 వేలు*

**ఆకస్మిక ధనలాభం కొరకు**
**జపించాల్సిన మంత్రము**

శ్లో॥ వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః ।
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

*10వ అధ్యాయము - 16వ శ్లోకము,*
*చేయాల్సిన రోజులు - 40, జప సంఖ్య - 108*





# విశ్వరూపసందర్శన యోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

★ ఈ విశ్వరూప సందర్శన యోగము 1వ శ్లోకము నుంచి 4వ శ్లోకము వరకూ విశ్వరూపము.

★ 5వ శ్లోకము నుంచి 8వ శ్లోకము వరకూ విశ్వరూప వర్ణనము.

★ 9వ శ్లోకము నుంచి 14వ శ్లోకము వరకూ శ్రీ భగవానుడి విశ్వరూపం గూర్చి సంజయుడు ధృతరాష్ట్రునికి చెప్పుట.

★ 15వ శ్లోకము నుంచి 31వ శ్లోకము వరకూ అర్జునుడు భగవానుని స్తుతించుట.

★ 32వ శ్లోకము నుంచి 34వ శ్లోకము వరకూ యుద్ధమునకై అర్జునుణ్ని ప్రోత్సహించుట.

★ 35వ శ్లోకము నుంచి 46వ శ్లోకము వరకూ అర్జునుడు భయంతో భగవంతుణ్ణి ప్రార్థించుట.

★ 47వ శ్లోకము నుంచి 50వ శ్లోకము వరకూ విశ్వరూప మహిమ.

★ 51వ శ్లోకము నుంచి 55వ శ్లోకము వరకూ అసమాన భక్తి గూర్చి.

# విశ్వరూపసందర్శన యోగః

అర్జున ఉవాచ.

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తంవచస్తేనమోహోఽయం విగతోమమ ॥1

అర్జునుడు చెప్పెను. ఓ శ్రీకృష్ణా! నన్ను అనుగ్రహింపదలిచి తెలిపిన మహా పరమగోప్యమైన ఆత్మవిద్యా స్వరూపమైన ఉపదేశముల వల్ల నా మోహము తొలగిపోయినది.

అవ. అతిరహస్యములైనవి చెప్పమని
శ్రీ భగవానుణ్ణి అర్జునుడు కోరుట.

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్ ॥ 2

ఓ శ్రీకృష్ణా! సకల ప్రాణుల ఉత్పత్తి గూర్చీ, ప్రళయాల గూర్చీ వింటిని. అలానే స్థిరమైనవీ, శాశ్వతమైనవీ అయిన నీ రహస్యాలను గూర్చి తెలుపుము.



శ్లో॥ ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర ।
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ॥ 3

ఓ పరమేశ్వరా! నీ గూర్చి నీవు చెప్పినదంతా సత్యమే. ఓ పురుషోత్తమా! జ్ఞాన, ఐశ్వర్య, శక్తి, బల, వీర్య, తేజోవంతమైన నీ విశ్వరూపమును నాకు దయతో చూపుము.

అవ. మహా విశ్వరూపాన్ని
చూపించమని అర్జునుడు ప్రార్థించుట.

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో ।
యోగేశ్వర తతో మేత్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥ 4

ఓ యోగేశ్వరా! ఓ దేవా! నీ దివ్య విశ్వరూపమును చూచుటకు నేను అర్హుడనని భావించిన యెడల, అవ్యయమైన నీ విశ్వరూపాన్ని నాకు చూపుము.

అవ. పరమాత్మ శ్రీకృష్ణ భగవానుడు అర్జునుడికి తన
విశ్వరూపం చూపుట.

శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో॥ పశ్యమే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః ।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ 5

ఓ అర్జునా! నానా విధములైన, బహువిధములైన, పెక్కు వర్ణముల, ఆకృతులు గల నా విశ్వ రూపమును నీవు గాంచు.

శ్లో॥ ప శ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా ।
బహూ న్యదృష్టపూర్వాణి ప శ్యాశ్చర్యాణి భారత ॥ 6

అర్జునా! ఆదిత్యులూ, వసువులూ, రుద్రులూ, అశ్వినులూ, మరుత్తులూ.... అలాగే నీవూ ఇంతవరకూ చూడని అద్భుతాన్ని నీవు చూడగలవు.

శ్లో॥ ఇ హైకస్థం జగ త్కృత్స్నం పశ్చాద్య సచరాచరమ్ ।
మమ దేహే గుడాకేశ య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి ॥ 7

అర్జునా! నీవు చూడదగిన నా విశ్వరూపములోనే నీవు ఏమి చూడవలెనని భావిస్తున్నావో అన్నీ నాయందే .... ఈ విశ్వరూపమందే దర్శించు.

అవ. భగవానుడు అర్జునుడికి జ్ఞాననేత్రములను ఇచ్చుట.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।
దివ్యం దదామి తే చక్షుః పశ్యమే యోగ మైశ్వరమ్ ॥ 8

ఓ అర్జునా! నీ ఈ కన్నులతో నన్ను చూడలేవు. నా మహా ఐశ్వర్యవంతమైన విశ్వరూపమును చూచుటకు నీకు దివ్యదృష్టిని ఇస్తున్నాను. దర్శించుము.

అవ. సంజయుడు శ్రీభగవానుడి
విశ్వరూపం గూర్చి ధృతరాష్ట్రునికి చెప్పుట.

సంజయ ఉవాచ.

శ్లో॥ ఏవ ముక్త్వా తతో రాజ మహాయోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్ ॥9

సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పెను.

"ఓ రాజా! శ్రీకృష్ణుడు అలా అర్జునుడితో పలికాడు. అనంతరం యోగేశ్వరుడైన శ్రీహరి తన విశ్వరూపాన్ని అర్జునునికి చూపాడు."

శ్లో॥ అనేక వక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్ ।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ 10
దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ ॥ 11



అనేక ముఖములతో, అనేక చిత్రములతో, అనేక దివ్యమైన ఆభరణాలతో, పెక్కు దివ్యమైన అస్త్రములతో, అనేక దివ్యమైన పూలమాలలతో, మెరిసే దివ్య వస్త్రాలను ధరించి ఉన్నాడు. ఆ దివ్య శరీరము దివ్య చందన పరిమళాలను వెదజల్లుతోంది. ఆ రూపము అద్భుతము. స్వయం ప్రకాశము.

శ్లో॥ దివి సూర్యసహస్రస్య భవే ద్యుగప దుత్థితా ।
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః ॥ 12

ఆకాశమున వేల కొలది సూర్యుల కాంతి ఒక్కటై వెలిగినట్టు కాంతివంతంగా ఆ మహాత్ముడు వెలిగిపోతున్నాడు. వేల సూర్యుల కాంతి కూడా ఆ రూప తేజస్సుకు సాటిరాదు.

శ్లో॥ తత్రైకస్థం జగ త్కృత్స్నం ప్రవిభక్త మనేకధా ।
అపశ్య ద్దేవ దేవస్య శరీరే పాణ్డవ స్తదా ॥ 13

అప్పుడు అర్జునుడు ఆ దేవాదిదేవుడైన శరీరము నందు వివిధ బ్రహ్మాండములు ఒకే చోట కేంద్రీకృతమైనట్టు చూశాడు.

శ్లో॥ తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత ॥ 14

మహా అద్భుతమైన ఆ పరంధాముడి విశ్వరూపాన్ని చూసిన అర్జునుడు విస్మయం చెందాడు. పులకించిపోయాడు. ముకుళిత హస్తాలతో ఆ దేవాదిదేవునకు నమస్కరించి చెప్పాడు.

శ్లో॥ పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేషసఙ్ఘాన్।
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్ ॥ 15

ఓ దేవదేవా! నీ విశ్వరూప దేహము నందు సకల దేవతలనూ, సకల చరాచర భూతజాలమునూ, బ్రహ్మనూ, ఋషులనూ, సర్వమునూ గాంచుచున్నాను.

శ్లో॥ అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽ నన్తరూపమ్।
నాన్తం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ 16

ఓ విశ్వేశ్వరా! అనేక బాహువులతో, ఉదరములతో, ముఖములతో, నేత్రములతో నీ విశ్వరూపము వెలిగిపోతోంది. నీవు ఆదిమధ్యాంతరహితుడవు. నీ రూపము మొదలు గానీ, అంతము గానీ నాకు గోచరించుట లేదు.

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమన్తా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్ ॥ 17

కిరీటమూ, గదా, చక్రములతో ప్రకాశిస్తూ విరజిమ్ముతూ ఉన్న నిన్ను దర్శించాను. ప్రజ్వరిల్లే అగ్నిలోక జ్యోతిర్మయుడైన సూర్యుని వలే వెలుగుతున్న నీ రూపము గాంచుతున్నాను.

శ్లో॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిదానమ్।
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే ॥ 18



నీవు అక్షర స్వరూపుడవు. పరంధాముడవు. సనాతన ధర్మరక్షకుడవు. అవ్యయుడవు. సనాతన పురుషుడవు అని నా విశ్వాసము.

శ్లో॥ అనాదిమధ్యాన్త మనన్తవీర్య
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వ తేజసా విశ్వ మిదం తపన్తమ్ ॥ 19

నీవు ఆదిమధ్యాంతరహితుడవు. మహాశక్తిశాలివి. అనేకమైన భుజములు కలవాడవు. సూర్యుడూ, చంద్రుడూ నీ నేత్రములు. మహాగ్నివలే నీ ముఖము గోచరిస్తున్నది. నీ అనంతమైన ప్రకాశముతో విశ్వమంతటికీ వెలుగును చూపుతున్న వానిగా నిన్ను చూస్తున్నాను.

శ్లో॥ ద్యావాపృథివ్యో రిద మన్తరం హి
వ్యాప్తం త్వ యైకేన దిశశ్చ సర్వాః।
దృష్ట్వాఽ ద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ 20

ఓ పరమాత్మా! దివి నుంచి భువివరకు గల అంతరిక్ష మంతటా, అన్ని దిశల యందూ, భూమ్యాకాశాల మధ్యా వ్యాపించి ఉన్నావు. మహాభయంకరమైనదీ,ఆశ్చర్యకరమైనదీఅయిననీ రూపము చూసి ముల్లోకాలూ భీతి చెందుతున్నాయి. గడ గడ లాడిపోతున్నాయి.

శ్లో॥ అమీ హి త్వామ్ సురసఙ్ఘా విశన్తి
కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ 21

సకల దేవతా సమూహాలన్నీ నీలో కానవస్తున్నాయి. కొందరు భయంతో నమస్కరిస్తున్నారు. మహర్షులాదులంతా 'స్వస్తి' పలుకుతూ నిన్ను స్తుతిస్తున్నారు... ప్రార్థిస్తున్నారు.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా
విశ్వేఽ శ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ।
గన్ధర్వ యక్షా సురసిద్ధ సఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే ॥ 22

రుద్రులూ, ఆదిత్యులూ, వసువులూ, సాధ్యులూ, విశ్వదేవతలూ, అశ్వనీదేవతలూ, వాయుదేవతలూ, పితృదేవతలూ, యక్ష గంధర్వులూ, అసురులూ, సిద్ధులూ ఆశ్చర్యచకితులై నిన్ను చూస్తున్నారు.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రమ్
మహాబాహో బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాళమ్
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽ హమ్ ॥ 23

ఓ శ్రీకృష్ణా! అనేక ముఖములతో, నేత్రములను కలిగి అనేక బాహువులు, ఊరువులు, పాదములు కలిగి అనేక కోరలతో ఉన్న భీకరమైన నీ రూపమును చూసి భయం చెందుతున్నారు. నేను కూడా భయం చెందుతున్నాను.

శ్లో॥ నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమంచ విష్ణో ॥ 24



ఓ శ్రీకృష్ణా! గగనాన్ని అంటి ఉన్నావు. అనేక వర్ణములతో ప్రకాశిస్తున్నావు. తెరిచిన నోళ్ళతో, ప్రజ్వలించే నేత్రములతో ఉన్న నిన్ను చూసి నాలో భీతి కలుగుతోంది. ధైర్యమూ, శాంతీ పోయినవి.

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 25

కోరలతో భయంకరమైన నీ రూపాన్నీ, ప్రళయాగ్నిని పోలిన నీ ముఖములనూ చూసి నేను భీతి పొంది ఉన్నాను. నాకు దిక్కు తోచకున్నది. దిక్కులు తెలియుట లేదు. ఓ దేవా! ప్రసన్నుడవు కమ్ము.

శ్లో॥ అమీ చత్వాం ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే స్సహై వావనిపాలసఙ్ఘైః।
భీష్మ ద్రోణ స్సూతపుత్ర స్తథాఽ సౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః ॥ 26
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచి ద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః ॥ 27

ఈ ధృతరాష్ట్ర పుత్రులైన వారూ, వారి పక్షమువారూ, అలాగే భీష్మ, ద్రోణ, కర్ణులు వికృత దంతము గల భయంకర రూపమైన నీ ముఖమునందు మహావేగముగా పరుగులు తీస్తున్నారు. కొందరి తలలు కోరల మధ్య పడి నుగ్గునుగ్గయి పోతున్నాయి. కొందరు దంతములలో చిక్కుకొని వేలాడుతున్నారు.

శ్లో॥ యథా నదీనాం బహవో-మ్బువేగా
స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి ॥ 28

అనేక నదీ ప్రవాహములన్నీ సముద్రంలో ప్రవేశించినట్టు నరలోకశ్రేష్ఠులైన వీరులు మహాగ్నిలా జ్వలిస్తున్న నీ ముఖములందు ప్రవేశిస్తున్నారు.

శ్లో॥ యథాః ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశన్తి లోకా
స్త వాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥ 29

మిడతలన్నీ నాశనము కొరకు మండుతున్న అగ్ని వైపు అతివేగముగా వెళ్ళి నశించినట్టు, ఈ వీరులంతా ఆ మిడతల వలే మోహావేశముతో తమ నాశనము కొరకు అతి వేగముగా నీ ముఖ గుహద్వారమున ప్రవేశిస్తున్నారు.

శ్లో॥ లేలిహ్యసే గ్రసమానస్సమన్తా
ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో ॥ 30

ఓ సర్వవ్యాప్తీ... విష్ణూ! నీవు ప్రజ్వరిల్లుతున్న ముఖముతో సమస్త లోకమును మింగుతున్నావు.

నీ ఉగ్ర తేజస్సు అంతటా నిండి జగత్తును తపింప చేయుచున్నది.



అవ. శ్రీభగవానుడి మహోన్నతమైన విశ్వరూపాన్ని చూసి అర్జునుడు ఆ పరమానందంతో స్వభావములను తెలుపమని అడుగుట.

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద।
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥ 31

ఓ పరమాత్మా! నీకు నా నమస్కారములు. దయతో ప్రసన్నుడవి కమ్ము. మహోగ్రరూపమైన నీవు ఎవరో తెలుపుము. ఆది పురుషుడవైన నీ గూర్చి విశేషముగా తెలియ చేయకోరుతున్నాను. నీ స్వభావమును తెలుసుకొనలేకున్నాను.

అవ. భగవానుడు అర్జునునికి నీవు నిమిత్తమాత్రుడవని చెప్పట.

శ్రీ భగవాన్ ఉవాచ.

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ 32

శ్రీభగవానుడు పలికెను. నేను లోక సంహారంకై అవతరించిన యముడను. ఇప్పుడు ప్రాణులను సంహరింపదలిచాను. నీవు చంపకున్ననూ భీష్మ, ద్రోణ, కర్ణులు జీవించరు.

అవ. నీవు చంపదల్చుకున్న వారంతా ఎప్పుడో హతమయ్యారని చెప్పట.

శ్లో॥ తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్।

మయై వై తే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥ 33

 ఓ సవ్యసాచీ! యుద్ధము చేయుము. దుర్యోధనాదులను జయించి మహా రాజ్యమును అనుభవించు. వీరంతా నా చేత ఎప్పుడో హతులైనారు. నీవు కేవలం నిమిత్తమాత్రుడవు.

శ్లో॥ ద్రోణంచ భీష్మంచ జయద్రథం చ
కర్ణం తథాఽన్యా నపి యోధవీరాన్।
మయా హతాం స్త్వం జహి మావ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ 34

 ఇదివరకే నాచే చంపబడిన భీష్మ, ద్రోణ, సైంధవ కర్ణాది వీరులందరినీ నీవు సంహరించు. అర్జునా... భీతి చెందకు. నీవు ఈ రణరంగమున శత్రువులందరినీ హతమార్చగలవు.

అవ. సంజయుడు ధృతరాష్టునికి అర్జునుడు పరమాత్మను స్తుతించిన విధం తెలుపుట.

సంజయ ఉవాచ.

శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాఽహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35

 సంజయుడు పలికెను. ఓ రాజా! శ్రీకృష్ణ పరమాత్మ పలుకులు విని అర్జునుడు వణుకుతూ.. చేతులు జోడించి వినయంగా నమస్కరించాడు. గద్గద స్వరంతో శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించి, స్తుతించాడు.



అర్జున ఉవాచ.

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః ॥ 36

 అర్జునుడు పలికాడు.. ఓ అంతర్యామీ! ఓ కేశవా! నీ మహత్తుకు లోకమంతా అనురాగము పొందుతున్నది. నీ నామమును స్మరిస్తూ లోకము ఉప్పొంగిపోతోంది. రాక్షసులు భయం చెంది దిక్కులకు పారిపోతున్నారు. సకల సిద్ధులూ నీకు నమస్కరిస్తున్నారు... ప్రణమిల్లుతున్నారు.

శ్లో॥ కస్మా చ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।
అనన్త దేవేశ జగన్నివాస
త్వ మక్షరం సదసత్త త్పరం యత్ ॥ 37

 ఓ మహాత్మా! నీవు సర్వశ్రేష్ఠుడవు. బ్రహ్మదేవునికే మూలం. అట్టి నీకు నమస్కరించక ఎటులుండగలను. అక్షరస్వరూపుడవు నీవు.

శో॥ త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనన్తరూప॥ 38

 అనంతరూపా! నీవు ఆదిదేవుడవు. సనాతనమైనవాడవు. జగత్తుకు ఆధారుడవు. సకలం తెలిసినవాడవు. పరంధాముడైన నీ చేత విశ్వము వ్యాప్తమై ఉంది.

*అవ. అర్జునుడు భగవానునికి నమస్కారములు అర్పించుట.*

**శ్లో॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః**
**ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ ।**
**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః**
**పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥ 39**

నీవు వాయుదేవుడవు. యముడవు. అగ్ని వరుణులూ నీవే. చంద్రుడవూ, ప్రజాపతి, బ్రహ్మవూ నీవే. బ్రహ్మకి తండ్రివి. అట్టి నీకు వేలాది నమస్కారములు. మళ్ళీ మళ్ళీ నమస్కరిస్తూ ప్రార్థిస్తున్నాను.

**శ్లో॥ నమః పురస్తా తథ పృష్ఠత స్తే**
**నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।**
**అనన్తవీర్యామితవిక్రమ స్త్వం**
**సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥ 40**

మహా సామర్థ్యముగల ఓ పరంధామా! సర్వరూపుడా! నీకు అన్ని వైపులా నమస్కరించుతున్నాను. మహాశక్తి పరాక్రమాలతో నీవు సకలం వ్యాప్తి చెంది ఉన్నావు. అన్ని రూపములూ నీవియే.

*అవ. తెలిసీ తెలియక నీకు నేను చేసిన తప్పిదములను క్షమించమని అర్జునుడు భగవానుని కోరుట.*

**శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం య దుక్తం**
**హే కృష్ణ హే యాదవ హే సఖేతి।**
**అజానతా మహిమానం త వేమం**
**మయా ప్రమాదా త్ప్రణయేన వాపి ॥ 41**
**య చ్చాపహాసార్థ మసత్కృతోఽసి**



**విహారశయ్యాసనభోజనేషు।**
**ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం**
**త త్క్షామయే త్వా మహ మప్రమేయమ్ ॥ 42**

నీ మహా మహిమను తెలుసుకొనలేక నిన్ను నా మిత్రునిగా భావించి చనువుతో గానీ, పొరపాటు వల్ల గానీ ఓ శ్రీకృష్ణా!, ఓ యాదవా! ఓ మిత్రుడా! అని సంబోధించినందుకు.... తొందరపడి తెలియక పిలిచినందుకు నా అపరాధమును క్షమించు.

విహారమప్పుడూ, భోజన శయ్యాది సమయాల్లోనూ, ఒంటరిగా ఉన్నప్పుడూ మాటల తప్పులు చేసినాను. దయతో నన్ను క్షమించుమని ప్రార్థిస్తున్నాను.

**శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య**
**త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్।**
**స త్వత్సమోఽ స్త్యభ్యధికః కుతో ఽన్యో**
**లోకత్రయేఽ ప్యప్రతిమప్రభావ ॥ 43**

కాన ఓ ప్రభూ! సర్వేశ్వరుడవు. ఈ చరాచర ప్రాణి లోకమునకు తండ్రివీ, పూజ్యుడవూ, గురువర్యునివి. ముల్లోకాల్లోనూ నీకు సరిసమానులు లేరు. ఇంకా అధికులేల ఉండగలరు.

*అవ. ఎవరి పొరపాట్లను ఎవరు క్షమించగలరో అర్జునుడు చెప్పి తనని రక్షించమని ప్రార్థించుట.*

**శ్లో॥ తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం**
**ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్।**
**పి తేవ పుత్రస్య సఖేవ సఖ్యుః**
**ప్రియః ప్రియా యార్హసి దేవ సోఢుమ్ ॥ 44**

కాన ఓ దేవా! నేను సాష్టాంగ ప్రణామము చేస్తూ నన్ను కరుణించమని ప్రార్థిస్తున్నాను. తండ్రి పుత్రుడి తప్పులనూ, స్నేహితుడు స్నేహితుని అపరాధమునూ, ప్రియుడు ప్రియురాలి లోపమునూ క్షమించినట్టు నీవూ నా తప్పులను క్షమించు.

అవ. తనకి భయంగా ఉందని పూర్వ దివ్య మంగళరూపంతో శ్రీకృష్ణుని కనిపించమని అర్జునుడు ప్రార్థించుట.

**శ్లో॥ అదృష్టపూర్వం హృషితోஉస్మి దృష్ట్వా**
**భయేన చ ప్రవ్యథితం మనో మే।**
**త దేవ మే దర్శయ దేవ రూపం**
**ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 45**

నేనుగానీ, అన్యులు గానీ.. మరెవ్వరు గానీ చూడని నీ విశ్వరూపాన్ని చూసి సంతోషపడి ఉన్నాను. కానీ భయంతో నా మనస్సు భీతి చెందింది. జగన్నాథా! నీ పూర్వరూపమున నన్ను కరుణించు.

**శ్లో॥ కిరీటినం గదినం చక్ర హస్త**
**మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ।**
**తేనైవ రూపేణ చతుర్భు జేన**
**సహస్ర బాహో భవ విశ్వమూర్తే ॥ 46**

ఓ విశ్వరూపా! సహస్ర బాహూ... కిరీటముతో, గదతో, చక్రములతో, చతుర్భుజాలతో నీ మనోహర రూపమును నేను దర్శింపగోరుతున్నాను. ఆ రూపముతో నన్ను కరుణించుము.

శ్రీ భగవాన్ ఉవాచ.

**శ్లో॥ మయా ప్రసన్నేన త వార్జు నేదం**
**రూపం పరం దర్శిత మాత్మ యోగాత్।**



**తేజోమయం విశ్వ మనన్త మాద్యం**
**యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47**

శ్రీభగవానుడు పలికెను. తేజోవంతమైనదీ, విశ్వరూపమైనదీ, అనంతమైనదీ... ఆది నందు ఉండేదీ, నీవు గాక మరెవ్వరూ దర్శింపనిదీ అయిన నా పరమరూపమును నాచే ప్రసన్నుడవైన నీకు ఆత్మయోగములో చూపించటమైనది.

అవ. నా ఈ విశ్వరూపాన్ని ఎవరూ గాంచలేదని శ్రీభగవానుడు చెప్పుట.

**శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనై ర్న దానైః**
**న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః।**
**ఏవం రూప శ్శక్య అహం నృలోకే**
**ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥ 48**

ఓ అర్జునా! వేదాధ్యయముల వల్లగానీ, యజ్ఞయాగాదుల వల్లగానీ, దానముల వల్లగానీ, తపస్సు ద్వారా గానీ, పుణ్యకార్యాల వల్లగానీ ఈ మనుష్య లోకము నా విశ్వరూపము చూడలేదు. నీవు తప్ప మరెవ్వరూ చూడసాధ్యం కానిది.

అవ. శ్రీకృష్ణుడు తన పూర్వ రూపంతో కానవచ్చుట.

**శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో**
**దృష్ట్వా రూపం ఘోర మీదృ జ్మ మేదమ్।**
**వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం**
**త దేవ మే రూప మిదం ప్రపశ్య ॥ 49**

అట్టి నా భయంకర రూపమ్ము చూసి భీతి, వ్యథ చెందవలదు. మోహమునకు గురికావలదు. భయాన్ని వీడు.

శాంతచిత్తుడవై శంఖ చక్ర గదా పద్మములతో వుండే నా పూర్వ రూపమును చూడుము.

సంజయ ఉవాచ.

శ్లో॥ ఇ త్యర్జునం వాసుదేవ స్త థోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా ॥ 50

 సంజయుడు ధృతరాష్ట్రునితో పలికెను.

శ్రీకృష్ణ భగవానుడు అర్జునుడితో అటుల చెప్పి తన పూర్వ దివ్య మంగళ రూపంతో తిరిగి అర్జునునికి కనపడెను. భీతి చెంది వున్న అర్జునునికి ధైర్యం చెప్పాడు.

*అవ. తనకి ఎంతో పరమానందంగా వుందని పార్థుడు చెప్పట.*

అర్జున ఉవాచ.

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః ॥ 51

 అర్జునుడు పలికెను. ఓ జనార్ధనా! అతి సౌమ్యమైన, సుందరమైన నీ ~~ఈ~~ రూపమును చూసి నా మనస్సు చిత్తవైకల్యముతో పాటు ప్రశాంత స్థితిని పొందుతున్నది.

*అవ. నీకు చూపిన ఆ మహా విశ్వరూపాన్ని దేవాదిదేవతలు కూడా చూడ తపించిపోతారని శ్రీభగవానుడు చెప్పట.*

శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి య న్మమ।
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః ॥ 52



 శ్రీభగవానుడు పలికెను. అర్జునా...నీవు చూసిన నా విశ్వ రూపము చూడ శక్యము కానిది. దేవతలు సహితము సదా ఆ రూపమును దర్శింప కోరుకుందురు.

*అవ. మహా విశ్వరూపం సందర్శించటానికి మార్గం శ్రీ భగవానుడు చెప్పట.*

శ్లో॥ నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా॥ 53

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప ॥ 54

 అర్జునా... విశ్వరూపుడనైన నన్ను గ్రహించుటకు, దర్శించుటకు అనన్య భక్తియే సాధనము. భక్తి ద్వారానే ఇది సాధ్యము.

*అవ. తనని ఎవరెవరు ఎలాంటి గుణాలతో పొందగలరో శ్రీ భగవానుడు చెప్పట.*

శ్లో॥ మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః।
నిర్వైర స్సర్వభూతేషు య స్సమా మేతి పాణ్డవ ॥ 55

 ఓ అర్జునా... కర్తవ్య కర్మలనన్నింటినీ నాకు అర్పిస్తూ నేనే పరమగతి అని తలచువాడూ, భక్తి శ్రద్ధలు గలవాడూ, ఐహిక, ప్రాపంచిక విషయాలపై మమకారం లేనివాడూ, ఏ ప్రాణి యందూ శత్రు భావము లేనివాడూ అయిన వాడు మాత్రమే నన్ను పొందగలడు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూపసందర్శనయోగోనామ**
**ఏకాదశోఽ ధ్యాయః**

**మహాసాధనకై జపించాల్సిన మంత్రము**

శ్లో॥ దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ ॥

*11వ అధ్యాయము - 11వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 15, జప సంఖ్య - 13*

**మహాజయమునకై జపించాల్సిన మంత్రము**

శ్లో॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥

*11వ అధ్యాయము - 39వ శ్లోకమును, చేయాల్సిన రోజులు - 15, జప సంఖ్య-15 వేలు*

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః ॥

*11వ అధ్యాయము - 36వ శ్లోకము ఇన్ని రోజులు, ఇన్ని సార్లు అని మనసులో అనుకొని జపించవలయును.*

**చేసిన పాపాలు పోవుటకొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
త దేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస ॥

*11వ అధ్యాయము-45వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50, జప సంఖ్య-1 లక్ష 50 వేలు*

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః ॥

*11వ అధ్యాయము-51వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50, జప సంఖ్య-1 లక్ష 50 వేలు*



శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మ మేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
త దేవ మే రూప మిదం ప్రపశ్య ॥

*11వ అధ్యాయము-49వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50, జప సంఖ్య-1 లక్ష 50 వేలు*

శ్లో॥ ఇ త్యర్జునం వాసుదేవ స్త థోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా ॥

*11వ అధ్యాయము-50వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50, జప సంఖ్య-1 లక్ష*

శ్లో॥ సుదర్దర్శ మిదం రూపం దృష్టవా నసి య న్మమ।
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః ॥

*11వ అధ్యాయము-52వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50, జప సంఖ్య-1 లక్ష 50 వేలు*

శ్లో॥ నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా॥

*11వ అధ్యాయము-53వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50, జప సంఖ్య-1 లక్ష 50 వేలు*

**సకల సమస్యలు తీరిపోవుట కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ ॥

*11వ అధ్యాయము - 11వ శ్లోకము రోజుకు ఎన్నిసార్లు చేయగలిగితే అన్నిసార్లు చేయాలి*

### ఉన్నత విద్యా ప్రాప్తి కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్।
నాన్తం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥

*11వ అధ్యాయము - 16వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 15, జప సంఖ్య - 13 వేలు*

శ్లో॥ య చ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు।
ఏకోఽథవా ప్యచ్యుత తత్సమక్షం
త త్క్షామయే త్వా మహ మప్రమేయమ్ ॥

*11వ అధ్యాయము-42వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50, జప సంఖ్య-1 లక్ష 50 వేలు*

### భార్యా భర్తల సఖ్యత కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ త్వ మాదిదేవః పురుషః పురాణః
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనన్తరూప॥

*11వ అధ్యాయము - 38వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 15,*
*జప సంఖ్య - 15 వేలు*

### మోహము పోవుట కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ నమః పురస్తా తథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ ।
అనన్తవీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥

*11వ అధ్యాయము-40వ శ్లోకము, చేయాల్సిన రోజులు-50,*
*జప సంఖ్య-1 లక్ష 50 వేలు*



### ఆకస్మిక ధనలాభం కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్।
నాన్తం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥

*11వ అధ్యాయము - 16వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 40,*
*జప సంఖ్య - 108*



# భక్తి యోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- *ఈ భక్తి యోగములో 1వ శ్లోకము నుంచి 12వ శ్లోకము వరకూ సాకార, నిరాకారోపాసకుల గూర్చి.*
- *13వ శ్లోకము నుంచి 20వ శ్లోకము వరకూ భక్తుల లక్షణాలు.*



# భక్తి యోగః

*అర్జున ఉవాచ.*

***శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే।***
***యేచా ప్యక్షర మవ్య క్తం తేషాంకే యోగవిత్తమాః ॥ 1***

 *అర్జునుడు పలికెను. ఓ శ్రీకృష్ణా! మహా భక్తితో నిరంతరము నిన్నే భజిస్తూ, ధ్యానిస్తూ పరంధాముడవైన నీ సుందర రూపమును ఆరాధించే వారూ, ఇంకా ఇంద్రియగోచరము గాని అక్షర పరబ్రహ్మను ధ్యానించువారూ ఉంటారు. ఇందులో ఉత్తమమైన యోగి ఎవరు?*
***అవ. అర్జునుడి సందేహాలను శ్రీభగవానుడు తీరుస్తున్నాడు.***

*శ్రీభగవాన్ ఉవాచ.*

***శ్లో॥ మ య్యా వేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే।***
***శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥ 2***

శ్రీభగవానుడు పలికెను. పరమేశ్వరుడైన నా యందు ఏకాగ్రతను నిలిపి నిత్యము నా భజన ధ్యానములతో గడుపుతారో, ఆరాధిస్తారో అట్టి వారు శ్రేష్ఠులు.

**శ్లో॥ యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే।**
**సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్ ॥ 3**
**సన్నియ మ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।**
**తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః ॥ 4**

కానీ ఎవరైతే ఇంద్రియాలని నిగ్రహించి సకల భూతముల హితము కోరుతాడో, సకల ప్రాణులనూ సమానంగా చూస్తాడో వాడు యోగి అవుతాడు. నిర్దేశింప శక్యం గానిదీ, ఇంద్రియములకు కనిపించనిదీ, చలించనిదీ, నిత్యమైనదీ అయిన అక్షర పరబ్రహ్మమును ఎవరు ధ్యానిస్తున్నారో అట్టి వారు నన్ను పొందుతున్నారు.

*అవ. అక్షరబ్రహ్మతత్త్వము ఎంత కఠిన సాధ్యమో*
*శ్రీ భగవానుడు తెలుపుట.*

**శ్లో॥ క్లేశోऽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్।**
**అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి ర వాప్యతే ॥ 5**

అక్షర బ్రహ్మ చింతనము అతికష్టమైనది. దేహాభిమానులకు అవ్యక్త పరబ్రహ్మ ప్రాప్తి అతి కష్టముగా పొందబడుతున్నది.

*అవ. మహా సుఖదుఃఖ సంసారబంధముల నుంచి ఎవర్ని*
*ఒడ్డుకు లాగుతానో శ్రీ భగవానుడు చెప్పట.*

**శ్లో॥ యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।**
**అనన్యే నైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే ॥ 6**
**తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।**
**భవామి న చిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్ ॥ 7**



ఓ అర్జునా... ఎవరు సమస్త కర్మలను నా యందు సమర్పిస్తారో, నన్నే పరమగతిగా తలుస్తారో, నన్నే ధ్యానిస్తూ ఉపాసిస్తారో, అట్టి వారిని జనన మరణ ప్రవాహ రూప సంసార సముద్రం నుంచి శీఘ్రముగా ఉద్ధరిస్తున్నాను.

**శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।**
**నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ 8**

అర్జునా! నాయందే మనస్సును స్థిరముగా నిలిపి, బుద్ధిని నా యందే ఉంచిన నా యందు స్థిరముగా ఉండగలవు. ఇందు ఎట్టి సందేహమూ లేదు.

*అవ. స్థిరమనస్సు లేకపోతే అభ్యాసయోగం చేయమని*
*శ్రీకృష్ణుడు వచించుట.*

**శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।**
**అభ్యాసయోగేన తతో మా మి చ్ఛాప్తుం ధనఞ్జయ ॥ 9**

ఓ అర్జునా... మనస్సును స్థిరముగా నా యందు నిల్పుటకు వీలుకానిచో అభ్యాస యోగముల ద్వారా ప్రయత్నించవచ్చును.

**శ్లో॥ అభ్యాసే ప్యసమర్థోऽసి మత్కర్మపరమో భవ।**
**మదర్థ మపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి ॥ 10**

అభ్యాసము చేయుటకు కూడా అశక్తుడవైనచో నా నిమిత్తమైన కర్మ యందు నిరతుడవుకా. నాకై కర్మలను ఆచరించినా నీవు సిద్ధిని పొందగలవు.

**శ్లో॥ అ థైతద ప్యశక్తోऽసి కర్తుం మద్యోగ మాశ్రితః।**
**సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ ॥ 11**

నా నిమిత్తం కర్మలను ఆచరించుటకు కూడా అశక్తుడవైతే ఆత్మ నిగ్రహం కలిగి వుండు.

నన్నే ఆశ్రయించి కర్మఫలాపేక్ష త్యజించి కర్మలను చేయుము.

*అవ. పరమశాంతి లభించే విధానములు చెప్పట.*

**శ్లో॥ శ్రేయో హి జ్ఞాన మభ్యాసాద్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే।**
**ధ్యానా త్కర్మ ఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్॥ 12**

అభ్యాసము కంటే జ్ఞానము శ్రేష్ఠము. జ్ఞానము కంటే ధ్యానము ఉత్తమం.

అట్లే ధ్యానం కన్నా కర్మఫలత్యాగము మిక్కిలి శ్రేష్ఠం. త్యాగము వల్ల పరమశాంతి లభిస్తుంది.

*అవ. తనకి ఎలాంటి లక్షణములు కలిగిన భక్తుడు ఇష్టుడో భగవంతుడు చెప్పట.*

**శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ।**
**నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖసుఖః క్షమీ ॥ 13**
**సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।**
**మయ్యర్పితమనోబుద్ధి ర్యో మే భక్త స్సమే ప్రియః ॥ 14**

సకల భూతములను ద్వేషింపనివాడూ, సకల ప్రాణుల యందు ప్రేమాభిమానాలు కలవాడూ, మమకార అహంకారములు లేనివాడూ, సుఖదుఃఖాలను సమముగా భావించువాడూ, సహన శీలుడూ, అన్ని వేళలా తృప్తి కలవాడూ యోగి.

అతడు ఆత్మ నిగ్రహం కలవాడు. దృఢచిత్తము కలవాడు. అట్టి వాడు నాకు ఇష్టుడు.

**శ్లో॥ యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః।**
**హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో య స్సచ మేప్రియః ॥ 15**



ఎవరి వల్ల ఎవరికి క్షోభ కలుగదో, ఎవరు ఉద్వేగమును పొందడో, హర్షము, ఈర్ష్య, భయమూ, వికారములు లేనివాడైన భక్తుడు నాకు ప్రీతి కలవాడు.

**శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః।**
**సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥ 16**

కోరికలూ, కాంక్షలు లేనివాడూ, శరీరమును, ఇంద్రియాలను శుచిగా ఉంచినవాడూ, పక్షపాత రహితుడూ, ఎలాంటి బాధలకూ దుఃఖము చెందనివాడూ, చలించనివాడూ సకల కర్మల యందు శుభాశుభ కర్మాదులను విడిచిన వాడయిన భక్తుడు నాకు ప్రియుడు.

**శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి।**
**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః ॥ 17**

ఎవరు ఇష్టమైన వస్తువుకి సంతోషించడో, దేని యందు ద్వేషము లేకుండా ఉంటాడో, దేనికీ శోకింపడో, అదే విధంగా దేనినీ ఆశించడో అట్టి వాడు నాకు ఇష్టుడు.

*అవ. సుఖ దుఃఖాల యందు సమభావంతో ఉన్నవాడు నాకు ప్రీతికరుడని శ్రీ భగవానుడు చెప్పట.*

**శ్లో॥ సమ శ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।**
**శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః ॥ 18**
**తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్।**
**అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః ॥ 19**

శత్రుమిత్రులందూ, మానావమానములు, శీతోష్ణములు, సుఖములు వంటి వాటి పట్ల సమబుద్ధి గలవాడై అన్నింటినీ సమముగా స్వీకరించువాడు, మౌనంతో ఉండేవాడూ, ఉన్నదానితో సంతృప్తి

చెందువాడూ, గృహాదులపై ఆసక్తి లేనివాడూ, నిశ్చయ బుద్ధి గలవాడూ, నా యందు భక్తితో గూడిన వాడూ అయిన భక్తుడు నాకు ప్రియతముడు, ఇష్టుడు.

శ్లో॥ యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః ॥ 20

ఎవరు శ్రద్ధగా ముందు చెప్పినట్టు సద్గుణవంతులై నన్నే పరమ గతిగా భావించి శ్రద్ధతో ఆచరించెదరో అట్టి భక్తులు నాకు అత్యంత ప్రియము కాగలరు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే భక్తియోగంబన్నది ద్వాదశాధ్యాయము**

**సకల దోష వినాశనం కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ శ్రేయో హి జ్ఞాన మభ్యాసాద్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే।
ధ్యానా త్కర్మ ఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్॥

*12వ అధ్యాయము - 12వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 21, జప సంఖ్య - 15 వేలు*

**ఋణవిమోచనము కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి న చిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్ ॥

*12వ అధ్యాయము - 7వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 40, జప సంఖ్య - 108*





# క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

★ క్షేత్రక్షేత్రజ్ఞ విభాగ యోగములో 1వ శ్లోకము నుంచి 7వ శ్లోకము వరకూ క్షేత్రక్షేత్రజ్ఞముల యొక్క స్వరూపములు.

★ 8వ శ్లోకము నుంచి 12వ శ్లోకము వరకు జ్ఞాన గుణము.

★ 13వ శ్లోకము నుంచి 35వ శ్లోకము వరకూ క్షేత్రజ్ఞాల వర్ణనమూ, ప్రకృతీ పురుషుల వర్ణనము.

# క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగః

అర్జున ఉవాచ.

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ।
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయంచ కేశవ ॥ 1

అర్జునుడు చెప్పెను. ఓ శ్రీకృష్ణా! ప్రకృతిని, పురుషుడిని, క్షేత్రమును, క్షేత్రజ్ఞానిని, జ్ఞానమును, జ్ఞేయమును... వీటి గూర్చి తెలుసుకొనగోరుతున్నాను.

అవ. అర్జునుడి ప్రశ్నలకు శ్రీ భగవానుడు సమాధాన మిచ్చుట.

భగవాన్ ఉవాచ.

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మి త్యభిధీయతే।
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ 2

శ్రీభగవానుడు పలికెను. ఓ కౌంతేయా! ఈ శరీరమును క్షేత్రమంటారు. ఈ శరీరమును క్షేత్రమని తెలుసుకున్నవాడిని క్షేత్రజ్ఞుడని క్షేత్రక్షేత్రజ్ఞమును తెలుసుకున్నవారు చెబుతారు.



అవ. సకల శరీరాల్లోనూ క్షేత్రజ్ఞుడను తానే అని చెప్పట.

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞ యో ర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥ 3

ఓ అర్జునా.... అన్ని శరీరముల యందున్న జీవాత్మ అనగా క్షేత్రజ్ఞుడను నేనే అని తెలుసుకొనుము. క్షేత్ర క్షేత్రజ్ఞుల జ్ఞానమేదయితే ఉందో అదియే అసలు జ్ఞానము.

అవ. క్షేత్ర స్వభావములను వివరించుట.

శ్లో॥ తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।
సచ యో యత్ప్రభావశ్చ త త్సమాసేన మే శృణు ॥ 4

క్షేత్రము యొక్క స్వభావము ఏదో, ఎలాంటి వికారము గలదో, మరెలాంటి ప్రభావములు గలదో సంగ్రహంగా చెప్పెదను వినుము.

శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః ॥ 5

ఈ క్షేత్రక్షేత్రజ్ఞ స్వభావముల గూర్చి వశిష్ఠాది మహర్షులు యోగశాస్త్రములో చెప్పారు. ఇంకా బ్రహ్మ బోధక వాక్యములలో ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల గూర్చి వివరించారు. అలాగే ఋగ్వేద మంత్రములతో వేరు వేరుగా తెల్పినవి.

శ్లో॥ మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవచ।
ఇన్ద్రియాణి దశైకంచ పఞ్చ చేన్ద్రియగోచరాః ॥ 6
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనాధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥ 7

పంచభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, పదకొండు ఇంద్రియములు, పంచేంద్రియాలు, చైతన్యము, ధైర్యము, మనస్సు, ఇచ్ఛా, సుఖ దుఃఖములు.... వీని సముదాయమై వికార సహితమైనట్టి క్షేత్రము సంక్షిప్తముగా చెప్పబడింది.

శ్లో॥ అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥ 8

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవచ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥ 9

శ్లో॥ అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥ 10

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥ 11

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థచిన్తనమ్।
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతోఽన్యథా ॥ 12

అభిమానం లేకుండుట, డంబము లేకుండుట, పరప్రాణులను హింసించకుండుట, సహనం, శౌచం, ఆత్మనిగ్రహము, ఇంద్రియ వ్యామోహము, పుట్టుక, మరణాల మధ్య కలిగే దుఃఖదోషాలను గూర్చి ఆలోచన లేకుండుట, సంసార వ్యామోహంలో పడకుండుట.

రోగముల వల్ల కలిగే దుఃఖాన్ని తలచుట, సంతానం గూర్చి ఆలోచించుట, దోషమును తరచి తరచి స్మరించుట వంటి వాటిపై ఆసక్తి లేకుండుట, శుభాశుభములప్పుడు ఒకే రీతిగా ఉండుట, సదా నా యందే నిశ్చల స్థిర భక్తి కలిగి ఉండుట, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని కలిగి ఉండటము, తత్త్వజ్ఞానము కలిగి ఉండటము జన సమూహము నందు ప్రీతి లేకుండా ఉండుట... ఇట్టి స్వభావముగల వానిది అంతయూ జ్ఞానము. కానిది అజ్ఞానము.



అవ. అమృత స్వరూప మోక్షాన్ని చెప్పట.

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽ మృతమశ్నుతే।
అనాది మత్పరం బ్రహ్మ న స త్త న్నాసదుచ్యతే ॥ 13

ఏది తెలుసుకోదగిన బ్రహ్మ స్వరూపమో, దేన్ని తెలుసుకున్న మనుష్యుడు అమృత స్వరూపమైన మోక్షాన్ని పొందుతున్నాడో దాన్ని తెలుపుతున్నాను. దానిని సత్తని కాని అసత్తని కాని చెప్పుటకు వీలులేదు.

అవ. ఆదియే కాని అంతము లేని దాని గూర్చి చెప్పట.

శ్లో॥ సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వత శ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥ 14

ఆది అంతటా చేతులూ, కాళ్ళూ, తలలూ, ముఖాలూ, చెవులూ కలిగి ప్రపంచమునందు సమస్తము ఆవరించుకొని ఉంది.

అవ. ఆత్మస్వభావమును, శక్తిని భగవానుడు అర్జునుడికి వివరించుట.

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥ 15

శ్లో॥ బహి రన్తశ్చ భూతానా మచరం చర మేవచ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికేచతత్ ॥ 16

శ్లో॥ అవిభక్తంచ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
భూతభర్తృచ త ద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ ॥ 17

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥ 18

ఆత్మ సర్వేంద్రియ గుణాలని ప్రకాశింప చేస్తుంది. సర్వేంద్రియములు లేనిది, దేనికీ అంటనిది. అన్నింటినీ భరించునది. గుణరహితమైనది. అన్ని గుణములను అనుభవించునది. ప్రాణుల

లోపల, వెలుపల ఉండునదీ, కదలనిదీ, కదిలేదీ.... అతి సూక్ష్మమైనది. ఎంతో దూరంగా ఉండునదీ, దగ్గరికీ ఉండునది. విభజించలేనిదీ, విభజించబడేదీ, సృష్టించేదీ, లయం చేసేది, పోషించేది, జ్యోతులకు జ్యోతి, తపస్సు కన్నా గొప్పది, జ్ఞాన స్వరూపమైనది, జ్ఞానగుణాలను పొందినది, సకల ప్రాణుల యందు పోషించి ఉన్నది, ప్రకాశించునది అయి ఉన్నది.

**శ్లో॥ ఇతి క్షేత్రం తథాజ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।**
**మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే ॥ 19**

ఆ ప్రకారం క్షేత్రము, అలాగే జ్ఞానము, జ్ఞేయములు సంగ్రహంగా చెప్పబడినవి. నాయందు సదా స్థిర భక్తి గలవాడు వాటిని గ్రహించి నా స్వరూపమను మోక్షాన్ని పొందుటకు అర్హుడవుతున్నాడు.

**శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ వి ద్ధ్యనాదీ ఉభావపి।**
**వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్ ॥ 20**

ఓ అర్జునా! ప్రకృతి పురుషులు ఆదిలేని వారిగా తెలుసుకో. వికారములు, గుణములు, ప్రకృతి వల్ల జన్మించినవిగా గ్రహించు.

**శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే।**
**పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే ॥ 21**

కార్యాకారణములు కలుగుటకు ప్రకృతే హేతువు. సుఖాలూ, దుఃఖాలూ అనుభవించుట యందు పురుషుడు హేతువని చెప్పబడుతోంది.

అవ. దేనికి ఏది హేతువో శ్రీ భగవానుడు చెప్పట.

**శ్లో॥ పురుషః ప్రకృతిస్థోహి భుఙ్త్కే ప్రకృతిజాన్ గుణాన్।**
**కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోని జన్మసు॥ 22**



ప్రకృతి యందు ఉండే పురుషులు ఆ ప్రకృతి వల్ల పుట్టిన సుఖదుఃఖాలను అనుభవిస్తున్నారు. ఆయా గుణముల సంగమముల వల్లనే ఆ జీవునికి ఉత్తమ, అధమ జన్మలు కలుగుతున్నాయి.

అవ. దేహంలోని పరమాత్ముని గూర్చి వచించుట.

**శ్లో॥ ఉపద్రష్టానుమన్తాచ భర్తా భోక్తా మహేశ్వరః।**
**పరమాత్మేతిచా ప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః॥ 23**

ఈ శరీరంలో అంటీ అంటనట్టుగా వుండే దివ్య పురుషుణ్ణి సాక్షీభూతుడనీ, అనుమతించేవాడనీ, భరించేవాడనీ, అనుభవించేవాడనీ పరమాత్మ అనీ, భోక్త అనీ వేదములు తెలవిస్తున్నాయి.

అవ. ప్రకృతి పురుషుల గూర్చి గ్రహించిన వానికి కలుగు ఫలములు చెప్పట.

**శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైః స్సహ।**
**సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ 24**

ఆ విధముగా ఆత్మని గూర్చీ, గుణాలతో వున్న ప్రకృతి గూర్చీ తెలుసుకున్నవాడు, అట్టివాడు ఎలా ఉన్నప్పటికీ మరల మరల సుఖదుఃఖములైన ఈ జన్మలను ధరింపడు.

అవ. ఏ ఏ యోగముల ద్వారా తనని పొందుతున్నారో శ్రీ భగవానుడు చెప్పట.

**శ్లో॥ ధ్యానే నాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా।**
**అన్యే సాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 25**

ధ్యానయోగం ద్వారా కొంతమందీ, జ్ఞానయోగం వల్ల మరికొంతమందీ, కర్మయోగం ద్వారా ఇంకొంత మందీ పరమాత్మను దర్శిస్తున్నారు.

అవ. యోగముల వల్ల కాకుండా తనని పొందే విధం గూర్చి శ్రీ భగవానుడు అర్జునుడికి చెబుతున్నాడు.

శ్లో॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥ 26

అవి తెలుసుకోలేని ఇంకొందరు గురువుల ద్వారా ఉపదేశం పొందుతున్నారు. అట్టి గురు ఉపదేశంతో శ్రద్ధతో పాటించినవారు చావు పుట్టుకలనే సంసార సముద్రం నుంచి బైటపడుతున్నారు.

శ్లో॥ యావ త్సంజాయతే కిఞ్చి త్సత్త్వం స్థావరజఙ్గమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్త ద్విద్ధి భరతర్షభ ॥ 27

ఓ భరతవంశశ్రేష్ఠా... ఓ అర్జునా! ~~ఈ~~ ప్రపంచంలో నున్న చరాచరాత్మకమైన ప్రతి వస్తువు ప్రకృతి పురుషుల కలయిక వల్ల కలుగుచున్నవని గ్రహించు.

అవ. జ్ఞాని లక్షణాన్ని శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
వినశ్య త్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥ 28

శరీరాలు నశిస్తున్నా తను నశించకుండా సకల ప్రాణులలో సమానంగా ఉండే పరమాత్మని గ్రహించిన వాడే జ్ఞాని.

అవ. సకల ప్రాణుల్లో ఏకరూపంగా తానున్నానని శ్రీభగవానుడు చెప్పట.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాఙ్గతిమ్॥ 29

సకల ప్రాణులయందు ఒకే రూపంగా... ఏక రూపంగా ప్రకాశిస్తున్న పరమాత్మను దర్శించినవాడు మనస్సు వల్ల కష్టాలూ, బాధలూ పడడు. తనని తాను హింసించుకోడు. అనేక రకాలుగా



కానవస్తున్న ప్రాణులయందు పరమాత్మ స్థితమై ఉన్నాడని గ్రహిస్తాడు. అట్టి వాడు మోక్షాన్ని పొందుతాడు.

అవ. జ్ఞాని లక్షణాలు.

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి॥ 30

ప్రకృతి వల్లే సమస్త కర్మలు సాగుతున్నాయి. అంతేగానీ తానేమీ కారణం కాదనీ తాను కర్తననీ తెలుసుకున్నవాడు జ్ఞాని.

అవ. బ్రహ్మ స్వరూప తత్త్వమును చెప్పట.

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా ॥ 31

వేరు వేరు ప్రాణులు, భిన్నమగు ప్రాణులు ఆత్మ యందు ఒకటిగానే ఉన్నవనీ, విస్తార భూత కల్పన అంతా ఆత్మ నుండే అని గ్రహించిన వాడు బ్రహ్మస్వరూపుడు.

అవ. తనకి ఏ కర్మ ఫలము అంటదని శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః।
శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే ॥ 32

ఓ కౌన్తేయా! అట్టి పరమాత్మ ఆదిరహితుడు, గుణ రహితుడు కావటం వల్ల దేనికీ కర్తకాడు. కాన కర్మఫలమన్నది అంటదు.

అవ. ఆత్మకి దేహ సంబంధిత సుఖదుఃఖాలేవీ అంటవని శ్రీ భగవానుడు చెప్పుట.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే।
సర్వ త్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే ॥ 33

అంతా వ్యాపించిన ఆకాశము సూక్ష్మమైనదవుట వల్లే దేనితోనూ కలియదు. అట్లే ఆత్మ శరీరమంతా వ్యాపించి ఉన్నా శరీరేంద్రియ కార్యాలైన కర్మలచే అంటబడదు.

శ్లో॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ॥ 34

ఓ అర్జునా! సూర్యుడు సకల లోకాల్నీ ప్రకాశింప చేస్తున్నట్లు క్షేత్రజ్ఞుడైన పరమాత్మ క్షేత్రమంతటినీ ప్రకాశింప చేస్తున్నాడు.

అవ. అట్టివి తెలుసుకున్న వారికి కలిగే ఫలములను గూర్చి చెప్పట.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షంచ యే విదు ర్యాన్తి తే పరమ్ ॥ 35

ఈ విధంగా జ్ఞానదృష్టి కలిగి క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క బేధములూ, సర్వ భూతములు మోక్షం పొందే విధానాన్నీ జ్ఞాన దృష్టితో తెలుసుకున్నవారు పరమగతిని పొందుతారు.

**ఇతి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జునసంవాదే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగోనామ**
**త్రయోదశోఽ ధ్యాయః**

**మానసిక ప్రశాంతత కొరకు జపించాల్సిన మంత్రము**

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽ మృతమశ్నుతే।
అనాది మత్పరం బ్రహ్మ న స త్త న్నాసదుచ్యతే ॥

13వ అధ్యాయము - 13వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 25,
జప సంఖ్య - 25 వేలు





# గుణత్రయవిభాగ యోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

★ ఈ గుణత్రయ విభాగయోగములో 1వ శ్లోకము నుంచి 4వ శ్లోకము వరకూ జ్ఞాన మహిమ.

★ 5వ శ్లోకము నుంచి 18వ శ్లోకము వరకూ సత్త్వరజో గుణముల వివరణ.

★ 19 వ శ్లోకము నుంచి 27వ శ్లోకము వరకూ భగవంతుని ప్రాప్తికి మార్గము, గుణాతీతుని లక్షణాలు.

# గుణత్రయవిభాగయోగః

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్।
యద్‌జ్ఞాత్వా మునయ స్స ర్వే పరాంసిద్ధి మితోగతాః ॥ 1

ఓ అర్జునా! దేన్ని తెలుసుకోవటం ద్వారా మానవులంతా ఈ సంసార బంధము నుంచి విముక్తులై సర్వోత్తమమైన మోక్ష సిద్ధిని పొందుతున్నారో అట్టి పరమాత్మకు సంబంధితమైన జ్ఞానమునూ అదియునూ ఉత్తమోత్తమమైన జ్ఞానాన్నీ నీకు మళ్ళీ చెబుతున్నాను.

*అవ. సర్వోతమమైన జ్ఞానాన్ని తిరిగి చెప్పట.*

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః।
సర్గేఽ పి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ ॥ 2

ఆ జ్ఞానాన్ని ఆశ్రయించిన వారు నన్నే పొందుతున్నారు. అలాంటి పురుషులు సృష్టికాలమున జన్మింపరు. ప్రళయమప్పుడు భయ భీతి చెందరు. నశింపరు.

*అవ. ప్రాణికోటిని ఎక్కడ్నించి ఉత్పత్తి చేసేదీ శ్రీ భగవానుడు చెప్పట.*

శ్లో॥ మమయోనిర్మహ ద్బ్రహ్మతస్మిన్ గర్భం దధా మ్యహమ్।
సమ్భవ స్సర్వభూతానాం తతో భవతి భారత ॥ 3



ఓ అర్జునా! మహాగొప్పదయిన మాయ నా మూల ప్రకృతి. సకల ప్రాణులకు జన్మస్థానము. అందునుంచే స్థాపన చేస్తాను. కాన సకల ప్రాణుల ఉత్పత్తి నా యందే జరుగుతున్నది.

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ మూర్తయ స్సమ్భవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥ 4

అర్జునా... ఉత్పన్నములైన సకల ప్రతి రూపాలకు ప్రకృతే తల్లి స్థానము. నేను బీజ ప్రదానము చేయును గాన నేను తండ్రిని.

*అవ. జీవుడ్ని బంధనములలో ఉంచే గుణాలు.*

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః।
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్ ॥ 5

మహాబాహూ... ప్రకృతి నుంచి జన్మించే సత్త్వ, రజ, స్తమో గుణాలన్నీ అవ్యయుడైన జీవుని దేహాన్ని బంధిస్తున్నాయి.

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్।
సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ ॥ 6

అర్జునా.. త్రిగుణములలో సత్త్వ గుణము నిర్మల ప్రకాశవంతము. నిర్వికారము. వికార రహితము. కాగా అది సుఖ సాంగత్యము వల్లా, జ్ఞానమనే అభిలాష వల్లా జీవుణ్నీ బంధిస్తోంది.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్।
త న్నిబధ్నాతి కౌన్తేయ కర్మసఙ్గేన దేహినమ్ ॥ 7

అర్జునా...... రజోగుణము రాగాత్మకము. విషయాభిలాషను పెంచుతుంది. అదే కర్మల యొక్క, కర్మఫలము యొక్క సాంగత్యంతో జీవుణ్ని బంధిస్తోంది.

అవ. మహా బంధకరమైన తమో గుణము గూర్చి
శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వ దేహినమ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్త న్నిబధ్నాతి భారత ॥ 8

అర్జునా..... ఇక తమో గుణము సకల ప్రాణులను మోహితులుగా చేస్తుంది. దానితో అజ్ఞానము కలుగును. మరుపులతో, నిద్రతో జీవుణ్ని బంధిస్తుంది.

అవ. ఆ మూడు గుణాలు మనుజుడికి ఏ ఏ
ఫలితాలిస్తాయో చెప్పట.

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత ॥ 9

ఓ అర్జునా! సత్త్వగుణము సుఖమునందు ఉంచును. రజో గుణము కర్మము నందు నిమగ్నం చేస్తుంది. తమో గుణము జ్ఞానమును కప్పి వేయును.

అవ. ఏ ఏ గుణాలు ఏ ఏ గుణాలను అణిచి వేస్తాయో శ్రీ
భగవానుడు చెప్పట.

శ్లో॥ రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా ॥ 10

ఓ అర్జునా! సత్త్వగుణము రజస్తమోగుణములను అణచి వృద్ధి పొందుతుంది. అట్లే సత్త్వతమో గుణాలను అణిచి రజోగుణము వృద్ధి చెందుతుంది. అలాగే సత్త్వరజోగుణాలను అణిచి వేసి తమో గుణము వృద్ధి చెందుతుంది.

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధంసత్త్వమిత్యుత ॥ 11



ఈ శరీరంలోని ద్వారాలలో, సర్వేంద్రియములలో ఎప్పుడు జ్ఞానము ప్రకాశవంతంగా ఉత్పన్నమవుతుందో అప్పుడు సత్త్వగుణము వృద్ధి చెందినదని భావించాలి.

అవ. రజోగుణ భీకర రూపం గూర్చి చెప్పట.

శ్లో॥ లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా।
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ॥ 12

అర్జునా! రజోగుణము వృద్ధి చెందినప్పుడు లోభము కలుగుతుంది. ప్రాపంచిక విషయాలలో స్వార్థ బుద్ధి పెరుగుతుంది. అశాంతి, ఆశలు లాంటి ఎన్నో గుణాలు కలుగుతాయి.

అవ. మోహము వల్ల కలుగు నష్టము చెప్పట.

శ్లో॥ అప్రకాశోఽ ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ।
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన ॥ 13

తమోగుణం విశేషంగా పెరిగినప్పుడు అవివేకమూ, సోమరితనమూ, అంతఃకరణమూ మోహింప చేస్తుంది. వ్యర్థమైన పనులతో, నిద్రలతో మనుజుడు నిండిపోతాడు.

అవ. పుణ్యలోకాలను ఏ గుణం ద్వారా పొందగలరో చెప్పట.

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రలయం యాతి దేహభృత్।
తదోత్త మవిదాంలోకా నమలాన్ ప్రతిపద్యతే ॥ 14

సత్త్వగుణము వృద్ధి చెందినప్పుడు ఆ మనుజుడు పరలోకం చేరుకున్నచో, ఉత్తమములైన వారు పొందే పుణ్యలోకాలని పొందుతాడు.

అవ. పశువులుగా, పక్షులుగా ఎలాంటి గుణాలున్న వారు
తిరిగి జన్మిస్తారో శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ రజసి ప్రలయం గత్వా కర్మసఙ్గిషు జాయతే ।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥ 15

అలాగే రజోగుణము వ్యాప్తి చెందినప్పుడు మనుష్యుడు పరలోకం చేరినచో, అతడు తిరిగి కర్మకు లోనై భూమిపై పుడతాడు. తమోగుణము వ్యాప్తి చెందినప్పుడు జీవాత్మను వదలితే పశుపక్షి కీటకాల్లో జన్మిస్తాడు.

అవ. కర్మఫలముల గూర్చి శ్రీ భగవానుడు వచించుట.

శ్లో॥ కర్మణ స్సుకృత స్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥ 16

సాత్త్వికమైన పుణ్యకర్మలకు ఫలము నిర్మలమైన సుఖము. రాజసకర్మకు ఫలము దుఃఖము. తామసకర్మలకు అనగా అధర్మమునకు అజ్ఞానమే ఫలము.

శ్లో॥ సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽ జ్ఞాన మేవచ ॥ 17

సత్త్వగుణము వల్ల జ్ఞానము కలుగుతుంది. రజోగుణము వల్ల లోభము కలుగుతుంది. తమో గుణము వల్ల మరపూ, మోహమూ, అజ్ఞానమూ సిద్ధిస్తుంది.

అవ. ఏ ఏ గుణములు కలవారు ఏ ఏ లోకాల్లో జన్మిస్తారు.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥ 18

సత్త్వగుణము గలవారు మహా పుణ్యలోకాలను పొందు తున్నారు. రజోగుణములు కలవారు మధ్యలోకమున జన్మిస్తున్నారు.



మహా నీచ నికృష్ట గుణములు కలవారు పాప ఫలమున క్రింది లోకాలను చేరుతున్నారు.

అవ. శ్రీ భగవానుడు తన స్వరూపమును తెలుసుకొను విధానం మరల చెప్పట.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽ నుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽ ధిగచ్ఛతి ॥ 19

వివేకవంతుడు సత్త్వాదిగుణాలను కర్తగా భావింపడో, ఎవరు తనను గుణముల కంటే భిన్నమైన వానినని తెలుసుకుంటాడో అట్టి వాడు నా స్వరూపమును అనగా మోక్షమును పొందుతున్నాడు.

శ్లో॥ గుణా నేతా నతీత్య త్రీ న్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽ మృత మశ్నుతే ॥ 20

జీవుడు తన దేహమునకు కారణమైన త్రిగుణములను దాటి.... అనగా జన్మము, మృత్యువు, ముసలితనమూ, రోగాల పట్ల పీడితుడు కాకుండా నన్ను చేరుతున్నాడు.

అవ. అర్జునుడు త్రిగుణాలను ఎలా దాటాలో తెలియచెప్పమని అడుగుట.

అర్జున ఉవాచ.

శ్లో॥ కై ర్లిఙ్గై స్త్రీ న్ గుణా నేతా నతీతో భవతి ప్రభో।
కి మాచారః కథం చైతాం స్త్రీ న్ గుణా నతివర్తతే ॥ 21

అర్జునుడు అడిగాడు.

ఓ ప్రభూ! శ్రీకృష్ణా! ఈ మూడు గుణములను దాటి నిన్ను చేరి మోక్షము పొందుటకు ఎలాంటి గుణములతో సాగాలి. ఎలాంటి ప్రవర్తన ఉండాలి. అలాగే త్రిగుణములను ఎలా దాటాలి.

అవ. త్రిగుణాతీతుడి విలక్షణ లక్షణాలను శ్రీ భగవానుడు చెప్పట.

శ్రీభగవాన్ ఉవాచ.

శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహ మేవచ పాణ్డవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి ॥ 22

శ్లో॥ ఉదాసీనవ దాసీనో గుణై ర్యో నవిచాల్యతే।
గుణా వర్తన్త ఇ త్యేవ యోఽ వతిష్ఠతి నేఙ్గతే ॥ 23

శ్లో॥ సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥ 24

శ్లో॥ మానావమానయో స్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే॥ 25

 శ్రీ భగవానుడు చెప్పెను.

ఓ పాండుపుత్రా! సత్త్వగుణ కార్యాల యందు సుఖమును గానీ, రజోగుణ కార్యాల యందు కార్యప్రవృత్తిని గానీ, తమో గుణ సంబంధమగు మోహమును గానీ ద్వేషింపడో... అలాగే అవి తొలగినప్పుడు ద్వేషించక తిరిగి ఆశించని వాడు గుణాతీతుడు. అట్టివాడు సుఖదుఃఖములందు సమభావం గల వాడై అట్లే ఉదాసీనుడుగా ఉంటాడు.

సత్త్వరజతమో గుణాల యందు కలిగే కార్యాలు కలిగినప్పుడు రాగద్వేషాల వశం కాకుండా, వికారము పొందకుండా ఉంటాడు. అట్టి వాడు రాగద్వేషాలు లేనందుకు సుఖంగా ఉంటాడు. వస్తు ప్రయోజనములు లేనివాడయి రాయినీ, మట్టినీ, బంగారాన్నీ ఒకేలా చూస్తాడు. అతడే జ్ఞాని. ప్రియములకూ, నిందలకూ చలించడు. రెంటి యందు సమభావము కలిగి ఉంటాడు. మానావమానముల యందూ, స్నేహితుల యందూ, శత్రువుల యందూ సమభావంతో ఉంటాడు త్రిగుణాతీతుడు.

అవ. త్రిగుణాతీతునికి కలిగే ఫలం గూర్చి శ్రీకృష్ణుడు చెప్పట.



శ్లో ॥ మాం చ యోఽ వ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్ సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥ 26

 అట్టి త్రిగుణాతీతుడు నన్నే నిత్యం భజియిస్తూ నా స్వరూపాన్ని పొంది బ్రహ్మ తత్త్వమును పొందుతున్నాడు. మోక్షమునకు అర్హుడవుతున్నాడు.

శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽ హ మమృత స్యావ్యయస్యచ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ॥ 27

 అర్జునా! అలాంటి శాశ్వత పరబ్రహ్మకూ, అమృతత్వమునకూ, సనాతన ధర్మాలకీ, ధర్మ సౌఖ్యాలకీ నేనే ఆధార భూతుడను.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే గుణత్రయవిభాగయోగో నామ చతుర్దశోఽ ధ్యాయః**

## మృత్యుభయము తొలగుట కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రలయం యాతి దేహభృత్।
తదోత్త మవిదాంలోకా నమలాన్ ప్రతిపద్యతే ॥

*14వ అధ్యాయము - 14వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 51,*

*జప సంఖ్య - 1 లక్ష*



# పురుషోత్తమప్రాప్తి యోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

- ★ పురుషోత్తమ ప్రాప్తి యోగములో *1*వ శ్లోకము నుంచి *6*వ శ్లోకము వరకూ సంసారము గూర్చి.
- ★ *7*వ శ్లోకము నుంచి *11*వ శ్లోకము వరకూ జీవాత్మ గూర్చి.
- ★ *12*వ శ్లోకము నుంచి *15* వ శ్లోకము వరకూ భగవంతుని ప్రభావము.
- ★ *16*వ శ్లోకము నుంచి *20*వ శ్లోకము వరకూ క్షర - అక్షర - పురుషోత్తముల గూర్చి.



# పురుషోత్తమప్రాప్తియోగః

*అవ. ఏవి గ్రహించటం వల్ల వేదార్థమును గ్రహించిన వాడవుతున్నాడో శ్రీ భగవానుడు వచించుటం.*

*శ్రీ భగవాన్ ఉవాచ.*

**శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।**
**ఛన్దాంసియస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ ॥ 1**

శ్రీ భగవానుడు చెప్పెను. ఆది పురుషుడైన పరమాత్మే సంసార వృక్షములో మూలముగా, బ్రహ్మమే కాండముగా, వేదములే ఆకులుగా ఉన్నాయి. అట్టి సంసార రూప అశ్వత్థ వృక్షము శాశ్వతమైనది. అట్టి సంసార వృక్ష తత్త్వము తెలిసిన వాడు వేదార్థములను ఎరిగినవాడు.

*అవ. సంసార వృక్షమును వర్ణించుట.*

**శ్లో॥ అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా**
**గుణప్రవృద్ధా విషయప్రవాలాః।**
**అధశ్చ మూలా న్యనుసన్తతాని**
**కర్మానుబన్ధీని మనుష్యలోకే॥ 2**

అట్టి సంసార వృక్షమును త్రిగుణములనే జలముతో తడుపుతుండవలెను. అట్టి జలవృద్ధితో వృక్షము కొమ్మలు సత్త్వరజోస్తమోగుణములచే వృద్ధి చెందుతాయి. విషయాలనే చిగుళ్ళుగలవై కింద మీదలకు వ్యాపించి ఉంటాయి. మానవ కర్మ సంబంధము కలగ చేస్తూ అహంకార మమకార వాసనలనే ఊడలూ, వేళ్ళూ పాదుకొని వ్యాపించి ఉంటాయి.

శ్లో ॥ న రూప మ స్యేహ త థోపలభ్యతే,
నాన్తో న చాది ర్నచ సమ్ప్రతిష్ఠా॥
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా।
తతః పదం త త్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తన్తి భూయః॥ 3

శ్లో॥ త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
ద్యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥ 4

అట్టి సంసార వృక్షము యొక్క స్వరూపము తెలియుట సాధ్యం కాదు. ఆ వృక్షము యొక్క ఆది, అంతము, మధ్యము గాని తెలియదు. ఎప్పటినుంచి వున్నదో ఎవరికీ తెలీదు. పాతుకుపోయిన వేళ్ళు గల ఈ రావి చెట్టు వృక్షమును పరమాత్మ జ్ఞానము అనే శస్త్రము చేత చేధించి, ఎవరి నుంచి ఈ ప్రకృతి ప్రారంభమయినదో అట్టి పరమాత్మను శరణు పొందుతున్నాననే ధ్యానముతో భగవంతుడిని అన్వేషించాలి.

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
గచ్ఛ న్త్యమూఢాః పద మవ్యయం తత్॥ 5



మోహాది అభిమానమును వదలిన వారూ, అవివేకము లేనివారూ, ఇష్టా, అయిష్టములు లేనివారూ, రాగద్వేషములు లేనివారూ, సుఖదుఃఖాదులకు అతీతులు, జ్ఞానముతో అజ్ఞానమును నశింప చేసుకున్నవారు పరమపదము పొందుతున్నారు.

అవ. మహాతేజస్సు గల నాకన్నా మరెవ్వరూ లేరని
శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ న త ద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః।
య ద్గత్వా న నివర్తన్తే త ద్ధామ పరమం మమ॥ 6

సకల లోకాల్నీ ప్రకాశింప చేసే సూర్యభగవానుడు గానీ, చంద్రుడు గానీ, అగ్ని గానీ స్వయంప్రకాశమైన నన్ను ప్రకాశింప చేయలేరు. అంతటి పుణ్యాతేజో పరంధామము అయిన నన్ను చేరిన వారు తిరిగి మానవజన్మ ఎత్తరు.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః।
మనష్షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥ 7

సనాతనమైన నా అంశే జీవలోకమందు జీవునిగా ఉంది. అది ప్రకృతియందు స్థితములైన ఇంద్రియాది మనస్సులనూ, శబ్దాది విషయాలనూ ఆకర్షించుచున్నది.

శ్లో॥ శరీరం య దవాప్నోతి య చ్చా ప్యుత్క్రామ తీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయు ర్గన్ధానివాశయాత్॥ 8

గాలి ఓ చోట నుంచి మరో చోటకు వెళ్ళినట్టుగా, దేహేంద్రియ ప్రభువైన జీవుడు ఓ శరీరం విడిచి కర్మ ప్రకారము మరొక శరీరాన్ని స్వీకరించినప్పుడు పూర్వ శరీరం నుంచి మనస్సునీ, ఇంద్రియాలనీ తీసుకొని వెళతాడు.

అవ. ఇంద్రియాలను మనస్సు పొంది ఏ ఫలములు అనుభవిస్తున్నదో చెప్పట.

శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణ మేవచ।
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే॥ 9

ఈ జీవాత్మ చెవీ, కన్నూ, చర్మమూ, నాలుకా, ముక్కు అనే జ్ఞానేంద్రియాల ద్వారా మనస్సుని ఆశ్రయించి మాటా, రూపూ, స్పర్శ, రుచి, వాసనలను పొందుతున్నది.

అవ. అజ్ఞానమును చూడు నేత్రముల గూర్చి శ్రీభగవానుడు చెప్పట.

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితంవాపి భుఞ్జానంవా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః॥ 10

జీవుడు శరీరమును త్యజించినప్పుడూ, ఉండునప్పుడూ, అనుభవిస్తున్నప్పుడూ, గుణములతో కూడినప్పుడూ అజ్ఞానులు చూడలేరు. జ్ఞాననేత్రములు గలవారు తెలుసుకొనగలరు.

అవ. ఆత్మ దర్శనం గూర్చి భగవానుడి బోధ.

శ్లో॥ యతన్తో యోగిన శ్చైనం పశ్యన్త్యాత్మ వ్యవస్థితమ్।
యతన్తోఽ ప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః॥ 11

అంతఃకరణము గల యోగులు తమ బుద్ధి గుహ యందు ఆత్మ దర్శనము చేసుకొనుచున్నారు. అలాంటి అంతఃకరణములు లేనివారు... అనగా రాగద్వేషములు కలిగి విషయములపై వ్యామోహములున్నవారు ఆత్మ దర్శనము చేసుకొనలేరు.

శ్లో॥ య దాదిత్యగతం తేజో జగ ద్భాసయతేఽ ఖిలమ్।
య చ్చన్ద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్॥ 12

సకల లోకాల్నీ ప్రకాశింప చేయు సూర్య తేజస్సూ, చంద్ర తేజస్సూ నాదే అని గ్రహించు.

అవ. ఆహారాదులను సృష్టించి ఇస్తున్నదీ తనే అనే చెప్పట.



శ్లో॥ గా మావిశ్యచ భూతాని ధారయా మ్యహ మోజసా।
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః॥ 13

భూమి యందు ప్రవేశించి నా శక్తి ద్వారా సకల భూతములను ధరిస్తున్నాను. పోషిస్తున్నాను. రస స్వరూపునిగా చంద్రుడనై ఓషధులను చేకూరుస్తూ పుష్టిని కలిగిస్తున్నాను.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్॥ 14

నేను జఠరాగ్నిగా ప్రాణుల శరీరాన్ని ఆశ్రయించి, ప్రాణ పాన వాయువులతో గూడినదయిన నాలుగు విధములైన ఆహారమును జీర్ణము చేసుకొనుచున్నాను.

అవ. వేదాంత జ్ఞానుడ్ని తనే అని శ్రీ భగవానుడు అర్జునుడికి చెప్పట.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ।
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్॥ 15

సకల ప్రాణులలో అంతర్యామిని నేనే. నా నుంచే స్మృతి, జ్ఞానము, మరుపులు కలుగుతున్నాయి. వేదముల ద్వారా తెలుసుకొన వల్సిన వాడను నేనే. వేదాంతకర్తనూ, వేద జ్ఞానుడనూ నేనే.

శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽ క్షర ఉచ్యతే॥ 16

ఈ లోకమందు క్షరుడూ, అక్షరుడూ అనే ఇద్దరు పురుషులు కలరు. సకల భూతములు క్షరములు. కూటస్థుడగు జీవుడు అక్షరుడు.

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయఈశ్వరః॥ 17

క్షరుడూ, అక్షరుడి కన్నా ఉత్తముడైన పురుషుడు మరొకరు గలరు. అతడు నాశనం లేనివాడు. పరమాత్మ. ముల్లోకములందు ప్రవేశించి భరించి పోషించుచున్నాడు.

అవ. పురుషోత్తముడిగా తన పాత్ర గూర్చి అర్జునుడికి చెప్పట.

శ్లో॥ యస్మాత్క్షర మతీతోऽహ మక్షరా దపి చోత్తమః।
అతోऽస్మి లోకే వేదేచ ప్రణితః పురుషోత్తమః॥ 18

నేను క్షరస్వరూపుని కన్నా మించిన వాడను. అక్షర స్వరూపుని కన్నా అనగా జీవాత్మకన్నా శ్రేష్ఠుడను. దాని వల్ల వేదముల నందూ, జగత్తునందూ పురుషోత్తముడిగా ప్రసిద్ధి పొందాను.

శ్లో॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
న సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత॥ 19

ఓ అర్జునా! జ్ఞాని అలా పురుషోత్తముడనైన నన్ను తెలుసుకొనుచున్నాడు. సకలం గ్రహించి నన్నే భజియించు చున్నాడు.

అవ. ఈ అధ్యాయము ఫలశ్రుతి గూర్చి చెప్పట.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ।
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యా త్కృతకృత్యశ్చ భారత॥ 20

ఓ అర్జునా! అత్యంత గోప్యమైన ఈ శాస్త్రమును నీకు తెలిపినాను. ఈ తత్త్వమును గ్రహించిన మనుజుడు జ్ఞాని అవుతాడు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే పురుషోత్తమప్రాప్తియోగోనామ పఞ్చదశోऽధ్యాయః**



### అపార భక్తి కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
న సర్వవి ద్భజతి మాం సర్వభా వేన భారత॥

*15వ అధ్యాయము - 19వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 50, జప సంఖ్య - ఒక లక్షా 25 వేలు*

### ఉన్నత విద్యా ప్రాప్తి కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్॥

*15వ అధ్యాయము - 14వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 15, జప సంఖ్య - 1 లక్ష 50 వేలు*

### కోపావేశాలు తగ్గుట కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతి ర్జ్ఞాన మపోహనంచ।
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాన్తకృ ద్వేదవిదేవ చాహమ్॥

*15వ అధ్యాయము - 15వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 110, జప సంఖ్య - 1 లక్ష 10 వేలు*



# దైవాసురసమ్పద్విభాగయోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- ★ దైవాసుర సమ్పద్విభాగ యోగములో *1*వ శ్లోకము నుంచి *5*వ శ్లోకము వరకూ దైవిక గుణములు.
- ★ *6*వ శ్లోకము నుంచి *20*వ శ్లోకము వరకూ అసురీ సంపదల లక్షణము.
- ★ *21*వ శ్లోకము నుంచి *24*వ శ్లోకము వరకూ శాస్త్ర విరుద్ధమైన ఆచరణలను త్యజించుటా, శాస్త్రోక్త విధులను ఆచరించుట గూర్చి వివరించుట.



# దైవాసురసమ్పద్విభాగయోగః

*అవ. దైవసంపద ఏ ఏ గుణాల వల్లా, కార్యాల వల్లా కలుగుతుందో వివరించుట.*

*శ్రీ భగవాన్ ఉవాచ.*

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥ 1

శ్లో॥ అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్।
దయాభూతే ష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్॥ 2

శ్లో॥ తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా।
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత ॥ 3

 శ్రీ భగవానుడు పలికెను. అభయమూ, సత్త్వ సంశుద్ధి, నిరంతర దృఢ స్థితి, ఇంద్రియ నిగ్రహము, దేవతలను, గురువులను పూజించుట అగ్నిహోత్రాదికార్యాలు, వేదశాస్త్ర పఠనము, పరమాత్మ

గుణనామ కీర్తనలు... స్వకష్టాలను ఓర్చుకొనుట, గర్వము లేకుండుట, క్రౌర్యము లేకుండుట, ధర్మార్ధకార్యాలను చేయుట, చంచల స్వభావము లేకుండుట, ఎవరికీ ద్రోహం చేయకుండుట మొదలైన సుగుణముల వల్ల దేవసంపద కలుగుతుంది.

అవ. అసుర గుణ సంపద ఎలాంటి వారికి
కలుగుతుందో వివరించుట.

శ్లో॥ దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవచ।
అజ్ఞానం చాభిజాతస్య పార్ధ సమ్పద మాసురీమ్॥ 4

అర్జునా! డంభము, గర్వము, దురభిమానము, క్రోధము, పౌరుషము, అజ్ఞానముగల వారికి అసురీ స్వభావ సంపద కలుగుతుంది.

శ్లో॥ దైవీ సమ్ప ద్విమోక్షాయ నిబన్ధాయాఽఽసురీ మతా।
మాశుచ స్సమ్పదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ॥ 5

దైవసంపద మోక్షమునిస్తుంది. అసుర సంపద బంధనాలు కలగచేస్తుంది. కాన అర్జునా! నీవు దైవసంపద గలవాడవు. కాన దుఃఖించకు.

అవ. అసుర గుణాలను వివరించుట.

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవచ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్ధ మే శృణు॥ 6

ఓ అర్జునా... ఈ లోకమున దైవసంపద గలవారూ అసుర సంపద గలవారూ అనే రెండు విధాలైన ప్రాణులున్నారు. వాటిలో దైవసంపద గుణములు గల వారి గూర్చి నీకు తెలిపాను. ఇక అసుర సంబంధిత గుణాలని గూర్చి వినుము.



శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ జనా న విదు రాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥ 7

అసుర ప్రవృత్తి సంపద గలవారు ధర్మ ప్రవర్తనల గూర్చి గానీ, అధర్మ నివృత్తి గూర్చి గానీ తెలియకుందురు. శుచీ, ఆచారము సత్యములు గానీ తెలియవు.

శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగ దాహు రనీశ్వరమ్।
అపరస్పరసంభూతం కి మన్య త్కామ హేతుకమ్॥ 8

అసుర తత్వం గలవారు ఈ సకల జగత్తు వేదప్రమాణమనీ ధర్మవ్యవస్థలతో పరమాత్మ సృష్టించాడనీ అంగీకరించక, స్త్రీ పురుష సంయోగముల వల్లే జీవులు పుడుతున్నారని భావిస్తారు.

అవ. లోకానికి నష్టములు కలిగించు వారి గూర్చి వివరించుట.

శ్లో॥ ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవ న్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥ 9

అలాంటి పిడివాదంతో నాస్తిక దృష్టితో ప్రవర్తించే వారు మంద బుద్ధులు, క్రూర స్వభావము కలవారు, లోకమునకు విరోధులు. లోక వినాశనము కొరకు జన్మిస్తున్నారు.

శ్లో॥ కామ మాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః।
మోహా ద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్త న్తేఽశుచివ్రతాః॥ 10

డంభము, దురభిమానము, మదములు వంటి అసుర లక్షణములతో అపవిత్రమైన కార్యాలను చేస్తూ కామములను ఆశ్రయించి శాస్త్ర విరుద్ధముగా ప్రవర్తిస్తున్నారు.

అవ. అపవిత్ర కార్యాల వల్ల కలిగే ఫలములు.

శ్లో॥ చిన్తా మపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః॥ 11

శ్లో॥ ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహన్తే కామభోగార్థ మన్యాయే నార్థసఞ్చయాన్ ॥ 12

అట్టి వారు జీవుడు వెళ్ళే వరకూ అపార చింతనలతో గడుపుతారు. విషయ భోగాలపై మమకారం పెంచుకొని అదే మహా సుఖమని భావిస్తారు. అనేక ఆశాపాశములకు బంధీయైపోతారు. కామక్రోధాలలో చిక్కి, వాటి అనుభవము కొరకు అన్యాయ అక్రమ మార్గాల ద్వారా ధనమును సంపాదిస్తున్నారు.

*అవ. మహా భయంకర నరకలోకాన్ని ఎలాంటి వారు చేరుతున్నారో శ్రీ భగవానుడు వచించుట.*

శ్లో॥ ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్॥ 13

శ్లో॥ అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహ మహంభోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ॥ 14

శ్లో॥ ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామిమోదిష్య ఇ త్యజ్ఞానవిమోహితాః॥ 15

శ్లో॥ అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥ 16

నా కోరికలను తీర్చుకున్నాను. పురుషార్థిని. ఇకపై నా మనోరథాలన్నీ పొందగలను. నా వద్ద ఎంతో సంపద ఉంది. ఇంకా ఎంతో ధనాన్ని సంపాదించగలను. నా శత్రువులను తొలగించాను. మిగిలిన శత్రువులనూ వధిస్తాను. నేనే అధిపతిని. సకల సుఖ భోగాలను అనుభవించగలవాడను నేను మాత్రమే. కోరినదాన్ని తీర్చుకోగల శక్తి వుంది. నేను మహాబలవంతుడను. సుఖవంతుడను. ధనముంది.



పరివారముంది. నాతో ఎవరు సమమవ్వరు. యజ్ఞాలూ, యాగాలూ చేస్తాను. కావాలసినంత సుఖాన్ని అనుభవిస్తాను. దానాలు చేస్తాను. ఆనందాన్ని పూర్తిగా అనుభవిస్తానని చిత్త చాపల్యములతో కూడినవారూ, కామములపై బహు ఆసక్తి వున్న వారు నరక లోకమున పడుతున్నారు.

*అవ. ఆత్మస్తుతి వల్ల కలిగే అనర్థాల గూర్చి అర్జునుడికి చెప్పట.*

శ్లో॥ ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భే నావిధిపూర్వకమ్॥ 17

అట్టి వారు తమకి తామే గొప్పవారిగా భావించుకుంటారు. మద గర్వాలతో, మహా దురంహకారాలతో కన్నూ, మిన్నూ గానక ఆత్మస్తుతి చేసుకుంటూ శాస్త్ర విరుద్ధమైన కార్యాలను చేస్తారు.

*అవ. సాటివారిని బాధపెట్టటమంటే తనని బాధ పెట్టడమేనని శ్రీ భగవానుడు అర్జునుడికి చెప్పట.*

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధంచ సంశ్రితాః।
మా మాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥ 18

అహంకారము, బలము, గర్వము, కామములతో ఇతరులను బాధిస్తూ తన శరీరంలోని ఆత్మనూ, అవతల వారి శరీరంలోనున్న ఆత్మనూ అనగా అంతర్యామి అయిన నన్నే బాధిస్తున్నారు.

శ్లో॥ తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు॥ 19

అలా ఇతరులను ద్వేషించు పాపాత్ములూ, క్రూరులైన వారూ మాటిమాటికీ జనన మరణరూపమైన ఈ సంసారము నందు నీచ జన్మలెత్తుతున్నారు.

శ్లో॥ ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవకౌన్తేయ తతో యాన్త్యధమాంగతిమ్ ॥ 20

ఓ అర్జునా...అసుర ప్రవృత్తి గల మూఢులూ మందమతులూ నన్ను పొందక అంతకంతకూ అధోగతి పాలవుతున్నారు.

అవ. కామాదులను వదిలించుకొనటమే పరమ శ్రేయస్కరమని శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ త్రివిధం నరక స్యేదం ద్వారం నాశన మాత్మనః।
కామః క్రోధ స్తథా లోభస్తస్మా దేతత్త్రయం త్యజేత్॥ 21

కామక్రోధ లోభములు నరకద్వారములు. అవే ఆత్మకు నాశనములు. అవి మనుజుడిని అధోగతి పాలు చేస్తాయి. వినాశనమును కలుగ చేస్తాయి. కాన ఆ మూడింటినీ వదలి వేయవలెను.

శ్లో॥ ఏతై ర్విము క్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభి ర్నరః।
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్॥ 22

అర్జునా! మహా భయంకర స్థితి గల ఆ మూడు నరక ద్వారముల నుంచి బైట పడాలి. దైవ కర్మలు ఆచరించాలి. అప్పుడు మాత్రమే వాడు పరమగతిని పొందుతున్నాడు.

అవ. తనకి తాను మంచి చేసుకునే విధము చెప్పట.

శ్లో॥ య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥ 23

ఓ అర్జునా! అజ్ఞాన రూపములైన ఆ మూడింటినీ అనగా కామక్రోధ లోభములను విడిచినవాడు తనకి తాను శ్రేయస్సును కలుగ చేసుకుంటున్నాడు.

అవ. శాస్త్ర ప్రకారము నడుచుకోమని శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥ 24



కాన నీవు చేయదగినదీ, చేయరానిదీ నిర్ణయించుటకు శాస్త్రమే ప్రమాణము. అట్టి శాస్త్రమందు చెప్పినదాన్ని బాగుగా గ్రహించి అట్టి కర్మలను చేయుము.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే దైవాసురసమ్పద్విభాగయోగోనామ షోడశోఽ ధ్యాయః**

## సకల దోష నాశనము కొరకు జపించాల్సిన మంత్రము

శ్లో॥ అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽ శుచౌ॥

*16వ అధ్యాయము - 16వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 11, జప సంఖ్య - 10 వేలు*



# శ్రద్ధాత్రయవిభాగయోగః

***ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-***

- ఈ శ్రద్ధాత్రయవిభాగ యోగములో 1వ శ్లోకము నుంచి 6వ శ్లోకము వరకు ఘోర తపస్సుల గూర్చి.
- 7వ శ్లోకము నుంచి 22వ శ్లోకము వరకు ఆహారము, యజ్ఞము, తపస్సు, దానముల గూర్చి.
- 23వ శ్లోకము నుంచి 28వ శ్లోకము వరకూ ఓం తత్ సత్‌లను మంత్ర ప్రయోగముల గూర్చి.



# శ్రద్ధాత్రయవిభాగయోగః

అర్జున ఉవాచ.

శ్లో॥ యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽ న్వితాః।
తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్త్వ మాహో రజస్తమః॥ 1

 అర్జునుడు పలికెను. ఓ శ్రీకృష్ణా! శాస్త్ర విధిని ఆచరింపక భక్తిశ్రద్ధలతో యజ్ఞములూ, దైవపూజలూ చేయుచున్న వారి నిష్ఠలు సాత్త్వికమా? రాజసమా? తామసమా?

అవ. అర్జునుడి ప్రశ్నలకి శ్రీ భగవానుడి సమాధానాలు.

భగవానుని ఉవాచ.

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥ 2

 శ్రీ భగవానుడు పలికెను. మనుజుని (పూర్వ జన్మ ఫలము) స్వభావమును బట్టి వచ్చే శ్రద్ధ సాత్త్వికమనీ, రాజసమనీ, తామసమనీ మూడు విధాలుగా ఉండును. వాటి గూర్చి వినుము.

అవ. ఆ గుణములే మనుషుని స్వరూపమని చెప్పట.

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయంపురుషో యో యచ్ఛ్రద్ధస్సఏవసః॥ 3

ఓ అర్జునా! సర్వప్రాణులకు వారి అంతఃకరణకు తగినట్టే శ్రద్ధ ఉంటుంది. ప్రతివారికి ఏదో ఒకదానిపై శ్రద్ధ ఉంటుంది. ఆ శ్రద్ధని బట్టే అనగా దానిని బట్టే అతడికెంత శ్రద్ధ కలిగింది తెలియును.

అవ. ఏ ప్రవృత్తి గలవారు ఎవర్ని పూజిస్తున్నారో
శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః॥ 4

అట్టి వారిలో సాత్త్వికులు దేవతలనూ, రాజసులు యక్ష రాక్షసులనూ, తామసులు ప్రేతభూతాది గణాలని పూజించుచున్నారు.

అవ. అసుర స్వభావములతో చేయు తపస్సు వల్ల కలిగే
నష్టము గూర్చి వచించుట.

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥ 5

శ్లో॥ కర్శయన్త శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః।
మాం చైవాన్తశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్॥ 6

శాస్త్ర వ్యతిరేకమైన తపస్సులను డంభము, అహంకారము లతో, కోరికలతో ఆచరిస్తున్నారు. అట్టివారు శరీరంలోని జ్ఞానేంద్రియా లనూ, నన్ను కూడా కృశింపచేయుచున్నారు. అట్టి వారు అసుర స్వభావము కలవారని ఎరుంగుము.

అవ. మూడు విధాలైన ఆహారములను గూర్చి శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు॥ 7



సకల జనులకు ఆహారము వారి ఇష్టాన్ని బట్టి మూడు విధాలుగా ప్రీతి కలుగుతోంది. వాటి వివరములను వినుము. అలాగే తపస్సు, దానములు గూర్చి వాటి బేధములను గూర్చి కూడా వివరిస్తున్నాను.

అవ. సత్త్వ గుణములు గలవారికి
ఇష్టమైన ఆహారము గూర్చి.

శ్లో॥ ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివ వర్ధనాః।
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః॥ 8

ఆయువునూ, మనోబలమునూ, శరీరబలాన్నీ, ఆరోగ్యాన్నీ, సౌఖ్యమునూ, కోరికలనూ వృద్ధి చేసేది రసవంతములైన ఆహారమే. అనగా పాలూ, చక్కెర వంటివి.

రసవంతములైనవి దేహముయందు ఎక్కువ కాలం ఉంటాయి. మనోహరమైన ఇట్టివి సత్త్వగుణములు గలవారికి ప్రీతి.

అవ. రజోగుణము గలవారికి ప్రీతి గల ఆహారము గూర్చి
శ్రీ భగవానుడు వచియించుచున్నాడు.

శ్లో॥ కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥ 9

చేదుగానూ, పులుపుగానూ, వేడీ, ఉప్పుతోనూ, కారముతోనూ కలిగిన ఆహారం ఎక్కువ దాహమును కలగ చేస్తాయి. దేహానికి దుఃఖము, మనస్సుకి శోకము కలగచేయు ఆ ఆహారము రజోగుణము గలవారికి ప్రీతి.

అవ. తమోగుణము గలవారికి ఇష్టమైన
ఆహారము గూర్చి చెప్పట.

శ్లో॥ యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥ 10

ఎప్పుడో వండినది, నిలువ ఉండినది, రసహీనమైనది, వాసన వచ్చేది, ఓ రోజు నిలువ ఉండేది, ఎంగిలి గలది, పరమాత్మకు నివేదింపనది అయిన ఆహారము తమోగుణము గలవారికి ఇష్టం.

అవ. సాత్త్విక యజ్ఞము యొక్క లక్షణము.

శ్లో॥ అఫలాకాఙ్క్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమే వేతి మన స్సమాధాయ స సాత్త్వికః॥ 11

శాస్త్రముగలదైనదనీ, చేయదగినదనీ నిర్ణయించుకొని నిష్కామకర్మయోగుల పురుషార్థ సాధనమని కాక యజ్ఞము చేయటం కర్తవ్యమని భావించి చేసిన యజ్ఞము సాత్త్విక యజ్ఞము.

అవ. రాజస యజ్ఞ లక్షణము.

శ్లో॥ అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థ మపిచైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ 12

అట్లే అర్జునా! ఫలాపేక్షతోనూ, డంభము కొరకూ, నిష్ఠ లేకుండా, ఆడంబరము కొరకూ చేసే యజ్ఞం రాజస యజ్ఞమని తెలుసుకో.

అవ. తామస యజ్ఞ లక్షణముల గూర్చి చెప్పట.

శ్లో॥ విధిహీన మసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ 13

శాస్త్రబద్ధం కానిదీ, అన్నదానము చేయనిదీ, మంత్ర పఠనము లేనిదీ, దక్షిణలు ఇవ్వనిదీ, శ్రద్ధ లేనిదీ అయినది తామస యజ్ఞము.

అవ. శరీర తపస్సుల గూర్చి చెప్పట.



శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥ 14

దేవతలనూ, బ్రాహ్మణులనూ, గురువులనూ, జ్ఞానులనూ పూజించుట, నిరాడంబరత్వము, బ్రహ్మచర్యము, అహింసలనునవి శారీరక తపస్సులుగా తెలుసుకొనుము.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ 15

ఆవేశ ఉద్వేగాలు కలిగించనిదీ, ఇతరులను బాధించనిదీ, నొప్పించనిదీ, సత్యంగలదీ, శ్రేయస్సుని ఇచ్చేదీ అలాగే వేదాధ్యయనమూ, పరమాత్మ నామ జపములూ ఇట్టివి వాక్కుకి సంబంధించిన తపస్సులు.

శ్లో॥ మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే॥ 16

ప్రశాంతమైన మనస్సు, ఆవేశ ఉద్వేగాలు లేని శాంత స్వభావము, మౌనము, హృదయశుద్ధి, ఆత్మనిగ్రహము వంటివి మానసిక తపస్సులుగా గ్రహించు.

అవ. సాత్త్విక, రాజసిక, తామసిక తపస్సుల గూర్చి వివరించుట.

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తప స్తత్త్రివిధం నరైః।
అఫలాకాఙ్క్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥ 17

ఫలములు కోరుకోకుండా నిశ్చల స్థిర చిత్తంతో, శ్రద్ధతో చేయబడే శారీరిక, వాక్కు, మనస్సు సంబంధిత తపస్సులను సాత్త్విక తపస్సులంటారు.

శ్లో॥ సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్।
క్రియతే త దిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్॥ 18

కాగా ప్రతిఫలం ఆశించీ, గౌరవాది పూజలు అందు కొనుటకూ, వ్యధ చెందుతూ చేసే తపస్సూ, దానమూ రాజస తపస్సని గ్రహించు.

శ్లో॥ మూఢగ్రాహే ణాత్మనో య త్పీడయా క్రియతే తపః।
పర స్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్॥ 19

మొండీ, మూర్ఖపు పట్టుదలలతో, తనకి బాధ కలిగించు కుంటూ, ఇతరులకి హాని చేస్తూ చేసే తపస్సు తామస తపస్సు.

అవ. దానములు చేయు ధర్మపద్ధతిని గూర్చి
శ్రీ భగవానుడు వివరించుట.

శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతేఽ నుపకారిణే।
దేశే కాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥ 20

దానము చేయటము ధర్మమని తలచి దానము చేయాలి. పుణ్యప్రదేశాల యందూ, పుణ్య కాలమందూ ఇచ్చే దానమూ, అట్లే అంగవైకల్యము ఉన్నవారికీ, ముసలి వారికీ ఇచ్చే దానము సాత్త్వికదానము.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్రాజస ముదాహృతమ్॥ 21

ప్రతిఫలం ఆశించి ఎవరో చెప్పారని బాధపడుతూ తప్పక ఇచ్చే దానము రాజసదానము.

శ్లో॥ అదేశకాలే యద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే।
అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్॥ 22



దానములు తగిన వారికి ఇవ్వాలి. ఇచ్చే వారి పట్ల తృణీకార భావం... తక్కువ భావం ఉండరాదు. అపాత్రులకు ఇవ్వరాదు. అట్టివి తామస దానములు.

అవ. ఓం, తత్, సత్‌ల గూర్చి వివరించుట.

శ్లో॥ ఓం త త్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥ 23

ఓం, తత్, సత్ అను నామములు పరబ్రహ్మవి. ఆ పరబ్రహ్మ నుంచే బ్రాహ్మణులు వేదములు, యజ్ఞములు ఏర్పరుచుట జరిగినది.

శ్లో॥ తస్మా దో మి త్యుదాహృత్య యజ్ఞ దానతపః క్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్॥ 24

కాన శాస్త్ర సమ్మతములైన యజ్ఞ దాన తపస్సులలో వేద మంత్రములు పఠించువారు ముందుగా 'ఓం' అని పలికి ఆరంభిస్తారు.

శ్లో॥ త ది త్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపః క్రియాః।
దానక్రి యాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః॥ 25

మోక్షాన్ని ఆశించేవారూ, ఫలంపై ఆశ లేనివారూ, లోక కళ్యాణము కోసం చూసేవారూ అంతా పరమాత్మ అన్న భావంతో 'తత్' అని ప్రారంభిస్తారు.

శ్లో॥ సద్భావే సాధుభావేచ స ది త్యేత త్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥ 26

ఓ అర్జునా! 'సత్' అను పదం మంచిదీ, కలదూ అన్న అర్థాన్ని ఇస్తుంది. ఉత్తమమైన కార్యాల యందు పరబ్రహ్మ నామము 'సత్' వాడబడుతోంది.

*శ్లో॥ యజ్ఞే తపసి దానేచ స్థితి స్స దితి చోచ్యతే।*
*కర్మచైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే॥* **27**

యజ్ఞ, తపస్సు, దానములందు నిష్ఠని సత్ అని చెప్పబడుతోంది. ఇంకా పరమాత్మను ఉద్దేశించి చేయబడే బ్రహ్మకర్మలు కూడా 'సత్' అని పిలవబడుతున్నాయి.

*అవ. శ్రద్ధ లేని కార్యము ఎట్టి ప్రయోజనము ఇవ్వదని శ్రీ భగవానుడు చెప్పట.*

*శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతంచ యత్।*
*అసది త్యుచ్యతే పార్థ నచ తత్ప్రేత్య నో ఇహ॥* **28**

ఓ అర్జునా! శ్రద్ధ లేకుండా ఆచరించే హోమములు, ఇచ్చే దానములు, తపస్సు ఇంకా అనేక శుభ కర్మములను 'అసత్'గా చెప్పబడుతుంది. అట్టి వాటి వల్ల ఇహలోకంలో గానీ, పరలోకంలోగానీ ఎలాంటి ప్రయోజనము లేదు.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే శ్రద్ధాత్రయవిభాగయోగం బన్నది**
**పదునేడవ యధ్యాయము**

**మానసిక ప్రశాంతత కొరకు జపించాల్సిన మంత్రము**

*శ్లో॥ శ్రద్ధయా పరయా త ప్తం తప స్త్రిత్రివిధం నరైః।*
*అఫలాకాజ్క్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥*

*17వ అధ్యాయము – 17వ శ్లోకము, చేయాల్సిన రోజులు – 15,*
*జప సంఖ్య – 75 వేలు*





# మోక్షసన్న్యాసయోగః

**ఈ అధ్యాయమునందు ప్రధాన అంశములు :-**

* ఈ మోక్షసన్న్యాస యోగములో
* 1వ శ్లోకము నుంచి 12వ శ్లోకము వరకూ త్యాగము గూర్చి.
* 13వ శ్లోకము నుంచి 18వ శ్లోకము వరకూ సాంఖ్య సిద్ధాంతముల గూర్చి.
* 19వ శ్లోకము నుంచి 40వ శ్లోకము వరకూ జ్ఞానము, బుద్ధి, కర్మ, ధైర్య, సుఖాల గూర్చి.
* 41వ శ్లోకము నుంచి 48వ శ్లోకము వరకూ వర్ణ ధర్మములు.

- ★ ***49***వ శ్లోకము నుంచి ***55***వ శ్లోకము వరకూ బ్రహ్మ సాక్షాత్కార సిద్ధి గూర్చి.
- ★ ***56***వ శ్లోకము నుంచి ***60***వ శ్లోకము వరకూ గీతా సార నిష్కామ కర్మ యోగము గూర్చి.
- ★ ***61*** శ్లోకము నుంచి ***66***వ శ్లోకము వరకూ గీతాసార సంగ్రహము.
- ★ ***67***వ శ్లోకము నుంచి ***73***వ శ్లోకము వరకూ గీతా మహిమ.
- ★ ***74***వ శ్లోకము నుంచి ***78***వ శ్లోకము వరకూ సంజయుడి గీతా ప్రార్థన.



# మోక్షసన్న్యాసయోగః

*అర్జున ఉవాచ.*

**శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుమ్।**
**త్యాగస్యచ హృషీ కేశ పృథ క్కేశినిషూదన॥** ***1***

*ఓ మహాబాహూ! సన్యాసము యొక్క తత్త్వమునూ, త్యాగము యొక్క తత్త్వమునూ వేరు వేరుగా తెలుసుకొనగోరుతున్నాను.*

*అవ. శ్రీ భగవానుడు అర్జునుడికి సమాధానము చెప్పుట.*

*శ్రీ భగవాన్ ఉవాచ.*

**శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసంకవయోవిదుః।**
**సర్వకర్మ ఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః॥** ***2***

*శ్రీ భగవానుడు పలికెను. ఓ అర్జునా! కామకర్మలను వదలటమే సన్యాసమని పండితుల అభిప్రాయము. కాని కొందరు*

విచక్షణ కలిగిన వారు మాత్రం సకల కర్మ ఫలములను త్యజించటమే త్యాగమని చెప్పుచున్నారు.

శ్లో॥ త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః।
యజ్ఞదానతపః కర్మ న త్యాజ్య మితి చాపరే॥ 3

మరికొందరు పండితులు కర్మలన్నీ దోషములేనని గాన వాటిని త్యజించాలని చెబుతున్నారు. ఇంకొందరు యజ్ఞము, దానము, తపస్సు వంటివి విడువరాదని చెబుతున్నారు.

అవ. మూడు విధాలైన త్యాగము గూర్చి చెప్పట.

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః॥ 4

ఓ పురుషశ్రేష్ఠా.. అర్జునా! సన్యాసము, త్యాగము అను విషయాలలో తొలుత త్యాగము గూర్చి వినుము. త్యాగము సాత్త్వికము, రాజసము, తామసములని మూడు విధములు.

శ్లో॥ యజ్ఞదాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥ 5

యజ్ఞము, దానము, తపస్సులనే కర్మలు త్యజింపదగినవి కావు. అవన్నీ పవిత్రులను చేయుచున్నాయి. విడవదగినవి కావు.

శ్లో॥ ఏతా న్యపితు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలానిచ।
క ర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్॥ 6

కాన ఓ పార్థా! యజ్ఞ, దాన, తపస్సుల గూర్చి ఆసక్తినీ, ప్రతిఫలములనూ విడిచి చేయుట ఉత్తమము.

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ 7



విధ్యుక్తమైన కర్మలను త్యాగము చేయుట తగదు. అవివేకంతో వాటిని వదలటం తామస త్యాగం అవుతుంది.

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥ 8

సకల కర్మలన్నీ దుఃఖకారములే అని భావించి, శరీర క్లేశములనకు భీతి చెంది కర్మలను వదలిన వాడు అనగా త్యజించటమే రాజస త్యాగము అవును.

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున।
సఙ్గం త్యక్త్వా ఫలంచైవ సత్యాగ స్సాత్త్వికో మతః॥ 9

ఓ అర్జునా! నిత్యకర్మలన్నీ కర్తవ్యములే. అట్టి వాటి యందు ఆసక్తినీ, ఫలాపేక్షలనూ త్యజించి చేయటమే సాత్త్విక త్యాగమని చెప్పబడుతోంది.

అవ. కర్మలపై ప్రీతి తగదని
శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ నద్వే ష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥ 10

సత్యగుణము కలవాడూ, జ్ఞానవంతుడూ ఎట్టి సందేహములు లేనివాడై త్యాగనిరతతో దుఃఖాన్ని తెచ్చి పెట్టే సకల కర్మలను ద్వేషింపడు. అలాగే సుఖాలని ఇచ్చే కర్మలపై మమకారం పెంచుకోడు.

అవ. త్యాగ లక్షణమును గూర్చి చెప్పట.

శ్లో॥ నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః।
యస్తు కర్మ ఫలత్యాగీ స త్యాగీ త్యభిధీయతే॥ 11

శరీర ధారికి కర్మలను త్యజించటము చాలా కష్ట సాధ్యమే. ఎవరైతే కర్మ ఫలాలని వదిలెయ్యగలుగుతున్నాడో అట్టి వాడు త్యాగి.

అవ. కర్మఫలం త్యాగము చేయనివారికి వచ్చే
జన్మల గూర్చి చెప్పట.

శ్లో॥ అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్।
భవ త్యత్యాగినాం ప్రేత్యనతుసన్న్యాసినాం క్వచిత్॥ 12

కర్మఫలత్యాగము చేయని మనుజులకి, మంచి చెడూ రెండింటి మిశ్రమాలు గల ఫలాలు ఉంటాయి. అవన్నీ మరణానంతరం కలుగుతాయి. ఆయా ఫలములు బట్టి పక్ష్యాది, మానవ, దేవతా జన్మలుంటాయి. కర్మ ఫలం త్యాగము చేసిన వారికి అవి అంటవు.

అవ. కర్మలను పోగొట్టే వేదాంత విషయాలను శ్రీ భగవానుడు చెప్పుట.

శ్లో॥ పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥ 13

ఓ మహాబాహూ.. సకల కర్మసిద్ధులకి అయిదు హేతువులున్నాయి. కర్మలను పోగొట్టే ఐదు కారణములు వేదాంత శాస్త్రమున చెప్పబడెను. అవి వినుము.

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్।
వివిధాచ పృథ క్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥ 14

సకల కర్మాచరణ విషయమున కర్తా, దేహమూ, ఇంద్రియములూ, వివిధములూ, దైవములను ఈ అయిదు కారణాలు.

శ్లో॥ శరీరవాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః।
న్యాయ్యంవా విపరీతంవా పఞ్చై తే తస్య హేతవః॥ 15



మనుజుడు మనస్సూ, వాక్కులతో చేసే కర్మలు ధర్మమైనా, అధర్మమైనా ఆ కర్మలకు అయిదు కారణాలుంటాయి.

శ్లో॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః।
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న సపశ్యతి దుర్మతిః॥ 16

సకల కర్మలకీ కారణాలు అయిదే అయినా మనుజుడి విపరీత బుద్ధి వల్ల తను చేసిన కార్యానికి ఆత్మనే కర్తగా భావిస్తాడు. వాడు అవివేకి. అట్టివాడు యదార్థమును తెలుసుకొనుటలేదు.

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే।
హత్వాపి స ఇమాఀ లోకాఀ న హన్తి న నిబధ్యతే॥ 17

కర్మల విషయములలో ఎవరైతే అహంకారమునూ, మమకారాలనూ త్యజిస్తాడో అట్టివాడు లోకమునందు అందరినీ సంహరించినా సంహరించిన వాడు కాడు. అట్టివాడు కర్మల చేత బంధింపబడడు. పాపములు అతడికి అంటవు. అధర్మ ఫలము ద్వారా వచ్చే పశు, పక్షుల జన్మలను పొందడు.

అవ. కర్మలకి కారణాలు చెప్పట.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః॥ 18

కర్మ ప్రేరణకి జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనునవి మూడు కారణములు. కర్త, కరణము, క్రియలను కర్మ సంగ్రహములు మూడు.

శ్లో॥ జ్ఞానం కర్మచ కర్తాచ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావ చ్ఛృణుతాన్యపి॥ 19

సాంఖ్యశాస్త్రమునందు జ్ఞాన, కర్మ, కర్తలను సత్త్వరజ స్తమోగుణ బేధములు చెప్పబడినవి. వాటిని వివరిస్తాను. వినుము.

శ్లో॥ సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్షతే।
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥ 20

అనేక రకాల రూపాలతో సకలప్రాణులయందూ శాశ్వతుడైన పరమాత్మ సమభావంతోనున్నాడని జ్ఞాని తెలుసు కొనగలుగుతున్నాడు. చూడగలుగుతున్నాడు. అట్టి వాని జ్ఞానము సాత్త్విక జ్ఞానము.

శ్లో॥ పృథక్త్వేనతు యద్ జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తద్ జ్ఞానం విద్ధి రాజసమ్॥ 21

సకలప్రాణుల యందు అనేకవిధాలైన జీవులను మనుజుడు వేరు వేరుగా భావిస్తున్నాడో అలాంటి జ్ఞానము రాజస జ్ఞానము.

శ్లో॥ యత్తు కృత్స్నవ దేకస్మి న్కా ర్యే సక్త మహేతుకమ్।
అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్॥ 22

ప్రకృతి కార్యములైన వాటిని సమస్తంగా భావించి, వాటి యందే ప్రీతి కలిగి అదే జ్ఞానమని భావిస్తారు. అట్టిది హేతువు లేనిదీ, అల్పమైనదీ, తుచ్ఛమైనదీ, అర్థరహితమైనదీ. అలాంటి విపరీత జ్ఞానమే తామస జ్ఞానము.

అవ. సాత్త్విక కర్మను గూర్చి చెప్పట.

శ్లో॥ నియతం సఙ్గరహిత మరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్త త్సాత్త్విక ముచ్యతే॥ 23

ఏ కర్మల యందు ఫలాపేక్షలూ, రాగ ద్వేషములూ లేక నియమితంగా ఆచరించే కర్మలన్నీ సాత్త్విక కర్మలనబడును.

అవ. రాజస కర్మను గూర్చి చెప్పట.



శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కా రేణవా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్ ॥ 24

ఫలమును ఆశించీ, అహంకారముతోనూ, ధన, వ్యయ ప్రయాసలతోనూ చేసే యాగాదికర్మలు రాజస కర్మలనబడును.

అవ. తామస కర్మను గూర్చి చెప్పట.

శ్లో॥ అనుబన్ధం క్షయం హింసా మనవేక్ష్య చ పౌరుషమ్।
మోహా దారభ్యతే కర్మ యత్త త్తామస ముచ్యతే ॥ 25

శుభములూ, అశుభములూ, హానీ, హింసనీ గమనించక అజ్ఞానముతోనూ, అవివేకముతోనూ చేయబడే సమస్త కర్మలన్నీ తామస కర్మలనబడును.

అవ. సాత్త్విక కర్త గుణాలు.

శ్లో॥ ముక్తసఙ్గోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ 26

ఎట్టి ఆసక్తిలేనివాడూ, అహంకార పూరిత ప్రసంగములు చేయనివాడూ, ధైర్యము, ఉత్సాహము కలవాడూ, కార్యము సిద్ధించినా, సిద్ధింపక పోయినా ఎట్టి విషాదము చెందడు. అట్టి వాడగు కర్త సాత్త్వికుడని చెప్పబడుచున్నాడు.

అవ. రాజస కర్త గుణాలు.

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥ 27

అనురాగము కలవాడూ, ఫలములపై ఆసక్తి గలవాడూ, శుచీ శుభ్రతలు లేనివాడూ, సుఖ, శోకములు గలవాడూ అగు కర్త రాజస కర్త అని చెప్పబడుతున్నాడు.

అవ. తామస కర్త గుణములు
గూర్చి చెప్పట.

శ్లో॥ అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైకృతికో ఽ లసః।
విషాదీ దీర్ఘసూత్రీచ కర్తా తామస ఉచ్యతే ॥ 28

జితేంద్రియుడు గాని వాడూ, పామరుడూ, మూర్ఖుడూ, ఇతరులను హింసించువాడూ, సోమరిపోతూ, సదా చింతనాపరుడూ, కార్యములందు ఉపేక్ష గలవాడూ అయిన కర్త తామస కర్త అని చెప్పబడుతున్నాడు.

అవ. త్రివిధ రూపముల గూర్చి శ్రీ భగవానుడు చెబుతున్నాడు.

శ్లో॥ బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు।
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ ॥ 29

అర్జునా! బుద్ధి, ధృతులను, గూడ గుణ బేధములను మూడు విధములైన వాటి గూర్చి విడివిడిగా చెప్పెదను వినుము.

అవ. తొలుత సాత్త్విక బుద్ధి గూర్చి.

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే।
బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్త్వికీ ॥ 30

ప్రవృత్తి, నివృత్తి, కర్తవ్యము, అకర్తవ్యము, భయమూ, అభయమూ, బంధనమూ, మోక్షమునూ తెలుసుకొనగలిగే బుద్ధి సాత్త్వికబుద్ధి.

అవ. రెండోదయిన రాజస బుద్ధి గూర్చి.

శ్లో॥ యయా ధర్మ మధర్మంచ కార్యం చాకార్యమేవచ।
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ॥ 31



ఓ పార్థా! ధర్మాధర్మములను, కార్యాకార్యములను ఎలా ఉన్న వాటిని అలా గ్రహించక భిన్నముగా గ్రహించటమే రాజస బుద్ధి అనుదురు.

అవ. మూడోదయిన తామస
బుద్ధి గూర్చి చెప్పట.

శ్లో॥ అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసావృతా।
సర్వార్థా న్విపరీతాంశ్చ బుద్ధి స్సా పార్థ తామసీ॥ 32

అర్జునా! ఎవని బుద్ధి అజ్ఞానముతో కప్పబడి ధర్మమును అధర్మముగా భావిస్తూ సకల విషయములను విరుద్ధంగా భావిస్తున్నాడో అట్టి వాని బుద్ధి తామసబుద్ధి.

అవ. త్రివిధములైన ధైర్యముల గూర్చి
శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియా।
యోగే నావ్యభిచారణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ॥ 33

అర్జునా! ధైర్యము చేత మనస్సు, ప్రాణ ఇంద్రియములు చెదరకుండా యోగము చేత మనఃప్రాణేంద్రిక్రియలను ధారణ చేయటమే సాత్త్విక ధృతి అని పిలవబడును.

అవ. రాజస ధృతి గూర్చి చెప్పట.

శ్లో॥ యయాతు ధర్మకామార్థా న్ధృత్యా ధారయతేఽ ర్జున।
ప్రసఙ్గేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ రాజసీ ॥ 34

కానీ ఓ అర్జునా! ధైర్యము వల్ల ధర్మార్థకామములనే నిత్య కార్యాలుగా తలచి ధరిస్తున్నాడో ఆ ధృతి రాజసికమైనదని చెప్పబడును.

అవ. తామసిక ధృతి గూర్చి వివరించుట.

శ్లో।। యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ తామసీ।। 35

పార్థా! నిద్రా, భయ శోక చింతనములూ, మదములూ, విషాదములూ విడవకున్న దానిని తామసిక ధృతి అని పిలవబడును.

అవ. త్రిగుణములైన సుఖము గూర్చి చెప్పట.

శ్లో।। సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాన్తంచ నిగచ్ఛతి।। 36

శ్లో।। యత్త దగ్రే విషమివ పరిణామేఽ మృతోపమమ్।
త త్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్।। 37

అర్జునా.. దేని అభ్యాసము వల్ల మానవుడు జ్ఞానవైరాగ్య, ధ్యాన దుఃఖనాశనములనూ, సుఖాలనూ పొందుతున్నాడో అట్టి సుఖాలను నేను నీకు మూడు విధాలుగా తెలుపుతున్నాను.

వినుము... తొలిదశ యందు అనగా బుద్ధి ప్రసన్నత వల్ల కలిగిన సుఖము విషయంగా ఉండి ఆపై అమృత తుల్యమగును. దాన్నే సాత్త్విక సుఖమందురు.

శ్లో।। విషయేన్ద్రియసంయోగా ద్యత్త దగ్రేఽ మృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్।। 38

ఇంద్రియములు వల్ల అనగా విషయేంద్రియ సంయోగము వల్ల కలిగే సుఖము తొలుత అమృత మయంగానూ కాలక్రమేణా విషతుల్యమవుతుంది. అట్టి దానిని రాజస సుఖమందురు.

శ్లో।। య దగ్రే చానుబన్ధేచ సుఖం మోహన మాత్మనః।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామస ముదాహృతమ్।। 39



ఇక తామస సుఖమును గూర్చి వినుము. నిద్ర, సోమరితనము, మోహము వల్ల కలిగేవి తామస సుఖములు. తొలుత, అవసాన దశల యందు ఆత్మకు మోహము కలిగిస్తాయి.

అవ. ఈ త్రిగుణములైన గుణములతో కూడి వుండని వస్తువు ఏదీ లేదని శ్రీ భగవానుడు చెప్పచున్నాడు.

శ్లో।। న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషువా పునః।
సత్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభి స్స్యా త్రిభిర్గుణైః।। 40

ప్రకృతి పరంగా వచ్చే ఈ మూడు గుణాల నుంచి తప్పించుకునే వస్తువు భూమి యందుగానీ, స్వర్గము యందుగానీ దేవతల యందు గానీ లేదు.

అవ. గుణాన్ని బట్టే కర్మ అని పరమాత్మ చెప్పట.

శ్లో।। బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరన్తప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః।। 41

అర్జునా! నాలుగు వర్ణాలు గల వారి వారి స్వభావములు వల్ల కలిగే గుణములచేతనే వారి వారి కర్మలను నిర్ణయించుట జరిగినది. అనగా కర్మలు విభజింపబడినవని గ్రహించు.

అవ. విప్రులకి నిర్ణయించిన కర్మలు.

శ్లో।। శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవ చ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మ కర్మస్వభావజమ్।। 42

అంతఃకరణ నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, తపస్సు, శుచీ, పక్కవారి తప్పులను క్షమించుట, వేదాల యందూ, పరమాత్మ యందూ, పరలోక వాసుల యందూ పూర్ణ విశ్వాసము. ఇవి బ్రాహ్మణులకి నియమించిన స్వభావ సిద్ధమైన కర్మలు.

అవ. క్షత్రియునకు నిర్దేశించిన కర్మలు.

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధేచా ప్యపలాయనమ్।
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥ 43

పరాక్రమము, ధైర్యము, పాలన, కార్యదక్షత, వెన్ను చూపకుండుట, దానములు, సమన్యాయంతో పాలన చేయుట ఇవి క్షత్రియ స్వాభావిక కర్మలు.

అవ. వైశ్యులకి నిర్దేశించిన కర్మలు.

శ్లో॥ కృషిగౌరక్ష్యవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥ 44

వ్యవసాయము, గోవుల రక్షణ, వాణిజ్య కార్యకలాపాలు వైశ్యుల స్వభావిక కర్మలు. అన్ని వర్ణముల వారిని సేవించే కర్మ శూద్రులకు పూర్వజన్మ సంస్కారము వల్ల ఏర్పడినది. స్వభావ సిద్ధమైనది.

అవ. స్వకర్మలో పరమాత్ముడిని సేవించటంలో కూడా
పరమగతిని పొందవచ్చని చెప్పట.

శ్లో॥ స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి త చ్ఛృణు ॥ 45

తమ తమ స్వభావికమైన కర్మలయందు కూడా పరమసిద్ధిని పొందవచ్చు. స్వకర్మలలో పరమగతిని పొందేటందుకు చెయ్యాల్సిన విధులను తెలుపుతున్నాను.

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥ 46

ఎవరి వల్ల ప్రాణులకు జననములు జరుగుతున్నాయో మరియు ఎవని చేత ఈ జగత్తు అంతా వ్యాపించి వుందో అట్టి



పరమాత్మను స్వకర్మచే మనుజుడు అర్పించి సేవించి సిద్ధిని పొందుతున్నాడు.

అవ. దోషముగలదైనా స్వకర్మని వీడకూడదని శ్రీ భగవానుడు చెప్పెను.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్।
స్వభావనియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్॥ 47

చక్కగా ఆచరించబడెడి పరధర్మము కంటే గుణము లేనిదయినను స్వధర్మానుష్ఠానము శ్రేష్ఠమైనది. స్వభావ సిద్ధమైన కర్మమును చేయువాడు పాపము పొందజాలడు.

అవ. స్వధర్మములో దోషమున్నా సరే వదలకూడదని చెప్పట.

శ్లో॥ సహజం కర్మ కౌన్తేయ సదోష మపి న త్యజేత్।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥ 48

అర్జునా! పొగ చేత అగ్ని కప్పబడినట్టు, కర్మలన్నీ ఏదో ఒక దోషంతోనే ఉంటాయి. అయినా విడువరాదు. సహజ కర్మలను వదలరాదు.

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసే నాధిగచ్ఛతి ॥ 49

ఓ అర్జునా! ఐహిక ప్రాపంచిక విషయాలపట్ల ఆసక్తి లేనివాడూ, ఆత్మ నిగ్రహం కలవాడూ, కోరికలు లేనివాడూ, సాంఖ్య యోగము ద్వారా అంతఃకరణమును జయించిన వాడూ పరమ శ్రేష్ఠమైన నైష్కర్మ్య సిద్ధిని పొందును.

అవ. జ్ఞాన నిష్ఠల ద్వారా ఆత్మను దర్శించవచ్చునని చెప్పట.

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే।
సమాసే నైవ కౌన్తేయ నిష్ఠా జ్ఞానస్య యా పరా॥ 50

ఓ అర్జునా! సిద్ధిని పొందినవాడు ఏల బ్రహ్మమును పొందుతున్నాడో, అటులే ఉత్తమమైన జ్ఞాన నిష్ఠల ద్వారా ఆత్మ సాక్షాత్కారము ఎటుల పొందవచ్చో వినుము.

**శ్లో॥ బుద్ధ్యావిశుద్ధయా యుక్తోధృత్యాఽఽత్మానంనియమ్యచ।**
**శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ ॥ 51**

**శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।**
**ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ 52**

**శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।**
**విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥ 53**

విశుద్ధమైన బుద్ధి కలవాడై సాత్త్విక ఆహారమును స్వీకరిస్తూ అదీ మితంగా తీసుకుంటూ శబ్దాది విషయాలను విడిచి, రాగద్వేషములకు అతీతుడై, ఏకాంత వాసి అయి, మనస్సునూ, వాక్కునూ నిలకడ చేసినవాడూ, ధ్యానయోగపరాయణుడూ, అహంకారములూ, బలదర్పములనూ, కామములనూ, క్రోధములనూ, మొండితనమునూ, సంపదలనూ, మమకారాలనూ విడిచినవాడూ, శాంతుడూ, శరీర యాత్రపై మమకారం లేనివాడూ, మనస్సుపై నియంత్రణ కలవాడూ అట్టి వాడు బ్రహ్మత్వమును పొందుటకు సమర్థుడగుతున్నాడు.

**శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి।**
**సమస్స ర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ 54**

అలాంటి పరబ్రహ్మమును కోరు సమర్థుడు దేనిని గూర్చి దుఃఖించడు, కోరడు. సకల ప్రాణుల యందు సమభావంతో నా ప్రీతిని పొందుతున్నాడు.



**శ్లో॥ భక్త్యా మా మభిజానాతి యావాన్ యశ్చాస్మితత్త్వతః।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥ 55**

అపార భక్తి ప్రపత్తులతో నన్ను యదార్థంగా తెలుసుకొనుచున్నాడు. అలా నా గూర్చి తెలుసుకున్నవాడు ఆ సమయమునే నా స్వరూప స్థితి యందు అనగా నా యందే ప్రవేశించుచున్నాడు.

అవ. భగవంతుణ్ణి ఆశ్రయించిన వారికి శాశ్వతమోక్షం లభిస్తుందని చెప్పుట.

**శ్లో॥ సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః।**
**మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్॥ 56**

సకల కర్మలను సదా ఆచరిస్తూ ఎవరైతే నన్ను శరణు పొందుతున్నారో అట్టివాడు నా అనుగ్రహమునకూ, మోక్షమునకూ అర్హుడవుతున్నాడు.

అవ. అన్ని కర్మలను భగవంతునికి అర్పించటం ద్వారా కలిగే ఫలము చెప్పుట.

**శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।**
**బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ॥ 57**

నీవు సకల కర్మలను నిండు మనస్సుతో నాకే అర్పించి శరణు వేడితే, వాసుదేవుడనైన నన్నే పరమగతిగా భావించి ఆశ్రయిస్తే నేను ఎల్లవేళలా నా చిత్తమును నీయందే ఉంచుతాను.

**శ్లో॥ మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి।**
**అథచేత్త్వ మహఙ్కారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి॥ 58**

అనన్య శరణ్యుడవై నాయందు చిత్తము నిలిపినచో నా అనుగ్రహం పొందుదువు. సకల సంకటములను దాటగలవు. అటులగాక నేను పండితునని అహంకరిస్తే స్వకర్మ త్యాగముతో భ్రష్టుడవు అవుతావు.

అవ. ఈ ప్రకృతే నీచే రణం చేయిస్తుందని శ్రీ భగవానుడు అర్జునుడికి చెప్పట.

శ్లో॥ య దృహఙ్కార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాంనియోక్ష్యతి॥ 59

నీవు అహంతో యుద్ధం చేయను అని తలచిననూ నీ ప్రయత్నం ఫలించదు. వ్యర్థమే. నీ స్వభావమే అనగా నీ క్షత్రియ స్వభావమే నీ చేత యుద్ధమును చేయిస్తుంది.

అవ. మానవుడు తాను ఆ పని చేయకూడదని అనుకున్నా, కర్మ ప్రభావములు వల్ల తప్పక చేస్తాడని చెప్పట.

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ నిబద్ధ స్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్॥ 60

ఓ కౌంతేయా! మోహంతో నీవు నీ కర్మను ఆచరించుటకు ఇష్టపడక పోయావు. నీ పురాకృత సంస్కారముచే బంధించబడి తత్ ప్రభావమున పరవశుడవై యుద్ధమును తప్పక చేయుదువు.

అవ. ఈశ్వరుడు మహా మాయను ఎటుల చేస్తున్నాడో చెప్పట.

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽ ర్జున తిష్ఠతి।
భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥ 61

అర్జునా! శరీర రూపాలను ధరించిన సకల ప్రాణుల హృదయాలలో అంతర్యామిగా నున్న పరమాత్మ తన మహా మాయతో మంత్రగాడు కర్రబొమ్మను తిప్పుతున్నట్టు సమస్త జీవులను తిప్పుతున్నాడు.

శ్లో॥ త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥ 62

ఓ భరతా! సంసార దుఃఖ నివృత్తుల కొరకు సర్వాంతర్యామి అగు పరమేశ్వరుణ్నే శరణు వేడుము. వాని అనుగ్రహంతో



శాశ్వతమైన శాంతి మోక్షములను పొందగలవు. విష్ణు పదమును పొందగలవు.

అవ. అన్ని విషయాలను చెప్పాను. నీకేది చిత్తమో నీవే నిర్ణయించుకోవాలని అర్జునుడికి శ్రీకృష్ణుడు చెప్పట.

శ్లో॥ ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా।
విమృ శ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు॥ 63

అత్యంత రహస్యమైన దానికన్నా రహస్యమైనదైన జ్ఞానమును నీకు బోధించాను. దీనిని బాగుగా గ్రహించి, నీ ఇష్టమొచ్చినట్టు చేయగలవు.

అవ. ఇంతటి మహా రహస్యాలను నాకు ప్రీతిగలవాడవు గనుక నీకు చెప్పాను అని శ్రీ భగవానుడు చెప్పట.

శ్లో॥ సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః।
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్॥ 64

రహస్యములన్నింటికన్నా పరమ రహస్యమైనవీ, ఉత్తమమైనవీ అయిన నా వచనములు మరొకసారి వినుము. నీవు నాకు ఎంతో ప్రియమైన వాడవు. దాని వల్లే నీ హితము కోరి మరల చెబుతున్నాను.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే॥ 65

నాయందే మనస్సును స్థిరంగా ఉంచుము. నాకు ప్రీతిగల వాడివి కమ్ము. సేవించి, పూజించు. అట్లు చేయుట వల్ల నన్ను పొందగలవు. నాకు ఇష్టుడివి కమ్ము. సత్యప్రతిజ్ఞ చేసి చెబుతున్నాను.

అవ. చరమ శ్లోకము... గీతా శాస్త్రము సారమంతయు ఇమిడ్చి శ్రీ భగవానుడు చెప్పెను.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః॥ 66

సకల ధర్మాలను అనగా సకల కర్మలను నాకు సమర్పించు. సకల శక్తివంతుడనూ, పరమేశ్వరుణ్ణీ అయిన నన్నే శరణు వేడు. అన్ని పాపముల నుంచి విముక్తుడ్ని చేస్తాను. కాన శోకింపకు.

*అవ. గీతను ఎవరికి అందివ్వకూడదో శ్రీ భగవానుడు చెప్పెను.*

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవేవాచ్యంనచమాంయోఽభ్యసూయతి॥ 67

అర్జునా! నేనే నీకు బోధించిన ఈ గీతా శాస్త్రమును తపస్సు చేయని వారికీ, భక్తులు కాని వారికీ, గురుసేవ తెలియనివారికీ, భగవత్ ద్వేషికీ చెప్పరాదు.

శ్లో॥ య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి।
భక్తింమయి పరాం కృత్వా మామేవైష్య త్యసంశయః॥ 68

పరమ రహస్యమైన గీతా జ్ఞానమును నా భక్తులకు ఎవరు చెబుతున్నాడో, అట్టివాడు నా యందు ఉత్తమమైన భక్తి గలవాడు. ఆ పరమభక్తుడు నన్నే పొందుతున్నాడు.

శ్లో॥ న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా నచ మే తస్మా దన్యః ప్రియతరో భువి॥ 69

మనుజులలో నాకు అతనికి మించిన ప్రీతి గలవారు లేరు. అతని వలే గానీ, అతనికి మించిగానీ నాకు ప్రియమైన వాడు ఈ భూమండలంలో మరియొకరు ఉండరు. భవిష్యత్తులో ఉండరు.

*అవ. గీతాశాస్త్రమును అధ్యయనము చేస్తే జ్ఞానయజ్ఞం చేసిన ఫలమని శ్రీ భగవానుడు చెప్పట.*



శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః।
జ్ఞానయజ్ఞేన తే నాహ మిష్ట స్స్యా మితి మే మతిః॥ 70

ధర్మపరమైన ఈ శ్రీకృష్ణార్జున సంవాదమైన గీతా శాస్త్రమును పఠించినవాడు జ్ఞానయజ్ఞము ద్వారా నన్ను పూజిస్తూ ఆరాధిస్తున్నాడని నా నిశ్చయము.

*అవ. గీతా గ్రంథమును చదివిన వారు మహా పుణ్యాన్ని పొందుతారని శ్రీ భగవానుడు వచించుట.*

శ్లో॥ శ్రద్ధావా ననసూయశ్చ శ్రుణయా దపి యో నరః।
సోఽపిముక్తశ్శుభాల్లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥ 71

ఈ గీతా శాస్త్రమును చదువు వాని దోషములెంచక శాస్త్రమును శ్రద్ధగా విన్నవాడు పాపముల నుంచి విముక్తుడై పుణ్య కర్మలను చేస్తూ ఉత్తమ లోకాలను పొందుతాడు.

శ్లో॥ కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా।
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనఞ్జయ॥ 72

ఓ పార్థా! నీవు నిశ్చల చిత్తముతో ఈ గీతాశాస్త్రమును వింటివికదా? అజ్ఞానము వల్ల కలిగిన మోహమూ, అవివేకమూ పోయినదా?

*అవ. భగవానుని ప్రశ్నకు అర్జునుడి సమాధానము.*

అర్జున ఉవాచ.

శ్లో॥ నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత।
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ॥ 73

అర్జునుడు చెప్పెను. ఓ అచ్యుతా! నీ మహోన్నతమైన అనుగ్రహంతో నా మోహం సంపూర్ణంగా నశించింది. ఆత్మ స్మృతిని పొందాను. సంశయములు లేనివాడనయ్యాను. నీ ఆజ్ఞను పాలింతును.

*అవ. గీతా శాస్త్రమును విన్న సంజయుడు తనకి కలిగిన పరమానందం గూర్చి ధృతరాష్ట్రునకు చెప్పట.*

సంజయ ఉవాచ.

**శ్లో॥ ఇ త్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।**
**సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్॥ 74**

సంజయుడు పలికెను. అలా మహాత్ముడగు వాసుదేవుడు, అర్జునుల సంవాదము విన్నాను. అద్భుతమైనది, గగుర్పాటును కలిగించినది. తనువుని పులకింప చేస్తోంది.

**శ్లో॥ వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్య మహం పరమ్।**
**యోగంయోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥ 75**

మహానుభావుడైన వ్యాసభగవానుని అనుగ్రహంతో దివ్య దృష్టితో పరమ గోప్యమైన ఈ గీతను యోగేశ్వరుడైన పరమాత్మ శ్రీకృష్ణభగవానుడు స్వయంగా అర్జునుడికి చెబుతుండగా నేను ప్రత్యక్షంగా విన్నాను.

**శ్లో॥ రాజన్ సంస్మృత్యసంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్।**
**కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః॥ 76**

ఓ ధృతరాష్ట్రా! శ్రీ కృష్ణ పరమాత్మకూ, అర్జునునికీ మధ్య జరిగిన అతిరహస్యమైన ఈ అద్భుతమైన సంవాదము తలుచుకొన్న కొద్దీ మహాపరవశం చెందుతున్నాను.

**శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః।**
**విస్మయోమే మహాన్ రాజన్ హృష్యామిచ పునః పునః॥ 77**

ఓ రాజా! శ్రీ కృష్ణ పరమాత్ముని విలక్షణ పరమాద్భుత అపూర్వమైన విశ్వరూపాన్ని తలచిన కొద్దీ నాకు పరమ ఆశ్చర్యము కలుగుతోంది. మరల మరల సంతోషము కలుగుతోంది.



*అవ. కృష్ణార్జునులున్న చోట సకల శుభములు కలుగుతాయని సంజయుడు చెప్పట.*

**శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః।**
**తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ॥ 78**

యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడూ, ధనుర్ధారుడైన అర్జునుడూ ఎచట ఉంటారో అక్కడ సంపదలూ, సకల విజయములూ, సకల ఐశ్వర్యములూ, దృఢనీతీ ఉండును. అది నా నిశ్చితమైన అభిప్రాయము.

**ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే**
**శ్రీకృష్ణార్జున సంవాదే మోక్షసన్న్యాసయోగో నామ**
**అష్టాదశోధ్యాయః సమాప్తః**

**సంపూర్ణము**

**హరిః ఓమ్ తత్ సత్**

**శ్రీ పరబ్రహ్మార్పణమస్తు**

**శుభం.**

## భార్యా భర్తల సఖ్యత కొరకు జపించాల్సిన మంత్రము

**శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।**
**కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసఙ్గ్రహః॥**

*18వ అధ్యాయము - 18వ శ్లోకము, చేయాల్సిన రోజులు - 21, జప సంఖ్య - 15 వేలు*



# శ్రీ భగవద్గీతా శ్లోకములకు అకారాదివర్ణక్రమ సూచి

శ్రీభగవద్గీతాశ్లోకపాదానుక్రమణిక సంపూర్ణము



## శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రప్రారంభః

విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్య భవత్ప్రభుః,
భూతకృ ద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః. 1
పూతాత్మా పరమాత్మచ ముక్తానాం పరమా గతిః,
అవ్యయః పురుషస్సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ. 2
యోగో యోగ విదాం నేతా ప్రధానపురుషేశ్వరః,
నారసింహవపు శ్శ్రీమాన్ కేశవః పురుషోత్తమః. 3
సర్వశ్శర్వ శ్శివస్థాణు ర్భూతాది ర్నిధిరవ్యయః,
సమ్భవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః. 4
స్వయమ్భూ శ్శమ్భురాదిత్య పుష్కరాక్షో మహాస్వనః,
అనాదినిధనో ధాతా విధాతా ధాతురు త్తమః. 5



అప్రమేయో హృషీకేశః పద్మనాభోఽ మర ప్రభుః,
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠస్స్థవిరో ధ్రువః 6
అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః,
ప్రభూత స్త్రి కకుబ్ధామ పవిత్రం మఙ్గళం పరమ్. 7
ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠ శ్శ్రేష్ఠః ప్రజాపతిః,
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః. 8
ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః,
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్. 9
సురేశశ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః,
అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయస్సర్వదర్శనః. 10
అజస్సర్వేశ్వర స్సిద్ధః స్సిద్ధస్సర్వాదిరచ్యుతః,
వృషాకపి రమేయాత్మా సర్వయోగవినిస్సృతః. 11
వసుర్వసుమనాస్సత్య స్సమాత్మా సమ్మిత స్సమః,
అమోఘః పుణ్డరీకాక్షో వృషకర్మా వృషాకృతిః. 12
రుద్రో బహుశిరా బభ్రు ర్విశ్వయోనిశ్శుచిశ్రవాః,
అమృతశ్శాశ్వతః స్థాణు ర్వరారోహో మహాతపాః. 13
సర్వగస్సర్వ విద్భాను ర్విష్వక్సేనో జనార్దనః,
వేదోవేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః. 14
లోకాధ్యక్షస్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః,
చతురాత్మా చతుర్వ్యూహ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః. 15

భ్రాజిష్ణుర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః,
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః. 16
ఉపేన్ద్రో వామనః ప్రాంశు రమోఘ శ్శుచిరూర్జితః,
అతీన్ద్రసంగ్రహస్సర్గో ధృతాత్మా నియమో యమః. 17
వేద్యోవైద్యస్సదాయోగీ వీరహా మాధవో మధుః,
అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః 18
మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః.
అనిర్దేశ్యవపుశ్శ్రీమా నమేయాత్మా మహాద్రిధృత్. 19
మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాంగతిః,
అనిరుద్ధస్సు రానన్దో గోవిన్దో గోవిందాం పతిః. 20
మరీచిర్దమనో హంస స్సువర్ణో భుజగోత్తమః,
హిరణ్యానాభస్సుతపాః పద్మనాభః ప్రజాపతి. 21
అమృత్యుస్సర్వదృక్సింహ స్సన్ధాతా స్సన్ధిమా న్ స్థిరః,
అజో దుర్మర్షణశ్శాస్తా విశ్రుతాత్మా సురారిహాః. 22
గురుర్గురుతమో ధామ సత్యస్సత్య పరాశ్రమః,
నిమిషోఽ నిమిషస్రగ్వీ వాచస్పతి రుధారధీః. 23
అగ్రణీ ర్గామణి శ్శ్రీమా న్న్యాయోనేతా సమీరణః,
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్ష స్సహస్రపాత్. 24
ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః,



అహస్సంవర్తకో వహ్ని రనిలో ధరణీధరః. 25
సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వసృడ్విశ్వభుగ్విభుః,
సత్కర్తా సత్కృతస్సాధు ర్జహ్ను ర్నారాయణోనరః 26
అసంఖ్యేయోఽ ప్రమేయాత్మా విశిష్టశ్శిష్టకృచ్ఛుచిః,
సిద్ధార్థ స్సిద్ధసఙ్కల్పః స్సిద్ధిదసిద్ధిసాధనః. 27
వృషాహీ వృషభో విష్ణు ర్వృషపర్వా వృషోదరః,
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తశ్శృతిసాగరః. 28
సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుదో వసుః,
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః. 29
ఓజస్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః,
ఋద్ధస్స్పష్టాక్షరోమన్త్ర శ్చన్ద్రాంశుర్భాస్కరద్యుతిః 30
అమృతాంశూద్భవో భానుః శశిబిన్దుస్సురేశ్వరః,
ఔషధం జగతస్సేతు స్సత్యధర్మపరాక్రమః. 31
భూతభవ్యభవన్నాథః పవనః పావనోఽ నలః,
కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః. 32
యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః,
అదృశ్యోఽ వ్యక్తరూపశ్చ సహస్రజిదనన్తజిత్, 33
ఇష్టో ఽ విశిష్టశ్శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః,
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః. 34

అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః,
అపాంనిధి రధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః. 35
స్కన్దఃస్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః,
వాసుదేవో బృహద్భానుః ఆదిదేవః పురన్దరః. 36
అశోకస్తారణ స్తారః శూరశ్శౌరిర్జనేశ్వరః,
అనుకూలశ్శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః. 37
పద్మనాభోఽ రవిన్దాక్షః పద్మగర్భశ్శరీరభృత్,
మహర్ధి వృద్ధో వృద్ధాత్మా మహక్షో గరుడధ్వజః 38
అతులశ్శరభో భీమ స్సమయజ్ఞో హవిర్హరిః,
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితిఞ్జయః. 39
విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరస్సహః,
మహీధరో మహాభాగో వేగవానమితాశనః. 40
ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః,
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః 41
వ్యవసాయో వ్యవస్థానః సంస్థానస్థానదో ధ్రువః,
పరర్ధిః పరమస్పష్ట స్తుష్టః పుష్ట శ్శుభేక్షణః. 42
రామో విరామో విరజో మార్గోనేయో నయోఽ నయః,
వీరశ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః. 43
వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః,
హిరణ్యగర్భశ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః. 44



ఋతుస్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః,
ఉగ్రస్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః. 45
విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్,
అర్థో ఽ నర్థో మహాకోశో మహాభోగో మహాధనః. 46
అనిర్విణ్ణ స్థవిష్ఠో భూ ర్ధర్మ యూపో మహామఖః,
నక్షత్రనేమిర్నక్షత్రీ క్షమః క్షామస్సమీహనః. 47
యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుస్సత్రం సతాం గతిః,
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞాన ముత్తమమ్. 48
సువ్రత స్సుముఖస్సూక్ష్మ స్సుఘోషస్సుఖదస్సుహృత్,
మనోహరో జితక్రోధో వీరబాహుర్విదారణః. 49
స్వాపనస్స్వపనో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్,
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః. 50
ధర్మకృద్ధర్మగుద్ధర్మీ సదసత్క్షర మక్షరమ్,
అవిజ్ఞాతా సహస్రాంశు ర్విధాతా కృతలక్షణః. 51
గభస్తినేమి స్సత్త్వస్థ స్సింహోభూత మహేశ్వరః,
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః. 52
ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః,
శరరీ భూతభృ ద్భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః 53
సోమపోఽ మృతపస్సోమః పురుజిత్పురుసత్తమః,

నయోఽ జయస్సత్యసంధో దాశార్హ స్సాత్త్వతాంపతిః54
జీవో వినయితాసాక్షీ ముకున్దోఽ మితవిక్రమః,
అమ్భోనిధిరనన్తాత్మా మహోదధిశయోఽ న్తకః. 55
అజో మహార్హ స్స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః,
ఆనందో నందనోనందః సత్యధర్మా త్రివిక్రమః. 56
మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః,
త్రిపద స్త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాన్తకృత్. 57
మహావరాహోగోవిన్ద స్సుషేణః కనకాంగదీ,
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః. 58
వేధాస్స్వాంగోఽ జితః కృష్ణో దృఢస్సఙ్కర్షణోఽ చ్యుతః
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః. 59
భగవాన్ భగహా ఽఽ నన్దీ వనమాలీ హలాయుధః,
ఆదిత్యో జ్యోతిరాదిత్య స్సహిష్ణు ర్గతిసత్తమః. 60
సుధన్వాఖణ్డపరశు ర్దారుణో ద్రవిణ ప్రదః,
దివస్పృక్సర్వదృగ్వ్యాసో వాచస్పతి రయోనిజః. 61
త్రిసామా సామగస్సామ నిర్వాణం భేషజం బిషక్,
సన్న్యాసకృచ్ఛమశ్శాన్తో నిష్ఠాశ్శాన్తిః పరాయణమ్. 62
శుభాంగశ్శాన్తిదస్స్రష్టా కుముదః కువలేశయః,
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః. 63
అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః,



శ్రీవత్సవక్షాశ్శ్రీవాస శ్శ్రీపతిః శ్రీమతాం వరః. 64
శ్రీదశ్శ్రీశశ్శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః,
శ్రీధరః శ్రీకరశ్శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః. 65
స్వక్షస్స్వఙ్గశ్శతానన్దో నన్దిర్జ్యోతి ర్గణేశ్వరః,
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః. 66
ఉదీర్ణస్సర్వతశ్చక్షు రనీశ శ్శాశ్వత స్థిరః,
భూషయో భూషణో భూతిః ర్విశోక శ్శోకనాశనః. 67
అర్చిష్మా నర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః,
అనిరుద్ధోఽ ప్రతిరథః ప్రద్యుమ్నోఽ మితవిక్రమః. 68
కాలనేమినిహా వీర శౌరి శ్శూరజనేశ్వరః,
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః. 69
కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః,
అనిర్దేశ్యవపు ర్విష్ణు ర్వీరోఽ నన్తో ధనఞ్జయః. 70
బ్రహ్మణ్యో బ్రహ్మకృ ద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః,
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీబ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః. 71
మహాక్రమో మహాకర్మా మహాతేజో మహోరగః,
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః. 72
స్తవ్య స్స్తవప్రియస్స్తోత్రం స్తుతిస్స్తోతా రణప్రియః,
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః. 73
మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః,

వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః. 74
సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః,
శూర సేనో యదు శ్రేష్ఠ స్సన్నివాస స్సుయామునః. 75
భూతావాసో వాసుదేవః సర్వాసు నిలయోఽ నలః
దర్పహా దర్పదోఽ దృప్తో దుర్ధరోఽ థాపరాజితః. 76
విశ్వమూర్తి ర్మహామూర్తి ర్దీప్తమూర్తి రమూర్తిమాన్,
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః. 77
ఏకోనైక (స) స్సవః కః కిం య త్తత్పద మనుత్తమమ్
లోకబన్ధుర్లోక నాథో మాధవో భక్తవత్సలః. 78
సువర్ణవర్ణో హేమాంగో వరాంగశ్చన్దనాఙ్గదీ,
విరహా విషమశ్శూన్యో ఘృతాశీ రచలశ్చలః. 79
అమానీ మానదో మాన్యో లోకస్వామి త్రిలోకధృత్,
సుమేధా మేధజో ధన్యః స్సత్య మేధా ధరాధరః. 80
తేజోవృషో ద్యుతిధరః స్సర్వశస్త్రభృతాం వరః.
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృఙ్గో గదాగ్రజః. 81
చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః,
చతురాత్మా చతుర్భావ శ్చతుర్వేద విదేకపాత్. 82
సమావర్తో ఽ నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః,
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా. 83
శుభాఙ్గో లోకసారంగ స్సుతంతు స్తన్తువర్ధనః,



ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః. 84
ఉద్భవ స్సుందర స్సున్దో రత్ననాభ స్సులోచనః,
అర్కో వాజసని శ్శృఙ్గీ జయన్త స్సర్వవిజ్జయీ. 85
సువర్ణ బిందు రక్షోభ్య స్సర్వవాగీశ్వరేశ్వరః,
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః. 86
కుముదః కున్దరః కున్దః పర్జన్యః పావనోఽ నిలః,
అమృతాంశోఽ మృతవపు స్సర్వజ్ఞ స్సర్వతోముఖః. 87
సులభ స్సువ్రత స్సిద్ధ శ్శత్రుజి చ్ఛత్రుతాపనః,
న్యగ్రోధోదుంబరోఽ శ్వత్థ శ్చాణూరాన్ధ్రనిషూదనః. 88
సహస్రార్చి స్సప్తజిహ్వ స్సప్తైథా స్సప్తవాహనః,
అమూర్తిరనఘో ఽచిన్త్యో భయకృద్భయనాశనః. 89
అణుర్బృహత్కృశః స్థూలో గుణభృ న్నిర్గుణో మహాన్,
అధృతః స్వధృత స్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః. 90
భారభృత్కథితో యోగీ యోగీశః సర్వ కామదః,
ఆశ్రమః శ్రమణః క్షామ స్సుపర్ణో వాయువాహనః. 91
ధనుర్ధరో ధనుర్వేదో దణ్డో దమయితా దమః,
అపరాజిత స్సర్వసహో నియన్తా నియమో యమః. 92
సత్త్వవాన్ సాత్త్వికః స్సత్య స్సత్యధర్మపరాయణః,
అభిప్రాయః ప్రియార్హో ఽ ర్హః ప్రియాకృ త్ప్రీతివర్ధనః. 93
విహాయసగతిర్జ్యోతి స్సురుచిర్హు తభుగ్విభుః,

రవిర్విలోచన స్సూర్యః సవితా రవిలోచనః. **94**
అనన్తో హుతభుగ్భోక్తా సుఖదో నైకజోఽ గ్రజః,
అనిర్విణ్ణస్సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః. **95**
సనాత్సనాతనతమః కపిలః కపి రవ్యయః,
స్వస్తిదస్స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః. **96**
అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః,
శబ్దాతిగశ్శబ్దసహ శ్శిశిరశ్శర్వరీకరః. **97**
అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః,
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణ కీర్తనః. **98**
ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్న నాశనః,
వీరహా రక్షణ స్సన్తో జీవనం పర్యవస్థితః. **99**
అనన్తరూపో ఽ నంత శ్రీ ర్జితమన్యు ర్భయాపహః,
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః. **100**
అనాదిర్భూర్భువో లక్ష్మీ స్సువీరో రుచిరాంగదః,
జననో జనజన్మాది ర్భీమో భీమ పరాక్రమః. **101**
ఆధారనిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః,
ఊర్ధ్వగ స్సత్పథాచారః ప్రాణదః ప్రణవః ప్రణః. **102**
ప్రమాణం ప్రాణ నిలయః ప్రాణభృ త్ప్రాణజీవనః,
తత్త్వం తత్త్వవిదేకాత్మా జన్మమృత్యుజరాతిగః. **103**
భూర్భువస్స్వస్తరుస్తార స్సవితా ప్రపితామహః



యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః.**104**
యజ్ఞభృ ద్యజ్ఞకృ ద్యజ్ఞీ యజ్ఞభు ద్యజ్ఞ సాధనః
యజ్ఞాన్తకృద్యజ్ఞ గుహ్య మన్న మన్నాద ఏవచ. **105**
ఆత్మయోని స్స్వయంజాతో వైఖాన స్సామగాయనః,
దేవకీనన్దన స్స్రష్టా క్షితీశః పాపనాశనః. **106**
శఙ్ఖభృ న్నన్దకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః,
రథాంగపాణి రక్షోభ్య స్సర్వ ప్రహరణాయుధః. **107**

**(శ్రీసర్వప్రహరణా యుధోన్నమ ఇతి)**

వనమాలి గదీ శార్ ఙ్గీ శంఖీ చక్రీ చ నన్దకీ,
శ్రీమన్నారాయణో విష్ణు ర్వాసుదేవోఽ భిరక్షతు. **108**
(107,108శ్లోకాలు రెండుసార్లు పఠించాలి)





## శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రమ్

**ఓం దేవ్యువాచ :**

దేవదేవ మహాదేవ త్రికాలజ్ఞ మహేశ్వర,
కరుణాకర దేవేశభక్తానుగ్రహకారక,
అష్టోత్తరశతం లక్ష్మ్యాః శ్రోతుమిచ్ఛామి తత్త్వతః॥

**ఈశ్వర ఉవాచ:**

దేవి సాధు మహాభాగే మహాభాగ్య ప్రదాయకం।
సర్వైశ్వర్యకరం పుణ్యం సర్వపాప ప్రణాశనం॥
సర్వదారిద్ర్యశమనం శ్రవణా ద్భుక్తిముక్తిదం।
రాజవశ్యకరం దివ్యం గుహ్యాద్గుహ్యతమంపరం॥



దుర్లభం సర్వదేవానాం చతుష్షష్టికళాస్పదం।
పద్మాదీనాం వరాంతానాం నిధీనాం నిత్యదాయకం॥
సమస్త దేవ సంసేవ్యం మణిమాద్యష్ట సిద్ధిదం।
కిమిత్ర బహునోక్తేన దేవీ ప్రత్యక్షదాయకం॥
తవ ప్రీత్యా ఽ ద్య వక్ష్యామి సమాహిత మనాశ్శృణు॥

అస్య శ్రీలక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్ర మహామంత్రస్య। మహా లక్ష్మీః దేవతా। క్లీం బీజం। భువనేశ్వరీ శక్తిః। శ్రీ మహా లక్ష్మీ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః॥

| **కరన్యాసం** | **అంగన్యాసం** |
|---|---|
| ఓం శ్రీం సాం అంగుష్ఠాభ్యాం నమః | ఓం శ్రీం సాం హృదయాయ నమః |
| ఓం శ్రీం సీం తర్జనీభ్యాం నమః | ఓం శ్రీం సీం శిరసేస్వాహా |
| ఓం శ్రీం సూం మధ్యమాభ్యాం నమః | ఓం శ్రూం సూం శిఖాయై వషట్ |
| ఓం శ్రేం సైం అనామికాభ్యాం నమః | ఓం శ్రేం సైం కవచాయహుం |
| ఓం శ్రౌం సౌం కనిష్ఠికాభ్యాం నమః | ఓం శ్రౌం సౌం నేత్రాభ్యాం వౌషట్ |
| ఓం శ్రం సం కరతలకరపృష్ఠాభ్యాం నమః | ఓం శ్రం సం అస్త్రాయఫట్ |

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః



## ధ్యానమ్

వందే పద్మాకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం
భాగ్యదాం ।
హస్తాభ్యా మభయ ప్రదాం మణిగణై ర్నానావిధై
ర్భూషితాం।
భక్తాభీష్ట ఫలప్రదాం హరి హరబ్రహ్మాదిభి స్సేవితాం
పార్శ్వేపంకజ శంఖపద్మ నిధిభి ర్యుక్తాం సదా శక్తిభిః॥
సరసిజనయనే సరోజహస్తే ధవళతరాంశుక
గంధమాల్యశోభే,
భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీద
మహ్యాం.
ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూత హితప్రదామ్,
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్.
వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధాం,
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్.
అదితిం చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీమ్,
నమామి కమలాం కాంతాం కామాక్షీం క్రోధ సంభవాం.
అనుగ్రహపదాం బుద్ధిం మనఘాం హరివల్లభాం,
అశోకా మమృతాం దీప్తాం లోకశోకవినాశినీం
నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరం,



పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసుందరీం.
పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభప్రియాం రమాం,
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగంధినీం.
పుణ్యగంధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభాం,
నమామి చంద్రవదనాం చంద్రాం చంద్రసహోదరీం.
చతుర్భుజాం చంద్రరూపా మిందిరా మిందుశీతలాం,
ఆహ్లాదజననీం పుష్టిం శివాం శివకరీం సతీం.
విమలాం విశ్వజననీం పుష్టిం దారిద్ర్యనాశినీం,
ప్రీతపుష్కరిణీం శాంతాం శుక్లమాల్యాంబరాం శ్రియం.
భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీం,
వసుంధరా ముదారాంగాం హరిణీం హేమమాలినీం,
ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణసౌమ్యాం శుభప్రదాం,
నృపవేశ్మగతానందాం వరలక్ష్మీం వసుప్రదాం,
శుభాం హిరణ్యప్రాకారం సముద్రతనయాం జయాం,
నమామి మంగళాం దేవీ విష్ణువక్షస్స్థలస్థితాం,
విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణసమాశ్రితాం,
దారిద్ర్యధ్వంసినీం దేవీం సర్వోపద్రవవారిణీం.
నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణు శివాత్మికాం,
త్రికాలజ్ఞానసంపన్నాం నమామి భువనేశ్వరీం,
లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూతసమస్తదేవవనితాం లోకైక దీపాంకురాం

శ్రీమన్మందకటాక్ష లబ్ధవిభవత్ బ్రహ్మేంద్ర గంగాధరాం త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియాం.

మాత ర్నమామి కమలే కమలాయతాక్షీ శ్రీవిష్ణుహృత్క-మలవాసిని విశ్వమాతః

క్షీరోదజే కమలకోమలగర్భగౌరి లక్ష్మీ ప్రసీద సతతం నమతాం శరణ్యే.



## ఫలశ్రుతి

త్రికాలంయో జపేద్విద్వాన్ షణ్మాసం విజితేంద్రియః దారిద్ర్య ధ్వంసనం కృత్వా సర్వ మాప్నోతి యత్నతః దేవీ నామ సహస్రేషు పుణ్యమష్టోత్తరం శతం యేనశ్రియ



మవాప్నోతి కోటిజన్మ దరిద్రతః భృగువారే శతం ధీమాన్ పఠేద్వత్సర మాత్రకం,అష్టై శ్వర్య మవాప్నోతి కుబేర ఇవ భూతలే. దారిద్ర్య విమోచనం నామ స్తోత్ర మంబాపరం శతం యేన శ్రియమ వాప్నోతి కోటిజన్మ దరిద్రతః. భుక్తాతు విపులాన్ భోగా నస్యా స్సాయుజ్య మాప్నుయాత్ ప్రాతఃకాలే పఠేన్నిత్యం సర్వదుఃఖోపశాంతయే పఠంతు చింతయే ద్దేవీం సర్వాభరణ భూషితామ్.

**-శుభమ్-**

**మంగళము... శుభ మంగళము**

**యదక్షర పదభ్రష్టం। మాత్రాహీనం చ యద్భవేత్**

**తత్సర్వం క్షమ్యతాం దేవ। నారాయణ। నమోఽస్తుతే.**

ఓ స్వామీ! నారాయణా! అక్షరాలలో గానీ, పదములలో గానీ, అర్థపరమార్థములలో గానీ లోపం జరిగితే వాటిని దయతో నీవే క్షమించి మన్నించవలెను. నీకు నా నమస్కృతులు.